

ఏకాంతము — సాయంత్రము

చిత్రకారుడు: కొర్లపాటి వెంకట సత్యనారాయణమూర్తి — వాల్తేరు.



# సంస్మృతి

లక్షులాది భారతీయుల నిద్రాణ హృదయాలను జాగృతం చేసిన జాతీయ మహోద్యమంలో పాల్గొంటూ తమ వ్యక్తిత్వాన్ని, ప్రత్యేకతను మేరుశిఖరంలా నిలబెట్టుకోగలగడం, లక్షుల ధనం ఆర్జించి తృణసమానంగా త్యజించగలగడం, సనాతన ధర్మానుష్ఠానం చేస్తూనే కులమత జాత్యతీతమైన సర్వమానవ సమానత్వ ప్రాతిపదికను వేదికగా చేసుకోగలగడం, లక్ష్మీప్రసాదాన్ని సరస్వతీ సమారాధనకు వినియోగించగలగడం—ఇటువంటి మహాపురుష లక్షణాలన్నీ పుంజీభవించిన పుంభావ పరిపూర్ణత శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు. 'కర్మయోగో విశిష్యతే' అనే గీతావాక్యానుసారంగా కర్మలాచరిస్తూ, "తేన త్యక్తేన భుంజీథాః" అనే ఉపనిషద్వాక్యానుసారంగా జీవితాన్ని స్థితప్రజ్ఞ నిర్వచనంగా అనువదించుకుని జీవన్ముక్తులూ, ముక్తజీవనులూ అయిన మహావ్యక్తి పంతులుగారు.

రాజకీయంగా, సాంస్కృతికంగా, ఆర్థికంగా అన్నిటా భారతదేశం, ముఖ్యంగా ఆంధ్రదేశం, వెనకబడి వున్న రోజులవి. ఎవరే ఘనకార్యం ఆచరించదలచుకున్నా ఎన్నో అవాంతరాలను, అడ్డంకులను ఎదుర్కొని వీటి కెగురీదవలసివచ్చే రోజులవి. యావజ్జాతీ దాస్యనిగళ నిబద్ధమై, స్తబ్ధమైపోయిన రోజులవి. అలాంటి రోజుల్లో ఏదో సామాన్య ప్రభుత్వోద్యోగంతో తృప్తిపడి ఊరుకోగలిగిన పరిస్థితులను ఎదిరించి, స్వతంత్రంగా జీవించాలి, ఆదర్శాల కలలను నిజం చేసుకోవాలి, అనే ఆశయంతో బందరు నుంచి బొంబాయివరకూ వెళ్ళి, అష్టకష్టాలు పడి, సర్వశ్రేయస్సాధనమైన ధనమార్జించి, ఆంధ్రులకు విజ్ఞానదానం చేసిన వార, దిన, మాస పత్రికలను స్థాపించారు పంతులుగారు. ఎన్నో అమూల్య గ్రంథాలు సేకరించారు, ప్రచురించారు. ఎన్నో సంస్థలకు, ఉద్యమాలకు విరాళాలిచ్చారు. భాషకు, సంస్కృతికి, జాతికి ఎన్నో విధాలుగా సేవచేసి సర్వతోముఖ ప్రజ్ఞాశాలులనిపించుకున్నారు. దేశోద్ధారకులుగా, కళాప్రపూర్ణులుగా, విశ్వదాతగా అమరజీవులయినారు. వారి సంస్మరణం ఆంధ్రజాతి పవిత్ర కర్తవ్యం.

**వర్ధంతి : చైత్రశుద్ధ ద్వాదశి**

**[ ఏప్రిల్ 20, 1959 ]**

# ఆంధ్రసచిత్రవారపత్రిక

సంవత్సర చందా రు. 13—0—0 విడిపత్రిక 25 న.పై.

Founder: K. NAGESWARA RAO

వికారి చైత్ర శుద్ధ చతుర్దశి బుధవారం

సంపుటము 53 సంచిక 30 22-4-59


## విషయానుక్రమణిక

ముఖచిత్రం:

విరల్ ప్రొడక్షన్స్‌వారి 'జయవిజయ' చిత్రంలో కృష్ణకుమారి








## శ్రీరామ పాదుకాదానము

చిత్రకారుడు : వీరిశెట్టి అచ్యుతరావు—పుల్లేటికుర్రు.

# రాజధాని కబుర్లు



## 'ప్రవీణ్'

# "పదండిముందుకు, పదండిత్రోసుకు..."

రైళ్ళలో శిశు జననాలు అధికం కావడంవల్ల, రాక పోకలు ఆలస్యం ఔతున్నాయని ఒక వార్త. ఇట్టి పరిస్థితులలో రైళ్ళను నడిపించడానికి తాతలు దిగివస్తున్నారు అంటుంది రైల్వేశాఖ. కాని రైళ్లలో శిశు జననాలు అధికం కావడానికి రైళ్లు ఆలస్యంగా నడవడమే కారణమని కొందరు వ్యక్తులు భావిస్తున్నారు.

అసలు రైలు అన్నది అదో ప్రపంచమట. థర్డ్ క్లాసు కంపార్టుమెంటు మరో ప్రపంచమట. 'పదండి ముందుకు, పదండి త్రోసుకు..' అని శ్రీశ్రీ రాసిన గేయం థర్డ్ క్లాస్ టికెట్టు కొనుక్కొని రైల్వే ప్లాట్ ఫారంపై నిలబడ్డ ప్రయాణీకుల నుద్దేశించి వ్రాయబడిం దంటారు ఈ వ్యక్తులు.

పూర్వం నిజాం స్టేట్ రైల్వే బళ్లు నడిచేటప్పుడు అవి నెమ్మదిగా నడిచేవిట. కాని ముందుకే నడిచేవిట. ఒక సమయానికి ఫలానా స్టేషన్ చేరతాయంటే, ఎలాగోలాగ ఆ సమయానికి ఆ స్టేషన్‌కి చేరేవిట. సెంట్రల్ రైల్వే ఏర్పడినప్పటినుంచీ, రైళ్ళు అనుకున్న సమయానికి ఊరు చేరినా, వదిలినా—డ్రైవరుకీ, గార్డుకీ, స్టేషన్ మాస్టరుకీ జుల్మానా విధిస్తున్నారని రాజధాని నగరంలో వదంతులు వ్యాపించాయి ఈమధ్య.

ఆ వదంతులలో సత్యాసత్యాలు ఏమైనా—రైళ్ళను ఆలస్యంగా నడిపితే బహుమానా లేవో అధికారులు పంచిపెడుతున్నట్లే కనపడుతూంది. ఎంత ఆలస్యంగా వస్తే అంత మంచిది. ప్రయాణీకులు ఎంతబాధపడితే అంత మంచిది. పర్లి వైజ్ నాథ్ నుంచి ఉదయం బయలుదేరి వచ్చిన పేసెంజర్ బండి, నాంపల్లి చేరిన తర్వాత గంట గడిస్తే గాని సికిందరాబాదు దిశ పోదు. బెజవాడలో రాత్రి ఎప్పుడో బయలుదేరిన రైలుబళ్లు సికిందరాబాదు ఔటర్ సిగ్నల్ వద్ద వంది మాగధ ధ్వనులు చేస్తేనే గాని స్టేషన్‌లోకి ప్రవేశం లభించదు. సికిందరాబాదు చేరిన తర్వాత ఆయాసం తీరితేనే గాని నాంపల్లి దిశ పయనించవు రైళ్లు.

రైళ్ళు సమయానికి చేరాలనే కాంక్ష అధికారులకుంటే—హైదరాబాదు వెళ్ళవలసిన బళ్ళు, హైదరాబాదునుంచి రావలసిన బళ్ళు బెజవాడ ప్రభువుల అనుగ్రహానికై పడిగాపులు పడిఉండవలసిన పరిస్థితిని తప్పించాలి. బళ్ళు ఆలస్యంగా బయలుదేరినా మరింత ఆలస్యంగా వాటిని చేరవేసే పరిస్థితిని మార్పించాలి. రైలు వచ్చే సమయం అధికారులకి చూచాయగా తెలుస్తుంది కనుక 'ఔటర్ సిగ్నల్' వద్ద రైళ్లను పడవేసిఉంచే ఏర్పాట్లకు స్వస్తి చెప్పాలి. హైదరాబాదు వెళ్ళవలసిన బండ్లను సికిందరాబాదులోను; సికిందరాబాదు చేరవలసిన బండ్లను హైదరాబాదులోను జోకొట్టి నిద్రపుచ్చే అలవాట్లు మాన్పించాలి.

ఈ సందర్భంలో మార్చి 12 వ తేదీ ఉదయం ఘట్ కేసర్ స్టేషన్ బయట పూరీ ఫాస్ట్ పేసెంజర్ దాదాపు నలభైఐదు నిముషాలు ఎందుకు ఆగవలసి వచ్చిందో అధికారులు దర్యాప్తు చేయించాలి. (ఈ ఫాస్ట్ పేసెంజర్ నడకచూసి, ఒక భావకవి నిర్వచించాడు: 'ప్రయాణీకులను నిరాహారదీక్షలో నిలిపేబండి కనుక దాన్ని ఫాస్ట్ పేసెంజర్ అన్నారు' అని)

ఈ క్రింద కొన్ని అంకెలు ఇస్తున్నాను. జనవరి ఫిబ్రవరి మాసాల్లో మన రైళ్ళ నడకల తీరుల్ని సూచించే అంకెలవి. ఈ అంకెలు చూసి మీరు సిగ్గుపడతారని నాకు తెలుసు. మొదట ఈ వివరాలు సేకరించినపుడు నేనూ సిగ్గుపడ్డాను. కాని—దున్నపోతు మీద వర్షంపడ్డా, జి. టి. ఎక్స్‌ప్రెస్ పైపడ్డా ఒకటేనని, రైల్వే అధికారులకి సిగ్గుపడే అలవాటు లేదని మా మిత్రుడొకడన్నాడు. ఒకవేళ సిగ్గుపడ్డా, బొంబాయిలో హిందీలో పడతారు. మీకూ, నాకూ తెలియదు. మన సంగతి వారికి తెలియదు. కారణం? ఇది హైదరాబాదు. అది బొంబాయి. అల్లదిగో దూరంగా ఉన్నది నయాదిల్లీ. అవధరించండి:

(1) ఫిబ్రవరి 23 వ తేదీతో అంతమైన 54 రోజుల్లో (అక్షరాలా ఏభైనాలుగు రోజుల్లో) నెం. 48 పూరీ ఫాస్టు పేసెంజర్ రెండు దినాలు మాత్రం సమయానికి చేరుకుంది. జనవరి 23, 24 ఆ రెండు పర్వదినాలు, ఫిబ్రవరి 6 వ తేదిన ఈ బండి 5 గం. 45 ని. లు ఆలస్యంగా సికిందరాబాదు స్టేషన్ వదలి వెళ్ళింది. అదే నెల 18 వ తేదిన గం. 5–28 నిమిషాలు ఆలస్యంగా వదిలింది. ఈ 54 దినాలకు సగటు కడితే—పూరీ 'ఫాస్ట్' పేసింజర్ రోజూ

1 గం 16 ని. లు ఆలస్యంగా వస్తుందని తేలింది. ప్రభుత్వం యొక్క అసమర్థతకు చిహ్నం కాకపోతే—ఏ రాష్ట్రరాజధాని లోను రైళ్ళు ఇంత ఆలస్యంగా నడవవు.

(2) హౌరానుంచి వస్తూంటుంది రోజూ ఒక 'ఎక్స్‌ప్రెస్' బండి. ఆంధ్ర దేశంలోని దూర ప్రాంతాలనుండి రాష్ట్ర రాజధానికి పౌరులను తీసుకొనివచ్చే ఎక్స్‌ప్రెస్ బండి ఇదొక్కటే. ఇది జనవరి 31 రోజుల్లో ఐదు రోజులు సమయానికి వచ్చింది. ఫిబ్రవరి మొదటి మూడు వారాల్లో రెండు రోజులు సమయానికి వచ్చింది. ఈ 54 రోజులకీ సగటు ఆలస్యం అరగంట. జనవరి 31 వ తేదీన రెండు గంటల నలభై నిముషాలు ఆలస్యమైంది.

(3) మరోబండి ఉంది. దీన్ని '485 డౌన్' అంటారు. ఏదో కష్టపడి నాంపల్లికి సమయానికి చేరుకొని, నాంపల్లిలో కాళ్ళుచాచి పడుకొని, ఈ రైలు సికిందరాబాదు సగటున 1 గం 31 నిముషాలు ఆలస్యంగా వస్తూంది.

ఇట్టి పరిస్థితులలో రైళ్ళలోనే శిశు జననాలు ఔతున్నాయి అంటే ఆశ్చర్యం లేదు. మనుష్యులు చచ్చిపోతున్నారంటే ఆశ్చర్యం లేదు. ఈబాధలు భరించలేక ఒకమిత్రుడు వాపోయాడు. 'ఇలెక్కి జీవిత మంతా గడిపెయ్యడం కంటె రైలుక్రింద పడి మరణించడం మేలు' అని. దీనికూడా ఒక ఇబ్బంది వుంది: రైలుకడ్డంగా మనుష్యులు పడుకుంటే, ఇప్పుడు అవి నడుస్తూన్న వేగానికి మనుష్యుల పైనుంచి చక్రాలు పోలేవుట, రైళ్లు వచ్చి ఆగిపోతున్నాయిట.

## సంపత్‌కుమార్ ప్రదర్శనలు

ఈ 'రాజధాని కబుర్ల'లో స్టేజివిలన్ల వినియోగాన్ని నిరుత్సాహ పరచడానికి రాసిన పంక్తులను గురించి తన నిరసన భావాన్ని తెలియచేస్తూ 'ఆంధ్రప్రదేశ్ స్టేజివిలన్ల సమాఖ్య' ఒకనివేదిక పంపింది. 'ఎంత విలన్లమయినా, మీరనుకున్నంత విలన్లము కాదు; మావల్ల కూడా ఉపయోగాలున్నాయి' అన్నాయి ఫ్లడ్ లైట్, ఫుట్ లైట్, మైక్రఫోన్, రికార్డర్ ఆనివేదికపై సంతకం పెడుతూ.

ఈ యాంత్రిక సాధనాలవల్ల ఉపయోగాలు లేవనే భావం నాకు గుర్తున్నంతవరకు నేనెక్కడా వ్యక్తం చేయలేదు. ప్రదర్శనకు నటన ప్రధానం. యాంత్రిక సాధనాలు కేవలం సాధనాలు. ఆ విషయం మరచి, నటన ప్రాధాన్యతను విస్మరించి, ప్రదర్శనలకు పూనుకొనడం బాధాకరమైన విషయం. ఫ్లడ్ లైట్‌కి, ఫుట్ లైట్‌కి, టెలిఫోన్‌కి, మైక్రఫోన్‌కి—నా క్షమాపణలు.

గతవారం—(అంటే గతించిపోయిన ఒక వారం అని అర్థం)—జంట నగరాలలో విజయనగర వాసులు గీతా నృత్య కళామందిర బృందంవారు రెండు నృత్య ప్రదర్శన లిచ్చారు. యాంత్రిక సాధనాలను చక్కగా వాడుకున్న ప్రదర్శన లివి. ఈ ప్రదర్శనలలో ప్రత్యేకంగా పేర్కొనదగ్గది శ్రీ డి. వై. సంపత్ కుమార్ దర్శకత్వాన కుమారికలు కమల, సుమిత్ర, శ్రీయుతులు అప్పారావు, సన్యాసిరావు, సంపత్ కుమార్ ప్రదర్శించిన 'విప్లవశంఖం'నృత్యం. శ్రీశ్రీ గేయంలోని ప్రతి అక్షరానికి విడతీసి అర్థం చూపించారు శ్రీ సంపత్ కుమార్. ప్రదర్శనలో అక్కడక్కడ ఉదయశంకర్ బృందాన్ని అనుసరించిన పోకడలు కనిపించినా, చాలవరకు ప్రదర్శనలో ప్రత్యేకత కనుపించిందని చెప్పాలి.

దీనికి, 'జాలరి' నృత్యానికి వెనుక లైటింగు ఎఫెక్ట్స్ ఇచ్చిన శ్రీ కుమార్జీని ప్రత్యేకంగా పేర్కొనాలి. 'జాలరి' నృత్యంలో నీలి తెర కదలికవల్ల చూపించిన అలలు, 'విప్లవశంఖం'లో తెరపై చాయలుగా పడిన కర్మాగారాదులు అద్భుతంగా వున్నాయి. శ్రీ ఎ. వి. ఎస్. మూర్తి, కుమారి గీతాదేవిగారల నేపథ్యగానం హృదయ రంజకంగా వుంది. నృత్య ప్రదర్శనలు కొన్ని సంప్రదాయ విరుద్ధంగా వున్నాయి. కాని బోయి భీమన్నగారి 'ఒక్క దీపం'లో పాల్గొన్న కుమారి సుశీల భావవ్యక్తీకరణ, కుమారి కాంతి 'ఆంధ్ర తిల్లానా', కుమారికలు వీరరాజు, కాంతి చేసిన 'మధురా నగరిలో' నృత్యాలు మరచిపోవడం కష్టం. 'నా భూమి' ప్రదర్శన కాంతిహీనంగా వుంది. మిగిలిన ప్రదర్శనలు ఇంచుమించుగా ఉన్నాయి.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంకాని, సంగీతనాటక అకాడమీ కాని సహాయం చేసి, సరిదిద్దవలసిన తెలుగు సంస్థ ఇది. ★



శాసనసభాపతి శ్రీ కాశీశ్వరరావు రచించిన నూతన గ్రంథాలకు రాజధానిలో కేరళ గవర్నర్ శ్రీ బూర్గుల రామకృష్ణరావు ఏప్రిల్ 5 వ ఆవిష్కరణోత్సవం జరిపారు. శాసనమండలి అధ్యక్షుడు శ్రీ మాడపాటి హనుమంతరావు అధ్యక్షత వహించారు.



# న్యూఢిల్లీ లేఖ

— శ్రీకృష్ణ

# తృతీయ ప్రణాళికకు డబ్బెక్కడిది?

దలైలామా భారతదేశానికి వచ్చేశారు. పత్రికలనిండా ఆయన వార్తలే. భారత ప్రభుత్వం ఆయనకు ఆశ్రయం ఇచ్చింది. ఆయనపై నిర్బంధాలేమీ విధించమనీ, ఆయనకూడా తననూ, భారతప్రభుత్వాన్నీ ఇరుకునపడేసే పనులేమీ చెయ్యరని తాము భావిస్తున్నామనీ ప్రధాని నెహ్రూ చెప్పారు. దలైలామా నివాసస్థలం సరిహద్దుప్రాంతంలో గాని, దక్షిణ భారతంలో గాని ఉండదని కూడా చెప్పివేశారు. ఏదైమైనా ఈ ఎండా కాలానికి ఆయన ఉత్తరభారతంలోని ఏ వేసవికేంద్రంలోనో మకాం చెయ్యవచ్చు. ఆయన్ని చల్లని ప్రదేశంలో ఉంచినట్లూ అవుతుంది. రక్షణ సదుపాయాలు తేలిగ్గానూ ఏర్పాటు చెయ్యవచ్చు. దలైలామా కమ్యూనిస్టులకు, ముఖ్యంగా కమ్యూనిస్టు చైనాకు రొమ్ములోమీది కుంపటిలాగా ఉన్నారు. మరోక "ట్రాట్‌స్కీ ఉదంతం" జరగకుండా ఆయన్ని భారతప్రభుత్వం రక్షించుకుంటూ రావలసిఉంటుంది.

* * *

జాతీయాభివృద్ధి మండలి ఇటీవల రెండు రోజులపాటు సమావేశమైంది. ప్రధాన మంత్రి ప్రారంభోపన్యాసంచేస్తూ, జీవితంలో మామూలు సౌకర్యాలమాట అటుంచి, శుభ్రమైన మంచినీళ్ళయినా తాగటానికి నోచుకోని లక్షలాది భారతీయులనుగూర్చి ప్రస్తావించారు. అయినా ఆ వర్గం ప్రజలు ఆందోళన చెయ్యటంలేదనీ, వారికంటె ఎక్కువ ఆదాయమే సంపాదిస్తున్నా ఇంకా ఎక్కువ జీతాలు కావాలని మరోకవర్గం ప్రజలు ఆందోళనచేస్తున్నారనీ ప్రధాని చెప్పారు. ప్రభుత్వానికి ఆందోళనంటే భయం కనుక, ఆందోళనచేసేవారు ఏం కోరినా లభిస్తోంది. ఇది చాలా విచారకరమైన పరిస్థితి.

తృతీయ పంచవర్ష ప్రణాళిక ఎట్లా ఎట్లా ఉంటే బావుంటుందో జాతీయాభివృద్ధి మండలి చర్చించింది. రెండో ప్రణాళికకంటే మూడో ప్రణాళిక బాగా భారీగా ఉండాలని ప్రధానమంత్రి అన్నారు. దీనికి సభ్యులందరూ తలలూపారు. ఈ పురాతన భారత దేశంనుంచి దారిద్ర్య పిశాచాన్ని పారద్రోలాలని ముఖ్యమంత్రులు ఏకగ్రీవంగా అంగీకరించారు. బెర్నార్డ్‌షా అన్నట్లు, నేరాలకు భయపడేవాళ్లు మూర్ఖులు; మనమంతా భయపడాల్సింది దారిద్ర్యాన్ని గూర్చి; దారిద్ర్యాన్ని చూసి.

అయితే డబ్బుసంగతేమిటి? డబ్బెక్కణ్ణించి వస్తుంది? ఇదీ అసలుసమస్య. కొత్త పన్నులువేసి ధనంసేకరించటం తమవల్ల కాదని ముఖ్యమంత్రులు స్పష్టంగా చెప్పేసినట్లు వార్తలు తెలుపుతున్నాయి. అంగుచేత ఇంతవరకూ చేసినట్లే ఇకముందుకూడా రాబోయే పంచవర్ష ప్రణాళికలన్నిటికీ అప్పోసొప్పో చేసి కేంద్రప్రభుత్వమే డబ్బు సంపాదించిపెడుతుందని వారు గట్టిగా నమ్ముతున్నారు. అయితే మద్రాసు ఆర్థికమంత్రి తాముమాత్రం గ్రామపంచాయితీలద్వారా అదనంగా డబ్బుసేకరించగలమని అన్నారు.

ప్రణాళికా మూడు కర్రలో రకాల సిద్ధాంతాలవారున్నారు. ఒక వర్గంవారు మూడో ప్రణాళికకు కనీసం 10 వేల కోట్లయినా పెట్టుబడిపెట్టాలని వాదిస్తున్నారు. అయితే వీరు సూచించే అదనపు పన్నుల విధానం కాగితంమీద జయప్రదంగా కనిపిస్తుంది తప్ప ఆచరణలోకిరాదు.

ఇంకో వర్గంవారి వాదం ఏమిటంటే— రెండో ప్రణాళిక తాలూకు ఆర్థిక భారమే మోయలేకుండావుంటే మూడో ప్రణాళిక భారం ఎక్కడ మోయగలమూ అని.

ఈ రెండువర్గాలమధ్యస్థంగా ఉన్న వర్గం వారి వాదన ఇది.—భారీ ప్రణాళిక వేసుకోవచ్చుగాని జాగ్రత్తగా వ్యవహరించాలి. లోటుబడ్జెట్ పద్ధతిని ఎక్కువగా అనుసరించకుండా పరోక్షపు పన్నులధికంగా వేసి డబ్బు సేకరించాలి. ప్రణాళివల్ల మోయరాని భారం తగలకుండా చూసుకోవాలి—అని.

మొత్తంమీద మూడువర్గాలవారూ పాడే పాట ఒకటే: త్యాగాలు చెయ్యాలి, త్యాగాలు చెయ్యాలి! మరిఎవరు చెయ్యాలో తెలియదు. ఇలా ఉండగా మద్యనిషేధం కోసం ఒక కేంద్ర సంఘాన్ని ఏర్పాటు చేశారు. జనవరి 26 ను మద్యనిషేధ దినంగా ప్రకటించారు.

"పరిమిత మద్యనిషేధం" అనే సూత్రం మంచిదే. కాని ఒక గమ్మత్తు జరుగుతోంది. న్యూఢిల్లీలోని క్లబ్బులు మద్యం అమ్మగా వచ్చిన లాభాలను క్లబ్బు కార్యకలాపాలకు ఖర్చు పెట్టుకుంటున్నాయి. తమ సిద్ధాంతం ఏదో విధంగా అమలుజరుపుతున్నాంటే అనే సంతృప్తిలో ఉన్నంతకాలమూ ప్లానింగ్ సంఘాన్ని గుప్పిట్లో పెట్టుకున్న కాంగ్రెసువాదులు ఈ దేశంఏమైపోయినా పట్టించుకోరు. మూడేళ్ల క్రితం ఢిల్లీలో పరిమిత మద్యనిషేధం అమలులోకి తెచ్చినప్పటినుంచి ఇప్పటివరకూ విదేశీరాయబార కార్యా

లయాల మధ్య వ్యయం రెట్టింపు పెరిగిందనే సంగతి తెలిసినా వారు బాధపడరు, పట్టించుకోరు. అసలు కొందరు కాంగ్రెసువాదుల ఆదర్శ సిద్ధాంతాలన్నీ అమలుచేస్తే ఈ దేశంలో ప్రభుత్వానికి ఆర్థికశాఖ ఉండాల్సిన అవసరమేపోతుంది. డబ్బు తిరుగుబడే తప్ప పెరుగుబడి లెక్కపెట్టుకోవలిసిన బాధే ఉండదు. కొందరు కాంగ్రెసు పిడివాదులు సబ్బు, పంచదార వాడకం కూడా నిషేధించాలని ప్రచారంచేస్తున్నారు.

* * *

సామ్రాజ్యవాదం అంటే చాలామంది వాంతిచేసుకునే ఈ భారతదేశంలో, ఈసారి బడ్జెట్ మీద జరిగిన చర్చ చూసినా, దాన్ని ఆమోదించిన పద్ధతి చూసినా సామ్రాజ్యవాద పద్ధతులే జ్ఞాపకం వస్తాయి. ముఖ్యంగా గ్రాంటుల డిమాండ్లపై జరిగిన చర్చ—స్వాతంత్ర్యానికి పూర్వం బ్రిటిష్‌వారు తయారుచేసిన నమోనాలోనే జరిగింది. ఒక్కొక్క శాఖకీ కొంత టైము కేటాయిస్తారు. ఆ కొంత టైములో ఏవేవో విషయాలమీద కాసేపు చర్చలు జరుగుతాయి; తరవాత ఆ శాఖపద్దుమీద వోట్లుతీసుకుని ఆమోదించేస్తారు. అంతేగాని ఖర్చులో ఎక్కడన్నా అవకతవకలున్నాయేమో చూద్దామనే శ్రద్ధగాని, అయినా పద్దులక్రింద ఇంతింత ధనం కేటాయించారుగదా, అంతంత నిజంగా అవసరమేనా అని జాగ్రత్తగా పరిశీద్దామనే ఆదుర్దాగాని ఎవరికీలేదు, ఖర్చు తగ్గించుకొనేట్లు చెయ్యాలనే ప్రయత్నం కూడా కనబడదు.

ప్రభుత్వం ఖర్చు తగ్గించుకునేట్లు చేయటానికే అక్కౌంట్స్ కమిటీ, అంచనాల కమిటీ అని రెండు కమిటీలు ఏర్పడి ఉన్నాయిగదా అని ఎవరైనా అడగవచ్చు. కాని అక్కౌంట్స్ కమిటీ చేసేదల్లా ఖర్చంతా అయిపోయిన తర్వాత పోస్టుమార్టం చేసినట్లు పరీక్ష చేయటమూ, కేటాయించిన డబ్బుని సద్వినియోగం చేశారో లేదో పార్లమెంటుకు నివేదిక సమర్పించటమూ—అంతే. ఈ కమిటీ తన పని తాను సక్రమంగా, ప్రశంసాపాత్రంగా నెరవేరుస్తోందని ఖచ్చితంగా చెప్పవచ్చు.

కాని అంచనాల కమిటీ సంగతి వేరు. ఇది తనకుతనే స్వయంరాజా అన్నట్లు ప్రవర్తిస్తోంది. ఇది పార్లమెంటు గీచిన గిరిలోనే ఉండి పనిచెయ్యటం మంచిది. ఈ కమిటీ "ఏం చెయ్యాలో, ఏం చెయ్యకూడదో" నిర్ణయించే పని నెత్తిమీ దేసుకుని పని చేస్తోంది. ఆ పని చెయ్యాల్సింది ప్రభుత్వం. ఒక ఉదాహరణ:

44 వ నివేదిక ప్రకటిస్తూ ఈ సెలారంభంలో ఈ కమిటీ—గ్రామీణ ప్రాంతాల్లో సరైన వైద్యసౌకర్యాలు లేవనీ, సాధ్యమైనంత తొందరగా దేశమంతటా ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను స్థాపించేసేయాలనీ, రాష్ట్రప్రభుత్వాలను సంప్రదించి ఒక నిర్ణీత కాలంలోగా వాటిని స్థాపించాలనీ సిఫార్సు చేసింది.

గ్రామీణ ప్రాంతాల్లో నిపుణులైన వైద్యుల అవసరం ఎంతైనా ఉందని ఉద్ఘాటిస్తూ, కేంద్ర ఆరోగ్యమండలి ఇదివరకొక తీర్మానంలో సిఫార్సు చేసినట్లుగా, గ్రామీణ వైద్యుల ఉద్యోగ సౌకర్యాలను హెచ్చుచేసి వారికి ప్రోత్సాహం కలిగించేందుకై బాగా సబ్సిడీలు ఇవ్వాలని అంచనాల కమిటీ సూచించింది. "గ్రామ ప్రాంతాల్లో సేవ చేస్తున్నందుకుగాను నిపుణులైన డాక్టర్లకు రాష్ట్రప్రభుత్వాలు గ్రామభత్యం ఇచ్చేట్లుగా కేంద్రప్రభుత్వం శ్రద్ధ తీసుకోవాలి. ప్రధాన మంత్రి లోగడ ఒకసారి సూచించినట్లు, డిగ్రీ తీసుకోగానే ప్రతి వైద్య విద్యార్థీ ఏడాదో, రెండేళ్ళో ఏదో గ్రామంలో వైద్యసేవచేసి మరీ ప్రాక్టీసు మొదలు పెట్టేట్లుగా ప్రభుత్వం నిర్బంధ విధానం అవలంబించాలి. పైన చెప్పిన ప్రధాన మంత్రి సూచనను అమలు చేయటానికి ఒక నిర్దిష్ట ప్రణాళిక తయారు చేసుకోవాలి," అని కమిటీ సిఫార్సు చేసింది.

వైద్య సౌకర్యాలు బాగా లభ్యమయ్యే పట్టణాలలోకూడా, ఈ సౌకర్యాలు ప్రజలకు అందుబాటులో లేనంత ఖరీదుగా ఉన్నాయని, ఫలానా వైద్యానికి ఇంతకంటే ఎక్కువ ఫీజు పుచ్చుకోగూడదని ప్రభుత్వం నిర్ణయించటానికి వీలున్నదనీ, కేంద్ర ఆరోగ్యశాఖ వియమించబోయే కమిటీ ఈ విషయాన్ని జాగ్రత్తగా ఆలోచించాలనీ అంచనాల కమిటీ సూచించింది.

అంచనాల కమిటీలాంటి వాటి కన్నిటికీ మూలాధారమైన భారతరాజ్యాంగం ఆరోగ్య వ్యవహారాలను రాష్ట్రప్రభుత్వ బాధ్యతలుగా విశేషించింది. అంటే వైద్యసౌకర్యాల అభివృద్ధి పూర్తిగా రాష్ట్రప్రభుత్వాల బాధ్యతన్నమాట. తనవికాని బాధ్యతలను నెత్తిన వేసుకుని వాటికింద డబ్బు ఖర్చు చేస్తున్నందుకు కేంద్రప్రభుత్వాన్ని విమర్శించటంపోయి అంచనాల కమిటీ గ్రామప్రాంతాల వైద్యసౌకర్యాలపనికూడా కేంద్రానికే అప్పగించుతోంది.

బ్రిటన్‌లో ఇలాంటి కమిటీ చేసే పని ఏమిటంటే, ఖర్చు తగ్గించుకునే పద్ధతులను ప్రభుత్వానికి సూచించటం. కాని భారత దేశంలో ఈ కమిటీ చేసే దేమిటంటే — రాజ్యాంగరీత్యా చేయరాని అదనపు ఖర్చు చెయ్యమని ప్రభుత్వానికి సూచించటం.

అంచనాల కమిటీ చేసేది ఇంతేకాదు. ఇంకా వుంది. తమ నివేదికలో ప్రకారం ఎందుకు చెయ్యలేదని ఆయా ప్రభుత్వ శాఖలకు తాఖీదులు పంపించటం, ప్రభుత్వ శాఖలు తమ తాఖీదులను ఎంతవరకూ అనుసరించాయో, అనుసరించలేదో పార్లమెంటుకు మరో నివేదికలో తెలియజేయడం—ఇదంతా వుంది. దీనిప్రకారం - వచ్చే నివేదికలో — గ్రామీణ వైద్య సౌకర్యాలమీద తాము చేసిన సబ్సిడీ సఫార్సును కేంద్ర ప్రభుత్వం అమలు చేసిందో లేదో, చెయ్యకపోతే ఎందుకు చెయ్యలేదో, అంచనాల సంఘం పార్లమెంటుకు వివరిస్తుందన్నమాట. 

విశాఖపట్నంలో విశేషాలు

# కళలకు ప్రభుత్వ ప్రోత్సాహం

## డా॥ వి. ఎస్. కృష్ణ
## శ్రీ జగ్గయ్య
## అభిప్రాయాలు

కళలు ప్రభుత్వం ఆధ్వర్యములో అభివృద్ధి పొందుతాయనే విశ్వాసము తమ కెంత మాత్రమూ లేదని ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఉపాధ్యక్షులు శ్రీ వాసిరెడ్డి కృష్ణ, విశాఖ పట్టణ సంస్కృతీ సంఘం, ద్వితీయ వార్షికోత్సవములకు అధ్యక్షత వహించి తమ ఉపన్యాసములో అన్నారు. "వీలయినంత వరకు ప్రభుత్వమునకు దూరముగా వుండటమే మేలు, వారి సహకారము అపేక్షించే కన్నా" అన్నారు.

సంస్కృతీ ఉత్సవములను ప్రారంభిస్తూ సినిమానటుడు శ్రీ జగ్గయ్య - "ఓవిధముగా చూస్తే రాజకీయవేత్తలకూ, నటులకూ సామ్యముం"దన్నారు. ఇరువురికీ ప్రజలను రెచ్చగొట్టడములో అనుభావముల తారతమ్యమువినా మరేమీ లేదన్నారు.

ఈ సంస్కృతీ ఉత్సవములను శ్రీ యం. జి. కె. మూర్తి ఏర్పాటు చేశారు. వీరు చాలా కాలమునుంచీ ఈ పట్టణములో కళలను ప్రోత్సహించాలని కృషిచేస్తూ ఆఖరికి సంస్కృతీ సంఘమునకు రూపకల్పన చేసి, స్థాపించి-అద్వితీయమైన కృషి చేస్తున్నారు. నిజానికి-ఈ సంస్కృతీసంఘము అంతా ఆయనే అని చెప్పాలి.

శ్రీ జగ్గయ్య "సంస్కృతీ ఉత్సవములు అను పేరుతో, కేవలము లలితకళలకే ప్రాధాన్యమిచ్చి, అందులోనూ నాటకప్రదర్శనములకు అధిక ప్రాధాన్యమిచ్చి ఉత్సవములు జరిపించుతూండడము జరుగుతోంది. సంస్కృతి అనే పదానికి నిర్వచనము చెప్పటము చాలా కష్టమన్నారు.

"ఇంతకీ ఈ నాటక ప్రదర్శనములవల్ల - ఏ కొత్తపోకడలైనా ఔత్సాహిక నాటక సంఘములు ప్రదర్శిస్తూన్న నాటికలలో ద్యోతకమవుతూన్నవి తప్ప, అవీ అంత సంపూర్ణంగా సంతృప్తికరమైనవి కావు.

ప్రభుత్వమూ ఏవేవో స్వల్పమైన సహకార సహాయాలను కల్పిస్తూంది. అవీ వృద్ధ నటులకో ఉపకారవేతనము లివ్వటముతోనే ఆగిపోతున్నాయి. వేరేవిశంగా ఏమీ కన్పించటములేదు రాష్ట్రసంగీత నాటక ఎకాడమీ, కేంద్ర సంగీత నాటక ఎకాడమీలవల్ల కలుగుతూన్న లాభమూ అట్టే కనపడడములే"దని శ్రీ జగ్గయ్య అన్నారు.

"నాటక కళ అభివృద్ధి పొందాలంటే - నాటక కళలో తరిఫీదు ఇచ్చే కళాశాలలను నెలకొల్పటము అత్యవసరము; కేవలము రంగస్థలములను నిర్మించటమువల్ల - నాటక ప్రదర్శనములు బాగుపడతాయనే నమ్మకం, గొప్ప నటీనటులు తయారవుతారనే నమ్మకము తమకు లే"వన్నారాయన.

డా॥ వి. యస్. కృష్ణ, తమ అధ్యక్షోపన్యాసములో - ప్రభుత్వము సంగీత నాటక ఎకాడమీ ద్వారా, లలితకళలను ప్రోత్సహించాలని సంకల్పించిందనీ, వినోదపు పన్నులనుంచి ఖర్చుచేసి కళలను పోషిస్తూందనీ, ఈ పన్నులు రాష్ట్రమంతటా పోగుచేసి - ఏదో ఒక కేంద్రములో వినియోగిస్తూందనీ, అలా అయితే కళలకు అంత ప్రోత్సాహము జరగదనీ అన్నారు.

"ఓ కేంద్రములో వసూలుచేసిన వినోదపు పన్నులో ఎక్కువభాగము, వసూలుచేసిన కేంద్రములోనే వ్యయపరిస్తే, ఓవిధంగా కళలకు ఎక్కువ ప్రోత్సాహము కలుగుతుంది. కేంద్రీకరించటమువలను కలిగే ప్రోత్సాహము మృగ్యము కళల ప్రోత్సాహము ప్రభుత్వము హస్తగతమైననాడు, కళలకు అభివృద్ధే లేదని స్పష్టంగా నమ్మవచ్చును. కళాప్రోత్సాహమునకు ధన పరిమితి లేదు. ధనపరిమితి అజమాయిషీతో ప్రభుత్వము కల్పించుకొన మొదలుపెట్టటమూ, ప్రభుత్వ ఇష్టాయిష్టాలు - ఆ కళాసృష్టిలో ద్యోతకమవుతూండడమూ జరుగుతుంది," అన్నారు శ్రీ కృష్ణ.

నటన నేర్పేందుకు కళాశాలలు పెడితే ప్రఖ్యాత నటులు తయారవుతారన్న శ్రీ జగ్గయ్యగారి అభిప్రాయముతో తాము ఏకీభవించమన్నారు శ్రీ కృష్ణ. అలా ప్రఖ్యాత నటులు తయారైన నిదర్శనములూ లేవన్నారు.

సంగీతము విషయములో విధిగా కళాశాలలూ, శిక్షణకేంద్రములూ వుండాలని అన్నారు. "ఆంధ్రదేశమునకు సంగీతము విషయములో - చాలా తక్కువ స్థానము. సంగీతమును అభివృద్ధిచేసే కృషి ఆంధ్రదేశములో జరగా"లన్నారు శ్రీ కృష్ణ.

"శ్రీ జగ్గయ్యగారు బహుశా తమ వెండితెర అనుభవమును పురస్కరించుకొని-కళాశాలలు అవసరమని చెప్పరేమో! వెండితెర మీద నటుడికీ, రంగస్థలముమీద నటుడికీ చాలా తేడావుంది; వెండితెరమీద నటుడిచేత డైరెక్టరు ఒకేమాట పదిసారులు అనిపించి, అప్పుడు రికార్డుచేయిస్తాడు; నిజానికి వెండితెరమీద నటుడు డైరెక్టరేనేమో ననిపిస్తుంది."

"అయినా జగ్గయ్యగారి కోరికను అనుసరించి చూడడంలో నష్టంలేదేమోనని కూడా తాము భావిస్తున్నా" మన్నారు.

"మా తెనాలిలో-ఏ కాఫీహోటలు అరుగులమీదనో, కాఫీ తాగుతూనో నటన నేర్చుకోవటమూ, నటులు తయారు అవటమూ ఎరుగుదును. కళాశాలలోకన్నా ఈ విధమైన కేంద్రములలో నటనాకౌశలము అలవడుతుందేమో" అన్నారు శ్రీ కృష్ణ.

సాంస్కృతిక ఉత్సవములను ఏర్పాటుచేసిన కళాపోషకులను శ్రీ కృష్ణ అభినందించారు. ఆతరవాత కుమారి విజయలక్ష్మి బృందంవారి నాట్యము జరిగింది.

"కాశ్యప" ★

# సక్కని సుక్కమ్మ

గోవిందరాజు శ్రీనివాసము



ఇదివరకోపాలి ఇట్టనే అయింది. యారమల్లు గడెక్కి ఆపతనే ఉన్నడు. కాలేమో బర్రనజారింది. ఎట్టగో తట్టుకుని నిలబడిండు. ఆ కరమే యియ్యాలాపట్టింది. సుట్టూరా ఎంతమంది పోగైతన ఆట సూత్తిన్నా, కాలుమాత్రం ఎన్నటికీ జారేది కాదు. గడమీన అటునుంచి ఇటూ, ఇటునుంచి అటూ ఎంతలగత్తినా, భూమిమ్మీద నడిసినట్టే నడిసేవోడు. అట్టాంటిది ఇయ్యాల ఆటయములో ఎందుకట్టా అయిందో యారమల్లుకే తోసలేదు. కింద సుట్టూరా జనంపోగై తన ఆట సూత్తన్నారు. అంతవగుకూ, కిందే నిలబడి గరిడీలు తిప్పిండు. "ఇంతసీటుగా గరిడీ తిప్ప గలిగినోడు హోల్ ముత్తంమీన ఈడే," అని జనం ఆచ్చర్యపడినమాట నిజం.

అప్పుడే గడెక్కిన యారమల్లుకు సుట్టూరా మూగినజనం ఎనకపాలిగా ఇంటి గుమ్మంమీన కూకుని ఆట సూత్తన్న సుక్కమ్మ కనబడింది. దాన్ని సూసిన కాడనుంచి ఆడి మనసు గెడమీన లేదు. సుక్కమ్మంకే సూత్తిన్నడు. సుక్కమ్మకు ఇదేం పట్టలా. "బాగానే ఆడ్తండు." అనుకుంటా మిగతా జనంతో పాటే చప్పట్లు కొడ్తన్నది. యారమల్లుకే మోహనదక గుబులు మల్లుతన్నది. ఆట అయినాక గడదిగిండు. నేరుగా జంగమల్లును కూకేసి మెల్లగా "వోరూ ఆ గుమ్మంమీన కూకుంది ?" అని అడిగిండు.

జంగమల్లు నవ్వుతా "అదే నేనూ సూత్తిన్నా. పేరు సుక్కమ్మంట-అయినా నీకేం పొయ్యేకాలం—మొన్నేగా ఆ వూళ్లో యాపు సదును సేయించుకొచ్చేవ్ - మల్లీ మొదలా," అన్నాడు.

యారమల్లంత మొండోడు ఈ భూమీన లేడు. అసల ఆడిపేరు నారిగాడు. ఖోరీ తిగనాల వుసీపందాల్లో అయిదుగురిని అట్టే పంపబెట్టినోడు ఆడు. తొడగొట్టిండంటే అరమైలు యినబడది. ఆడితోడ సప్పుడికే అదిరి సచ్చినోళ్లున్నారు. గోదాలోకి దూకిండంటే సర్ సర్ మంటూ ఈతబెత్తంలా దూసుకు పోగలిగినోడు. నారిగాడన్న పేరు బాగాలేదని యారమల్లు అన్న పేరు ఆడే పెట్టుకుని ఊరూరా సవాల్ చేసిండు—కాని కుస్తీలు పట్టి పట్టి యిసుగు పుట్టింది గావాల్న—గరిడీలు తిప్పటం నేర్చుకొనిండు. ఈ యిద్య బాగా నేకున్నది. ఊరూరా తనఆట సూపిత్తా గంజి కాసు వుంటున్నాడు.

ఆ రోజు ఆట ఆడ్తన్నప్పుడు కింద గూకున్న సుక్కమ్మను సూసిన యారమల్లు ఇక సుక్కమ్మను మరిసిపోలే. ఆ రేత్రి పంగుకున్నా గాని సుక్కమ్మే సుట్టూతా తిరిగింది.

"ఓ యబ్బ—ఏం సక్కదనం—ఇంత మందిని సూసినాగాని ఈ గుంటయి ఏం కళ్ళబ్బ! గిర్రున సెక్రాల్లా తిప్పుతున్నది," అని ఒకటే ఆలోచించిండు యారమల్లు. నిద్రేమో పట్టలేదబ్బ!

తెల్లారి లేగిసిన కాడనుంచీ సుక్కమ్మను గురించే ఆలోసిత్తన్నడు. "ఓరబ్బా ఆ గుంట."—ఇదే ఆలోసన—ఇదే ఆలోసన.

"ఏది ఎట్టున్నగాని, దీని సంగతి కనుక్కోవాలి," అని గట్టిపట్టుపట్టిండు.

సాయంత్రం నాలుగు గొట్టింద్రు. యారమల్లు దబదబ తనుగడెక్కి ఆడినపోటుకెల్లి సుక్కమ్మఇల్లు పసిగట్టి ఏం సేసేందుకూ తోసక తలుపు తట్టిండు.

లోపటాలనుంచి "వోరూ," అంటూ తలుపు దీసింది సుక్కమ్మ. ఎట్టెదర సుక్కమ్మ నిలిసేతలికి అదిరిపడిండు యారమల్లు.

"అబ్బ! ఏం సక్కదనమబ్బ! పనసతొనాలె ఉందబ్బ!"—ఆ కూతలు బయటకు రాబోయినయ్ గాని అణిసేసిండు.

ఏం సెప్పాలో తోసలా యారమల్లుకు. మరి తలుపుతట్టిండుగందా. ఏదో సెప్పాలె.

"నిన్న గడెక్కి ఆడినోళ్ళం—నూకలు అడుక్కుంటన్నం—నా పేరు యారమల్లు," అని దరిజాగా నిలబడిండు. సుక్కమ్మేం పల

# ★ సక్కని సుక్కమ్మ ★

కలా—అట్టే ఎనక్కుమల్లి సాటలో నూక లోసకొచ్చి "జోతెస్తు," అనింది.

జోతేమో లేకపాయె యీరమల్లుకాడ.

"జోతె లేగు—మాట గ్సేంగుకు పెట్ట లేదు—పోన్లే—పొద్దుగూకి నేకవచ్చి తీస కెల్తా," అనిండు సన్నగా ఇకిలిత్తా.

ఆ నూపులేమో నచ్చకపాయె సుక్కమ్మకు "ఏందిదు-అడుక్కుంటను వొచ్చినోడు పెబట్టు తెచ్చుకోడూ," అనుకుని దబేల్ మంటా తలుపేసేసింది. యీరమల్లు వళ్ళు సిఫుక్కుమంది.

"అరెరె, సేతికిసిక్కిందాన్ని వదిలేత్తినే." అని నాలిక కసుక్కున కరుసుకొన్నాడు.

"అయిపోయిందేమో పోయె - పొద్దుగుంకి నేల వత్తనన్న గందా. అప్పుడు నూపాల తడాఖా," అనుకొని ఏం సేసేందుకూ తోసక అట్టే ఎగుదుమాలెగా కూకొన్నాడు.

అట్టనే ఎంతసేపు గూకొన్నగాని పొద్దు గూకదాయె—బీడీ మీన బీడీ ఎలిగించిండు.

ఎట్టగయింతే నేం—సుక్క పొడిసింది.

యీరమల్లు సక్కగ తలదువ్వుకొన్నడు.

సుక్కమ్మింటి తలుపుతెరుసుకొని బుంగమీసాలోడు ఒడు బయటకొచ్చి,

"సుక్కమ్మోయ్ - బద్రం—పిల్లది బద్రం - పాలేరుగూడ లేడు. పొలంకాడ కాపుండకపోతే సొమ్ము మంది కాదు," అంటా బదబరనడిసి ఎల్లిండు. సుక్కమ్మ సల్లగ నవ్వింది గాని ఆడు గమనించలా.

యీరమల్లు గమనించిండు.

ఆడికి మంచి అదనువొదికింది.

"పాలిగాడు కూడ లేడన్నమాట- బలే బలే," అని సంకలు కొట్టకొనిండు.

"ఊరు మాటుమణిగినా నక చిక్కంయెయ్యాల," అని అట్టట్ట తిరిగొచ్చేందుకు ఎల్లిండు.

పున్నమేమో - యెన్నెల యిరగ కాస్తన్నది - ఆ యెలుగులో సుక్కలు సోకు సేసుకుంటున్నయ్, రోడ్డుమీన ఊరకుక్క తెగతిని ఆవులస్తన్నది. యీడో తెచ్చిన సెంటు సొక్కాకు పులిమి మీసానిక్కాడ కుసింత తగిలించి అది దువ్వకుంటా నేరుగా సుక్కమ్మింటి కేసి మల్లిండు యీరమల్లు.

బయట తలుపుసప్పుడయే తలికి సుక్కమ్మ అదిరి పడ్డది. "పాలేరు లేకపోయ్యె ఈయనేమో పొలంమీనకెళ్ళె! అర్ధరేత్రి ఒరు తలుపు తడతరు—గుబులుపుట్టె ఈశనే ఒచ్చిర్నేమో, అనుకుంటా బయం బయంగానే వచ్చి తలుపుతీసి "వోరూ ?" అంది.

ఎదరనే యీరమల్లు!

నవ్వుతన్నడు.

"నేనే సుక్కమ్మా—నూకలకు జోతె తెచ్చినా," అన్నడు నవ్వుత నే.

"అర్ధరేత్రి వోరేత్తరు," అంటా తలుపు ఎయ్యబోయింది గాని యీరమల్లు సెయ్యి అడ్డంబెట్టి తలుపు అట్టనే అదింపట్టి సుక్కమ్మను లోనకు తోసుకుంటా.

"జోతె తెచ్చినా సుక్కమ్మా—నూక లెయ్యి—ఏస్తనంటివిగా," అంటా లోనికొచ్చిండు.

సుక్కమ్మ గజగజ లాడింది.

"దొంగ"ని అరుద్దామంటే నోరు పెగల్లేదు. యీరమల్లు నవ్వుతా లోన కొస్తన్నడు—

"నూక లేధుో సుక్కమ్మా," అంటా లటుక్కున సెయ్యి పుచ్చుకున్నాడు. సెయ్యి యిదిలించి కొట్టి సక్కంగ లోన కురికింది సుక్కమ్మ. దొడ్డి గుమ్మంటాలనుంచి లగత్తొచ్చనకుంది.

యీరమల్లు దాన్ని పోనీయలా. మల్లీ సెయ్యి పుచ్చుకొన్నడు.

"అమ్మనాయనో- అమ్మనాయనో, అంటన్నదేగాని కేక గట్టింగ పెగిలిరాదాయె"

యీరమల్లేమో ఇంకా నవ్వుతనే "నేనంటే మాటలనుకున్నావు గావాల్న సుక్కమ్మా! నా కోసం ఎంత మంది గుంటలు కాసుకున్నారో నీకు తెలీదు గావాల్న. ఆళ్ళందరినీ కాదని నిన్నే కోరా—రా సుక్కమ్మా అరిత్తే ఏం లాబం," అని దగ్గరకెళ్ళిండు.

"ఎదవా - ఎవరనుకున్నావ్ - రేపు నీ పని పడతా - పంచాయితీ జరిపిత్తా." అన్నది సుక్కమ్మ. కోపంతో సెమటోసి నొసలి మీని రూపాయంత బొట్టు కరిగి ముక్కు మీనకు కారతన్నది.

"రేపు అట్టగే పంచాయితీ జరిపిద్దువుగాన్లే సుక్కమ్మా, యియ్యాల నాకోరిక తీర్చు - కాదనకు," అంటా దగ్గరకు లాక్కోబోయాడు యీరమల్లు.

ఆడి చంప ఛళ్లుమంది.

ఒక అదటులో పిల్లదాన్ని సంక నేసుకుని పక్కనున్న గదిలోకెల్లి టప్పున గడియెట్టింది. బయంతో రొప్పుతున్నది.

పోనీ బయటకు లగెత్తుదామంటే ఇంకో మారగం లేదాయె. అరుద్దామంటే ఒరికీ ఇనపడదు. బయంతో నోటింట మాటరాకపాయె.

యీరమల్లుకు ఏంసేయాలో తోసలా. పిట్ట జారిపోయింది గాని, ఇట్లనే వదల కూడదనుకొనిండు.

"సుక్కమ్మా! నువ్వెంత తలుపేసిన గాని ఇయ్యాల నాపంతం సెగ్గాల్సిందే!" అంటా తలుపు గట్టిగ తోసిండు. తలుపు తెరసక రాలా, పక్కనే గడ్డపార కనబడేతలికి యీరమల్లు కళ్లు మెరిసనై. అదెట్టి మండిగం కింద తొవ్వటం మొదలేసిండు. అట్ట కొంత తొవ్వేతలికి అడుగున మట్టి మొకన్నం పడింది. అది పెద్దదిసేసిండు. ఒకమడిసి దూరేంతకన్నం అయింది. ముందు తలదూర్ని సక్కగ ఆ పక్కకు దూరతన్నాడు. సగం అటువేపు వచ్చేతలికి పాములాగ వస్తున్న యీరమల్లును నూసి సుక్కమ్మ కళ్ళు బైర్లు కమ్మినై. పసిదేమో గుక్కపెడతన్నది.

సుక్కమ్మవళ్లు కోపంతో గజగజ లాడ్తన్నది "పోతేరమ్మా, ఇయ్యాల వోరిముకం నూసేనో గాని యీడు దాపురించిండు. నువ్వె నన్ను కాయాలి నా పోలేరమ్మా," అని పోలేరమ్మను మనసునపెట్టి సుక్కమ్మ సయ్ మంటా లెగిసింది. పున్నమంటి సుక్కమ్మ మహంకాళి అయింది. ఏంచేస్తన్నదో దానికే తెలియిలా. అటూ ఇటూ నూసేతలికి మూలనున్న గునపం కనబడింది. పసిదాన్ని ఓ పక్కన పంపెబెట్టి గునపం ఎత్తి పస్ మంటా యీరమల్లు నడ్డిమీన దిగేసింది "అమ్మో" అని యీరమల్లు ఒక్కకేసి గిలగిల లాడిండు.

పసిదాని గుక్కకు లెక్కలేదు.

సుక్కమ్మ కళ్లు రగతం చిమ్మినయ్. పసిదాన్ని ఎత్తుకుని తలుపు దనామంటా తీసి రోడ్డుమీనకు లగెత్తుకొచ్చి పోలికేక లేసింది. ఒక్క నిముసంమీన ఊరంతా మేలుకొంది.

నూత్తే బయం పుడ్తన్న సుక్కమ్మను నూసి "ఏంది సుక్కమ్మా." అంటే మాట్లాడదు. కళ్లనీళ్ళేమో సెరువుగడ తన్నై.

"పోతేరమ్మా—ఏందిది పోతేరమ్మా నాసేత ఈపని సేయించినావే—నీకీ అన్నాయము సేసినా—నీకేం తక్కవసేసినా," అంటన్నదే గాని అసలు సంగతి సెప్పగు.

కోటయ్యొవచ్చి నిలేసి అడిగిండు.

"ఏం సెప్పను కోటయ్యమావా—ఆడి రగతం నూశా. సంపినోళ్ళకు సిచ్చ పడతందంట నిజమేనా కోటయ్యమావా!" అంటా "నాకు సిచ్చ పడాల్సిందే" అని బావురుమంటన్నది.

కోటయ్యతోబాటు మిగతా జనం అట్టనే చూస్తన్నారు.

ఉన్నట్టుండి పసిదాన్ని ఎత్తి నేలమీన కుదేసి పకపక నవ్వుతా రోడ్డుమీద లగెత్తుకుపోయింది సక్కని సుక్కమ్మ. 

# నిజం కావలసిన కలలు

'నెలకు నూటఏభై రూపాయల జీతం...
ఉదయం పదిన్నరనుంచి సాయంత్రం ఐదుదాకా ఆఫీసులో ఉండాలి...మలక్‌పేటలో క్వార్టర్స్.. నూటికి పదిరూపాయల వంతున నూటఏభై రూపాయల జీతానికి పదిహేను రూపాయలు అద్దె! మూడు గదులుంటాయి. అన్నీ ప్రత్యేకం...'

బయట తలుపుతట్టిన చప్పుడయింది! కల కరిగిపోయింది. ఎంత తియ్యటికల చెరిగిపోయింది.. ఈ కల నాకు మేల్కొనిఉండగానే వచ్చినట్లుంది...ఎందుకంటే నిద్రనుంచి మేల్కొని చాలా సేపయింది! చాప మీద ఊరికే పడుకున్నాను...మళ్ళీ ముసుగు పెట్టుకొని పడుకోవాలనిపించింది...నిద్రపోతున్నట్లు నటించాలనిపించింది..కాని లాభంలేదు! తలుపు ఎవరుతట్టిందీ నాకు తెలుసు! ప్రతి నెలారంభంలోనూ... ఇలాంటి చప్పుడే అవుతుంది...వెంకటసుబ్బయ్యగారి గుమాస్తా తలుపు తట్టడమేమిటి, తను గుర్తించలేక పోవటమేమిటి? ..వెంకటసుబ్బయ్యగారుకూడా చాలా తెలివైనవాడు...అద్దెలు వసూలుచేసే గుమాస్తాను ఎన్నుకోవటంలో ఆయన చాలా దూరదృష్టిని ప్రదర్శించాడనే చెప్పాలి... పొడుగాటి మీసాలు, ఐదుగురు మనుషుల్ని అమాంతంగా ఒకచేత్తో ఎత్తి మేడపైనుంచి కింద పడేయగల వస్తాదు! నిప్పుకణాల్లాగా ఎప్పుడూ ఎర్రగామండే కళ్లు. చేతులో బాణాకర్ర.. చిన్నపిల్లలు చూస్తేనే మటుకు దడుచుకుంటారు ... ఇక నా విషయం? చెప్పకుండా ఉంటేనే మంచిది.. అతన్ని ఊహించుకుంటేనే నావళ్ళు జలదరిస్తుంది!

మళ్ళీ తలుపుతట్టిన చప్పుడు!

కొంచం స్తిమితపడ్డాను.

నా గదితలుపుకాదు తట్టింది...నాపక్కగది తలుపు...

కొంచెం ధైర్యం వచ్చింది.

కాని ధైర్యంగా నిలబడాల్సిన సమయం కాదది! తన ధైర్యం ఆగుమాస్తాముందు ఏపాటిది? నాకు కలిగిన ధైర్యాన్ని తీసి మూలగా విడిచిన బట్టల బుట్టలోదాచి-చాపమీదినుంచి లేచి వళ్ళు విరుచుకున్నాను!

ఆలోచిస్తూ నిల్చున్నా!

కాని ఇది ఆలోచించాల్సిన సమయం కాదు ... తరుణోపాయం చూసుకోవలసిన తరుణం!...పలాయన మంత్రం పఠించకపోతే వస్తాడు గుమాస్తా పలికే దుర్భాషలకు తాళజాల గలగటం దుష్కరాతి దుర్భరం!

పక్కగదిలో పని పూర్తిచేసుకున్న వెంటనే అతగాడతి దూకుడుగా.. తనగదిని ప్రవేశించవచ్చు!

సబ్బుతో మొహం కడుక్కున్నాను!

వంకెకు తగిలించిన బట్టలు తీస్తున్నాను.. పక్కగదివైపు కొంచెం చెవిఒగ్గి విన్నాను—తలుపు తెరిచిన శబ్దం.... .

'ఓహో! మీరా? గుమాస్తాగారూ!' అంటున్నాడు, ఆగదిలో వుంటున్న నారాయణరావు!

'హాఁవును.....నేనే....నారాయణరావు

**దండమూడి మహీధర్**

సాబ్!'—గుమాస్తా బొంగురుగొంతు!

'రండి, లోనికిరండి..... చాపమీద కూర్చోండి!'

'అబ్బే! నాకు ఆటే టైంలేదు...... ఇవ్వాళ్ళ వసూళ్ళు చాలాఉన్నాయి!'

'ఆఁ ఏమిటండీ! కూర్చోండి.. చాయ్ తాగి వెళ్లురుగాని!

నాకు నారాయణరావుమీద ఎక్కడలేని ప్రేమ పుట్టుకొచ్చింది. 'మిత్రమా! నారాయణరావు! ఎలాగైనాసరే...ఇంకో పది నిమిషాలు గుమాస్తాను నీగదిలోనుంచి బయటికి రానీయకు!.. ఇదుగో బట్టలేసుకుంటున్నాను...'అని నారాయణరావుకు మౌన సందేశం పంపించాను!

నారాయణరా వేదో చెబుతున్నాడు... గుమాస్తా ఏదో అంటున్నాడు!

నారాయణరావు బొంకి వుంటాడు—ఏభై రూపాయలు నిన్ననే భార్యకు పంపించాననీ, పిల్లలకు జబ్బుగాఉందని వుత్తరమొచ్చిందనీ!

గుమాస్తా—పెళ్ళాం, పిల్లలు కలిగిన కుటుంబమంటే కరుణిస్తాడని... ఇటీవలే తెలిసినందున ఈకిటుకు వేసివుండాలి నారాయణరావు!

ప్రస్తుతానికి ఈ పాతిక తీసుకోమని ప్రాధేయపడుతున్నట్టుంది...

వాళ్ళసంభాషణ ఆలకిస్తూఉంటే నాకు ముప్పురావచ్చునని, మూలనున్న చెప్పులు చేతిలోకి తీసుకున్నాను..... పొరపాటున చెప్పుల చప్పుడువిని గుమాస్తా పసిగట్టవచ్చు!

నెమ్మదిగా తలుపు వేసి.. పిల్లిలాగా నడుచుకుంటూవెళ్ళి మెట్లుదిగాను.

అప్పటికిగాని గుండెదడ ఆగలేదు.

నెమ్మదిగా ఫర్లాంగు దూరంలోవున్న భోజనహోటలుకు బయలుదేరాను!

నారాయణరావుకూడా తెలివైనఘటం! తెలివిదేముందిలే! అంతా పరిస్థితుల ప్రభావం! నేనుమాత్రం తెలివితక్కువవాడినా? ఐదునెలల అద్దెకోసం గుమాస్తా వస్తున్నాడని తెలిసి.. పిల్లిలాగా బయటికి జారుకున్నాడు...

ఏదో పాపం.. నారాయణరావుకు క్రిందటినెల వుద్యోగం దొరికింది గాబట్టి సరిపోయింది.. లేకపోతే...నాలాగే చేసివుండును...అతను ఆరునెలల అద్దెకట్టాలి! పరిస్థితుల ప్రభావం కాకపోతే...అతగాడి బాధనుంచి తప్పుకోవటానికిగాను—తనకు పెళ్ళయిందనీ, పిల్లలున్నారనీ చెప్పుకోవటం దేనికి? నారాయణరావుకు పెళ్ళికాలేదు. అంతొకరిది! ఆ ఏభై రూపాయలూ హోటల్ యజమానికి చెల్లించటం నిన్న నా కళ్ళారా చూశాను!

హోటల్ దగ్గరించింది.

యజమాని వెంకట్రామయ్య నన్ను చూసి సన్నగా నవ్వాడు. నేను ఒక చిరునవ్వు విసిరేశాను.

ఈ వెంకట్రామయ్యగారుకూడా చాలా విచిత్రమైన మనిషి. ఈయన గత ఐదుమాసాల్నించి నన్ను పోషిస్తున్నాడు. రెండుపూటలా భోజనం.. ఉదయం మధ్యాహ్నం కాఫీ...ఆయన మనుషుల్ని ఊరికే నమ్ముతాడు. ఎవరెలాంటివాళ్లో పరీక్షించగల శక్తి తనకుందంటాడు. వ్యాపారి ఎప్పుడూ అధికలాభాలకోసం ప్రయత్నించకూడదట...మధ్యమార్గాన నడిస్తేనే బోలెడంత మిగులుతుందని తన వ్యాపార రహస్యం బయట పెట్టేస్తాడు.

విచిత్రమైన మనిషి కాకపోతే ఏమిటి?

ఏంజూసి నాకు అప్పు పెడుతున్నాడో-

# ★ నిజం కావలసిన కలలు ★

ఆయనకే తెలియాలి! వెళ్ళి ఆయనకు దగ్గర్లో వున్న టేబుల్ దగ్గర కూర్చున్నా!

"ఏమండీ! బావున్నారా?" రోజూ వేసే అర్థంలేని ప్రశ్నే ఇవాళ్ళకూడా వేశాను!

"ఏదో మీదయ!" అన్నాడాయన రోజు టికి మల్లేనే!

రోజుటికి మల్లేనే ఆయన—ఆ రోజు పత్రిక నాచేతి కందించాడు. ఆయన ఉద్దేశ్యం నాకు తెలుసు; 'నీకు తగిన వుద్యోగాలేమైనా వున్నాయేమో చూసుకో!' అని ఆయన భావన!

నేను అలాగే చేయవచ్చునా? చేయలేదు ఏదో వార్తలంటే మహా అభిరుచి వున్న వాడికి మల్లే—మొదటి పేజీమీదికి దృష్టిని పోనిచ్చాను. నిజం చెప్పొద్దూ—పతాకశీర్షికలు కూడా అర్థం కాలేదు. యథాప్రకారముగా 'వాంటెడ్ కాలమ్స్' చూడ్డం ఆరంభించాను.

"ఈ రోజుల్లో ఉద్యోగాలు దొరకాలంటే మినిష్టరు ఫాయాలో బంధుత్వం కలిగివుండా లంటాను—సీతారామయ్య గారూ! మీరేమంటారు?" అని పేపరుమీద దృష్టి అలాగేవుంచి అన్నాను. ఆయన 'ఔ'నన టానికి బదులు 'ఇదుగో చూశారూ?' అని ప్రారంభించాడు.

నేనుమాత్రం ఏ మూలనైనా నాకు సరిపడ్డ వుద్యోగం దొరుకుతుం దేమోనని... మహా శ్రమ పడుతున్నా! ఊహూఁ...... ఐదొందలు, వెయ్యి, పదిహేనొందల జీతాల వాళ్ళకు వుద్యోగా లున్నాయట...ఇంజనీరింగు డిప్లొమా హోల్డర్లకు కూడా మంచి అవకాశా లున్నాయి...కాని వట్టి బి. యే. గాళ్లకు ఏమీలేవు! అయినా ఇంకా పత్రిక చూస్తూనే వున్నాను.

"ఓపిక పట్టాలి...ఆ రోజు రావాలి!" అన్నారు వెంకట్రామయ్యగారు. అలాగని ఆయన ఊరుకోలేదు ..తను అనుభవించిన కష్టాలను గురించి వర్ణిస్తున్నాడు...ఆకష్టాలు ఒకరోజున తీరిపోయాయట. అవి పంచశీల సిద్ధాంతానికి నాందీ ప్రస్తావన జరిగిన రోజులట! అందుకే తన హోటలు పేరు 'శాంతి విలాస్'అని పెట్టాడట! అంతదాకా పడరాని పాట్లు పడ్డాడట...అద్దెచెల్లించటానికి సైతం డబ్బుండేది కాదట...ఒక పర్యాయం ఇంటియజమాని సామానుతీసి బయట పడేశాడట...ప్రసంగం వచ్చేటప్పటికి నాకు పత్రికల్లో అక్షరాలు కన్పించటం మానేశాయి.. వెంకట్రామయ్యగారు ఆ తరువాత ఏం చెప్పాడో నా చెవులు ఆలకించలేదు.. నా కళ్లెదుట . ఉదయం చూసిన స్వప్నం మెదలుతోంది! స్వప్నంలో లభించిన ఉద్యోగం తాలూకు సంగతులు కదులుతున్నాయి!

ఎంత మధురమైన స్వప్నం! అది నిజంగా మారితే ఎంత బావుంటుంది?

ఊసురో మనుకుంటూ ఉండేదానికంటే కనీసం ఇలాంటి స్వప్నాల్లో జీవించటం కూడా అవసరమేమో ననిపించింది, నాకొ నిమిషంలో !

సీతారామయ్యగారు తన స్వంతగొడవ చెప్పటం ఎప్పుడు ఆపివేశాడో నేను గమనించలేదు! ఆయన గొడవ నాకు కొత్తదయితేగా? ఆయనకు 'మూడ్' రావటం ఆలస్యం, గతంలోకి వెళ్లిపోతాడు! అలా వెళ్లిపోయి—మానవుడికి సంఘర్షణ తప్పదని తేలుస్తాడు! ఏతావాతా ఆయన చెప్ప దలచిం దేమిటంటే: 'ఫరవాలేదు లేవాయనా! నీకు ఉద్యోగం వచ్చినప్పుడే నాకు డబ్బివ్వు! అంతదాకా ఇక్కడే తింటూఉండు!'

నారాయణరావుకు ఉద్యోగం రావటంతోటే—కొంత బాకీ చెల్లగొట్టేశాడు; అలాగే నేనూ చెల్లగొట్టేస్తానని ఆయన నమ్మకం!

'వస్తానండీ!' అనిచెప్పేసి గదికి బయలుదేరాను! ఉదయం పదిన్నర దాటింది. మెట్లెక్కుతూంటే మళ్లా దడ పుట్టుకొచ్చింది,.

పైకెళ్లి ఆఖరు మెట్టుదగ్గర నిలబడిపోయాను. ఎందుకో నాకింకా భయం భయంగానే ఉంది ఇంకా ఆ మీసాల పోతు అక్కడేఉంటే ఏం చెయ్యాలి?.. కాని ఇది కేవలం నా భ్రమ మాత్రమేనని పూర్తిగా పైకెళ్లాక తెలిసింది పైన ఎక్కడా ఒక్క పురుగులేదు. అంతటా నిశ్శబ్దం అంతటా శూన్యత ఇంతకుముందు పత్రికలో వాంటెడ్ కాలమ్సులో చూశాక నాలో ఏర్పడిన శూన్యతలాంటిది! అలాంటి వాతావరణం చూసేప్పటికి నా ఒళ్లంతా చెమటలుపోసింది. .ఒంటరిగా కూర్చొని సాయంత్రంపూట 'రేపు'ను గురించి ఆలోచించినప్పుడల్లా నాకు చెమటలు పోయటం అలవాటే! కాని సమయంకాని సమయంలో—ఇప్పుడు చెమటలు కారటం ఎందుకో. నాకర్థం కాలేదు! ఇంత పిరికితనం నాలో పని చేస్తున్నందుకు నామీద నాకే కోపం వచ్చింది! క్రిందటి నెలారంభంలో ఏవిధంగా ధైర్యంగా నిలబడి సమాధానం చెప్పానో ఈనెలకూడా అదేవిధంగా చెప్పాల్సింది—ఉద్యోగం రావటం ఆలస్యం—మొదటి నెల జీతమంతా నీ అద్దెకిందే జమకడతానని! కాదంటే మేడ మీదనుంచి కిందపడేస్తాడా ఏం? ఎలా పడేస్తాడో చూస్తాను!...

నాలో కొంచెం ధైర్యం చోటు చేసుకుంది...పిరికితనం ఎగిరిపోయింది.

ఆ ధైర్యంలో వెళ్లి నారాయణరావు తలుపు తట్టాను! లోపల్నుంచి సమాధానం లేదు. యీసారి గట్టిగా తలుపు తట్టాలని చూసేప్పటికి బయట వేసివున్న తాళం మీదికి దృష్టిపోయింది! నా తెలివితక్కువతనాన్ని చూసి నాకే జాలేసింది. కాని ఇంతకుక్రితం కలిగిన నా ధైర్యానికి నేనే మెచ్చుకోక తప్పలేదు! అసలు ఇంత ధైర్యంగా గుమాస్తాను గురించి ఆలోచిస్తానని నేనెప్పుడూ అనుకోలేదు!

ఏదో విజయం సాధించినవాడికి మల్లే నవ్వాను!

నారాయణరావుకు కిందటి నెల ఉద్యోగం వచ్చిన విషయం మాటిమాటికీ మరచిపోతున్నందుకు మళ్ళీ నామీద నేను విసుక్కున్నాను! ఓహో! మిష్టర్ నారాయణరావు ఇప్పుడు ఎంఖాకింద కూర్చొని కిటికీలకు కట్టిన వట్టివేళ్ళ తడికల సువాసన ఆఘ్రాణిస్తూ ఫైళ్ళు తిరగేస్తూవుంటాడు. నోట్ 'పుటప్' చేస్తూవుంటాడు .ఇంకో గంట తాళాక "ఏయ్ భాయ్! ఏక్ చాయ్!" అంటాడు గాబోలు! నారాయణరావూ! ...అదృష్టమంటే నీదయ్యా! కానియ్, కానియ్!...యీ భవదీయుడి రోజులు మాత్రం మారవాఏమిటి? ఇడికలలు మాత్రం నిజం కావంటావా?

"అవుతాయ్!" అని నారాయణరావూ! 'అవుతాయ్' అను! 'రేపు' మీద నమ్మకం నాకు నువ్వు కలిగించకపోతే ఈ ఊళ్ళో మరెవరున్నారు చెప్పు! లక్ష్మి ఉందనుకో! కాని ఆమె ఇక్కడలేదుగా! రెండొందల పైచిలుకు మైళ్లదూరంలో ఒక మారుమూల గ్రామంలో వాళ్ళ మేనమామ గారింటి మారుమూలగదిలో ఒంటరిగా ఎవరికోసమో నిరీక్షిస్తూ కాలం గడుపుతోంది నీకు చెప్పానుగా లక్ష్మిని గురించిన సంగతులు!

నిజంగా నువ్వూ, ఆమే లేకపోతే యీ జీవితం ఎప్పుడో "భయం భయం"గా మారి దుర్భరమైపోయేది! అంతసేపు నారాయణరావు గది ముందు నిల్చొని అంత దీర్ఘంగా ఆలోచించటం నాకేమీ ఎబ్బె

ట్టుగా తోచలేదుగాని...పొరపాటున ఎవరైనా చూస్తేమటుకు నాకు నిజంగా మతి భ్రమించిందని అనుకోవటానికి ఆస్కారం లేకపోలేదు.!. కాని అలా అనుకునేందుకు పైన ఎవరూ లేరు.! అంతా ఎవరి పనుల మీద వాళ్లు వెళ్లిపోయారు. ఇక మిగిలిందెవరయా అంటే పనిలేని ఈ రెండోగదిలో ఉంటున్న - మధుసూదనరావు దీ (గేట్-బి. ఎ. (ఎకనమిక్స్.)

తలుపు తెరిచాను. తెరిచీ తెరవటంతోటే నేలమీద నీలంరంగు కవరు కన్పించింది.! పోస్టుమేన్ తలుపుకిందగాలోనికి నెట్టిన ఆ నీలం కవరు ఎవరురాశారో నాకు తెలుసు! అయినా, ఎవరో కొత్త వాళ్ళు రాసిన ఉత్తరంగా భావించి...ఎడ్రెసు రాసిన దస్తూరీని పరికిస్తున్నాను. పరికించి కవరు చించాను.! అందమైన నీలిరంగు కవరులో అందమైన నీలిరంగు కాగితాలు! ఆ కాగితాలమీద లక్ష్మిరాసిన ముత్యాల్లాంటి అక్షరాలు! ఆ అక్షరాలమాటున లక్ష్మి పొదిగి పొదిగి కూర్చింది, నామీద తనకున్న ప్రేమను! ఆఖరున తన కిందటిసారి ఉత్తరానికి సమాధానం రాయనందుకు కొంచెంగా కోప్పడింది!.

వెంటనే లక్ష్మి ఉత్తరానికి సమాధానం రాయటానికి కూర్చున్నాను! అప్లికేషన్ల కోసం కొన్న తెల్లకాగితాల పొత్తిలో నుంచి ఒక కాగితం బయటికి లాగేను!

"లక్ష్మీ! నీ ఉత్తరాలు నాలో ఒకకొత్త ఆశను రేకెత్తిస్తూ ఉంటాయి. ఆత్మవిశ్వాసాన్ని కలిగిస్తూ ఉంటాయి! వారానికొక ఉత్తరం చొప్పున నీ దగ్గర్నుంచి రాకపోతే నాకు పిచ్చెక్కినట్లవుతుంది! నాలో మిగిలివున్న ఆశకాస్తా అంతరిస్తుందేమోనని భయమేస్తూ ఉంటుంది.!...మనిషిలోని ఆశ అంతరించాక...ఇక-ఆ...నీ ఉత్తరం చదివాను... అవును నాకు తెలుసు-మనపెళ్ళయి తీరుతుంది. ఆలస్యం చేస్తున్నది నేనే! అవును.. కొంచెం ఓపిక వహించులక్ష్మీ... కొంచెం! మరికొన్నాళ్లు..."

ఇలాగే రాశాను. చాలా సంగతులు రాశాను. లక్ష్మి రాసినన్ని పేజీలు రాయలేదుగాని, మొత్తానికి చాలా రాశాను. ఏం రాశానో మళ్లీ చదువుకున్నాను. "ఏమో లక్ష్మీ! గమ్యం చేరుకోవాలని... స్థిమితం చేకూర్చుకోవాలని...పోరాటం సాగిస్తున్నాను...కాని అడుగడుగునా అసంఖ్యాకమైన అడ్డంకులు ఎదురవుతున్నాయి... అసలు దారీ తెన్నూ అనేది ఎప్పటికయినా కన్పిస్తుందా? అని అనుమానం వేస్తూంటుంది. ఆ అనుమానం నీ వుత్తరాలు తగ్గించి వేస్తుంటాయి..." అని ఉత్తరం ముగించాను.

కిందటిసారి ఉత్తరానికి సమాధానం ఎందుకు రాయలేదో-దాన్నిగురించి రాయకుండా ఉండటమే మంచిదనుకున్నా! లేకపోతే-'ఉత్తరం రాయటానికి నా దగ్గర డబ్బులు లేకపోయాయి' అని రాస్తే ఆమె బాధపడుతుంది! ఆమెబాధపడటం నాకిష్టం లేక ఆ విషయం ప్రస్తావించటం మానేశాను.

ఆ తరువాత ఆ ఉత్తరాన్ని మడిచి పక్కనబెట్టాను. సాయంత్రం నారాయణరావు ఆఫీసునుంచి రావటంలో ఒక కవరు కొనటానికి పదిహేను నయాపైసలు అప్పు తీసుకోవాలి! ఈమాత్రం అప్పు అతడి దగ్గర పుట్టకపోదు. నిన్నేగా జీతం తీసుకున్నది! అప్పుడే చాప పక్కనే ఉన్న ఆంధ్ర పత్రిక మీదికి నాదృష్టిపోయింది. నారాయణరావు తన మొదటి జీతం డబ్బుల్లోనుంచి మొదటిసారిగా కొన్న పత్రికిది!...

ఖర్చు వివరాలు రాసి ముఖచిత్రాన్ని చెడగొట్టాడు! పేజీలు తిరగేశాను. రాత్రి చదివినవన్నీ ఒక్కసారి మళ్ళీ నెమరుకు వచ్చాయి. ఆ అమ్మాయి ఎవరోగాని కుటుంబ నియంత్రణాన్ని గురించి బాగా రాసింది! ఆ వ్యాసం చదువుతున్నప్పుడు నాకు మాటిమాటికీ బెర్ట్రాండ్ రసెల్ రాసిన కొన్ని విషయాలు గుర్తుకొచ్చాయి! ఒకచోట ఆయన ప్రపంచంలో ప్రస్తుతం రోజుకు ఏభై ఎనిమిది వేలమంది జన్మిస్తున్నారన్నాడు! దీన్ని అరికట్టాలన్నాడు! ఇండియాలాంటి దేశంలో జీవన పరిమాణం పెరగాలంటే బర్త్ కంట్రోల్ అవసరమన్నాడు! దీనివల్ల ఎన్నో సమస్యలు పరిష్కారమవుతాయన్నాడు!

పత్రికలోని ఆ వ్యాసాన్ని చించిలక్ష్మికి పంపెంచాలనిపించింది. కాని మరో నిమిషంలో నా పిచ్చికి నేనే నవ్వుకున్నాను! "పెళ్ళి అనుకున్నారో లేదో, ఏమిటి అబ్బాయికి పిచ్చి!" అని ఎవరైనా అనుకుంటే పెళ్లి కావలసిన కుర్రాడి విషయంలో ఏం మర్యాదగా ఉంటుంది? అందుకని ఆ భావనకు ఫుల్‌స్టాప్ పెట్టి— ఆ పత్రికను భద్రంగా పరుపుచుట్టకింద దాచిపెట్టాను, ఎందుకైనా మంచిదని!

బయటికొచ్చి నిలబడ్డాను!

రోడ్డుమీద అడపాదడపా మనుషులు నడుస్తున్నారు:

చేతికి గడియారమున్న పెద్దమనిషి ఒకాయన కన్పించేప్పటికి నేను పైనుంచే పిట్టగోడమీదుగా కిందికివంగి—'వాటిజ్ ది టైంప్లీజ్' అని ఒక చిన్నసైజు కేకేసి అడిగాను!

ఏక్ బజాహై అన్నాడాయన! అంటే, ఒంటిగంటయిందన్నమాట! అని నాలో నేను కూడా బలుక్కున్నాను.

థేంక్స్ అనేలోపలే ఆయన అయిదారడుగులు ముందుకు వెళ్ళిపోయాడు! నేను గబగబా లోనికెళ్ళాను!

అసలు విషయం మరచే పొయ్యాను! మూడుగంటలకు—ఒక ఇంటర్వ్యూ లాంటి దానికి హాజరు కావాలి. ఖైరతాబాదులో! దీనివల్ల నాకు ఒరిగేదేమీ లేదని నాకు తెలుసు. .ఇలాంటివి ఎన్నికాలేదు గనుక!

అయినా వెళ్ళాలి! కొంచెం డాబుసరిగా వెళ్ళాలి!

ముందుగడ్డం చేసుకోవాలి?

గబగబా అద్దంముందు కూర్చొని రేజరు సరిజేసుకున్నాను! ఆ తరువాత గడ్డం గీచుకోవటానికి ఉపక్రమించాను...అబ్బా! ఏమని చెప్పను? పరిస్థితులు నామీద తిరుగుబాటు చేసినవిధంగానే ఆబ్లేడు కూడా నాగడ్డాన్ని నానాహింసలకు పాలుజేసింది! 'ఈ శరీరం నాదికాదు. ఎవడో పరాయివాడిది! అనేభావంతో డాక్టరు ఏ విధంగా ఆపరేషను చేస్తాడో, అదేవిధంగా నేను రేజరుతో సాముచేశాను! అలాచేశాక .. చిన్నపిల్లల గడ్డం పుచ్చుకుని బతిమలాడతారే అట్లా నేనుకూడా నా చేతిలో గడ్డాన్ని పట్టుకుని బుజ్జగించాను— ఇవ్వాళ నారాయణరావు నడిగి పదిహేను నయాపైసాలతో పాటు మరో పన్నెండు నయాపైసలు తీసుకొని కొత్తబ్లేడు కొంటాను!'

'నమ్మకం లేదనుకుంటూనే మన!

(64-వ పేజీ చూడండి)




గుర్తు ఉన్నదా అని గమనించండి
అలా చేస్తే మీ దుస్తులు బాలనట్లుగా
ఎన్నటికీ క్రుంగవు!

రిజిష్టరు చేయబడిన 'శాన్ఫొరైజ్డ్' ట్రేడు మార్కుకు అధికారులైన క్లూయట్ పీబోడీ అండ్ కంపెనీ ఇన్కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు ఎస్.ఎ. లో సంస్థాపితము) వారిచే ప్రచురింపబడినది. ఈ కంపెనీ యొక్క కచ్చితమైన ప్రమాణములకు తగినట్లు క్రుంగకుండా ఉండే బట్టలమీదనే 'శాన్ఫొరైజ్డ్' ట్రేడుమార్కు వేయుటకు అంగీకారము యిస్తాము.

వివరములకు: 'శాన్ఫొరైజ్డ్' సర్వీస్, 95, మెరీన్ డ్రైవ్, బొంబాయి-2.

SAN 58-5 TE

# తేనెల్లా

దొడ్లో పరిసిన వెన్నెల పాయలై ప్రవహించి, మంచంమీద తేలిన తెల్లటి దుప్పటిమీద, నిద్రపోతూ మగతలో ఉన్న రాజా కాళ్లకేసి స్పర్శ తగలటంతో మెళకువ వచ్చింది. మెల్లి గా కళ్లు విప్పిచూస్తే మల్లెపందిరి సందుల్లోంచి పడే వెన్నెల నీడలమధ్య మాలతి సన్నగా గాజులచప్పుడు చేస్తూ పాదాలుపట్టడం కన్పిస్తోంది.

'ఎందుకు మాలతీ! రోజూ కాళ్లొత్తు తావ్ ?'

'.........'

'మాటలు రావనుకుంటాను'

'ఉహూ...'

'వచ్చునట్లే ఉంది'

'.........'

'మాలతీ! నిన్ను ఒక్క ప్రశ్న అడుగు తాను. జవాబు చెప్తావా!'

'ఊఁ'

'నువ్వు చదువుకున్నదానివి కదా ఏమిటీ మూఢనమ్మకాలు ?'

'ఆ ప్రశ్న ఎన్నిరోజు లడుగుతారు ?'

'నువ్వు జవాబు చెప్పే రోజు వచ్చే దాకా.'

'నేను చదువురాని మొద్దుని కనక.'

'లేదు. నువ్వు చదువుకున్న మొద్దువి.'

'పరీక్షలు పాసయినంత మాత్రాన చదు వొచ్చినట్టుకాదని మీరే అన్నారుగా!'

'ఈ సేవ అంతా ఏమిటి చెప్పు. నా కక్కర్లేదంటున్నాగా!'

'నా క్కావాలి.'

'ఆ నాడు పెళ్లిపీటలమీద ముఖం భూమి లోకి దించుకుపోయేట్లు కూర్చున్న మని షేనా మాట్లాడుతోంది ?'

మాలతి ముఖం చంద్రుడివైపు తిప్పుకుంది. చంద్రకిరణం ఒకటి సూటిగా నుదిటిమీది తిలకంలో దూకి తళుక్కుమంది. కళ్లలో తారకలు కదిలాయి.

చంద్రుడికి మబ్బుతునక అడ్డమొచ్చింది.

మాలతి ముఖం రాజా గుండెలో దాచు కుంది. మాలతి తల్లో విరిసిన సన్నజాజులు సిగ్గుతో తూలిపోయాయి. చెక్కిళ్ళు ఎర్ర బడ్డాయి. ఆ కళ్ళలోని దివ్వెల వెలుగులు తనకోసం ఆ అగాధాలలోతులు తరచి చూస్తాడు తను. ఆ లేచిగుళ్ళవంటి మిాగడ మెత్తదనాలు, అందాలహొయలు, గాలికి నుగుటిమీద కదిలి వయారాలుపోయే ముంగు రులు, సిగ్గులు పొంగించే బుగ్గలు ఇంద్ర ధనస్సు వంచినట్లు చేసిన దరహాసపు చిందులు_అన్నీ తనకోసం తన ఆనందానికి సుఖానికి, జీవానికి, ప్రాణానికి తానుతప్ప ఈ అందాల నిధులవైపు ఎవ్వరూ కన్నె త్తయినా చూడలేలులేరు. ఈ సౌందర్య సామ్రాజ్యానికి తను సర్వాధికారి. సర్వం

## సత్యం శంకరమంచి

తనకు అర్పణచేసి తనకు తానుగా ఏమీ మిగ లక కాలంగడిపే జీవికి ఏమిటి ప్రతిఫలం? తన ప్రాణం బలిపెట్టమనకూడదూ? తనకంఠం ఇలా కోసి తీసుకుపోకూడదు?

'మాలతీ! ఎందుకు కన్నీరు?'

'ఏమో! నాకు తెలియదు' నవ్వుతూ రాజా హృదయానికి హత్తుకొనే సమాధానం చెప్పింది.

అవును. నీకు తెలియదు. నువ్వు ఏ పని చేసినా నీకు తెలియదు. కారణం ఆ పని నీ కోసం కాకపోవటమే! నువ్వు ఏ పని ఎందుకు చేస్తున్నావో నాకు తెలియాలి. నీ ఋణం ఎలా తీర్చుకుంటాను మాలతీ! నేను నీ...మృదువైన మాలతి చేతివేళ్ళు నోటికి సంకెళ్ళు వేశాయి.

'ఇంక మాట్లాడకండి'

'నేను నీవాణ్ని నా హృదయంలో మరొ కరికి స్థానంలేదు. ఈ మాటలు చెప్పలేక పోయాడు. అతని గుండె కలుక్కుమంది. తను నిష్కల్మషంగా ఆ మాట అనలేక పోయాడు. తన మనసులో మాలతితోపాటు మరొకరికి స్థాన మున్నా మాలతి అభ్యంతర పెట్టదు. సహిస్తుంది. తను మాలతికి అన్యా యం చేశాడు. స్త్రీగా మాలతిచేసిన పని చెయ్యలేకపోయాడు. ఆమెనుంచి దాచిన ఒకే ఒక రహస్యం, చేసిన పొరపాటు ఆమెకు విప్పిచెప్పాలి. నోరు విడిచి చెప్పటానికి అభి మానం అడ్డువస్తోంది. తనుచేసిన అన్యాయం మాలతికి తెలియకపోలేదు. అది ఆమె గుండెను కోతపెట్టి ఉంటుంది. ఆ వ్యధకు మూలం తను. ఆమెకు తెలుసునన్న విషయం తనకు తెలిసినా ముఖతః ఒప్పుకోవటానికి తాను పురుషుడు, అభిమాని, దొంగ, జారుడు, ప్రేమకు అనర్హుడు.

ఈదురుగాలి రివ్వుమని దూసుకు పోయింది.

* * *

శాంత మాలతికి బాబాయి కూతురు.

# ★ తెర సెల్లా ★

శాంతతో మొట్టమొదటి పరిచయం పెళ్ళిలోనే. మరదలు హోదాలో తన్ను ఉడికిస్తుండేది. శాంతలోని చలాకీతనం, వికసిస్తున్న యౌవనం హృదయాన్ని సమగ్రంగా ఆకర్షిస్తాయి. తనకేం కావలసివచ్చినా శాంతే సమకూర్చేది. ఒకరోజున టిఫిన్ తీసుకొచ్చింది.

"నువ్వు టిఫిన్ తీసుకున్నావా?"

'నువ్వయింతర్వాత.'



'నేను ఇన్ని తినలేను. సగం నువ్వు—

'అమ్మ!—ఆసగంలో అక్క నేనూ.'

'ఆసగం మీఅక్క కాజేస్తే!'

'నువ్వుంచుతావుగా.'

'మరి ఎంగిలి అవుతుందిగా.'

'మాఅక్క ఎంగిలి ఫరవాలా.'

'మరి. నా...'

'ఛీ—'

'అయితే ఉండు' కొరికిన లడ్డూ నోట్లో కుక్కాడు.

"పో బావా" అంటూ లడ్డు నముల్తూ శాంత వెళ్లిపోయింది.

ఆతర్వాత అత్తవారింటికెళ్లినప్పుడల్లా ఏంతోచేదికాదు. మాలతిని దగ్గర కూర్చోబెట్టి కబుర్లుచెప్పే రోజింకా రాలేదు. దూరంగా, అన్యాపదేశంగా, తలుపుసందుల్లోంచి తియ్యగా బాధగా చూసుకోవటం తప్ప. కాలం గడుస్తోందంటే శాంతతో కబుర్లు చెప్పుకోవటమే. అది వసపిట్ట.

'శాంతా మీనాన్న నేతి మిఠాయి వ్యాపారం ఏమైనా పెట్టాడా?'

'ఏం?'

'ఆ ఏంలేదు. నువ్వు కొంచెం ఒళ్లు చేసేనూ—,

"మీనాన్న కిరాణాకొట్టు వ్యాపారంలో దివాళా తీశాడా?

'అదేం?'

'మరేంలేదు. నువ్వు పుల్లలాతీసిపోతేనూ'

'మరీ చురక అంటించినట్లు మాట్లాట్టం ఎవరిదగ్గర నేర్చుకున్నావ్?'

'నీదగ్గిరే. సరేకాని బావా! నువ్వు నిజంగా చిక్కిపోయావు.'

'నేను చిక్కిపోయానని ఇంతవరకు ఇద్దరే అన్నారు.'

'ఎవరెవరు?'

'ఒకళ్ళు మా అమ్మ...'

'నాకంత భాగ్యం పట్టద్దులే బావా! జ్ఞాపకం పెట్టుకుంటేచాలు,' తల దించేసుకుంది.

'సరేగాని శాంతా! పెళ్ళెప్పుడు చేసుకొంటావ్?'

'ఏమో! చేసుకోవాలని లేదు బావా! దించినతల ఎత్తేపని లేకపోయింది.

'చెప్పటానికి సిగ్గుపడుతున్నావ్.'

'నీకు చెప్పటానికి సిగ్గెందుకు! నిజంగా చెసుకోవాలని లేదు.'

'అదేమిటి శాంతా! మంచివాణ్ని చూసి చెసుకోక...'

'ఆ మంచివాళ్ళెవరూ పెళ్ళి కాకుండా లేరు. సరేగాని ఒకరు రెండుపెళ్లిళ్ళు చేసుకుంటే ఏమౌతుంది?'

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పటానికి తన గొంతుక పెగలలేదు. శాంత మనసులోని భావం తెలుస్తూనేఉంది. తన ముఖంలో రంగులు మారటం శాంత గమనించకపోలేదు.

'అదుగో పిన్ని పిలుస్తోంది. అయ్యో! నా మతి మరుపూ—నీ కింతవరకు ఆకులే ఇవ్వలేదు.' లోపలికి వెళ్లింది శాంత.

తను అందరాని పండు. తెలిసికూడా తన్నే లక్షించటం చిత్రం. 'తను మాలతికి బదులు శాంతని చేసుకొనిఉంటే' గుండెలో మూలగా దురాశ మూల్గినట్లు ఊహ కదిలింది. మాలతికి అన్యాయం చెయ్యటం. అగ్నిహోత్రం ముందు పురోహితుడు చేయించిన ప్రమాణాలసారం తన్ను కట్టివేస్తుంది. ఆ ఊహ రావటమే అధర్మం. కాని ఎలా కాదనటం—ఆ లేత హృదయానికి ఆశాభంగం కలిగించటం. ఇంతటి తియ్యదనాన్ని, హాయిని సుఖాన్ని నిర్దాక్షిణ్యంగా ఒద్దని కాలితో తోసెయ్యటం ?

ఆకుమడుపులతో శాంత తిరిగి వచ్చినా ఆలోచనల్లో మునిగివున్నాడు తను. మౌనంగా ఆకులు వేసుకున్నాడు.

"సున్న మెక్కువయిందా?"

"ఊహు"

"మరి మాట్లాడవేం?"

"ఆకు లెక్కువయాయి"

"తమ్మ పెడితే సరిపోలా!"

"నీకా"

"ఏం పెట్టకూడదా?"

"కలిసి రావద్దూ!"

చిన్న బుచ్చుకున్న శాంత ముఖం క్షణంలో మార్చేసుకుని మాట మార్చింది.

"నీ పెదిమలు ఎర్రగా పండాయి."

"నీ పెదిమలు పండకుండానే ఎర్రగా ఉన్నాయి!"

"ఊహూ! కళ్లుతిప్పుతూ నొసలు ఇంద్రధనుస్సులా వంచింది.

"పండిన పెదిమలు పండకుండానే ఎర్రగా ఉన్న పెదిమలను తాకితే!"

"తే......"

తనలోని ఉద్రేకం కట్టలు తెంచుకుంది. తన కబంధ హస్తాలలో శాంత తీగలా విలవిలలాడింది. తనలోని పశుత్వం ప్రకోపించింది. అనువుకాని, వీలులేని తప్పించుకుంటున్న శాంత దేహాన్ని క్రూరంగా అదిమిపట్టి ముద్దు పెట్టుకున్నాడు.

పట్లు విడిపించుకున్న శాంత "తప్పు బావా..." అంటు తిరిగి చూడకుండా వెళ్లిపోయింది. ఆమాట కొరడాతో కొట్టినట్లయింది. కిటికీ లోంచి మాలతి ఈ దృశ్యాన్ని చూసి తప్పుకోవటం లీలగా కన్పించింది. తనకి ముచ్చెమటలు పోశాయి. ఏమిటి తనిప్పుడు చేసింది? తనమీద తనకే అసహ్యం వేసింది. మాలతిని ఏ మొహం పెట్టుకు

(63-వ పేజీ చూడండి)




కుమారి
ఆర్. నాంచారమ్మ

మనిషికి అప్పుడప్పుడు, తాత్కాలికంగా పట్టే వైభోగాల్లో పరీక్షల సమయం ఒకటి. పరీక్షల్లోనూ, ఏదైనా జబ్బు చేసినప్పుడూ, మనకి మనచుట్టూ వుండే వ్యక్తుల మీద సంపూర్ణాధికారం వుంటుంది. అప్పుడు మనింట్లో వాళ్ళమీద మనకున్న అధికారం, ఒక దేశంమీద ఆ దేశపు రాజుకున్న అధికారంతో సమానమని చెప్పవచ్చును.

పరీక్షల్లో—(పరీక్షల ముందు ఓ పదిహేను, ఇరవై రోజులని కూడా అర్థం చేర్చుకోవాలి) విద్యార్థులెవరూ ఇంట్లో పని చెయ్య నక్కర్లేదు. ఉత్తప్పుడు, "ఒరే, బజారుకెళ్ళి ఓ వీశెడు వంకాయలు పట్టుకురా!" అనో, ఆడపిల్లయితే "కాస్త ఆ కూర తిరిగివ్వవే" అనో పురమాయించి, చేసేదాకా అదేపనిగా సాధించే పెద్దవాళ్లు, పరీక్షల రోజుల్లో ఇవతలి పుల్ల తీసి అవతల పెట్టమని కూడా చెప్పరు. ఒకవేళ, ఏ తమ్ముడైనా వచ్చి "ఒరే అన్నయ్యా, ఈ సెన్సుబొమ్మ వేసిపెట్టరా" అనో, లేకపోతే ఏ చెల్లెలైనా వచ్చి "అక్కా కాస్త ఈ తాటాకుతో బొమ్మ చేసి, నీ వోణీ చింపి చీరకట్టిపెట్టవే" అనో అడిగినా "ఒరేయ్! మీరిలా రండ్రా! వాళ్ళకి పరీక్షలు, మీరెవ్వరూ మాట్లాడకండి!" అని వాళ్ళని నోరెత్తనివ్వరు. అంటే మన పరీక్షలన్నాళ్ళూ ఇంట్లో పిల్లలందరి స్వేచ్ఛకీ బంద్ అన్నమాట! వాళ్ళెవ్వరూ గట్టిగా మాట్లాడకూడదు. ఇష్టం వచ్చినట్లు గోలపెడుతూ అల్లరి చెయ్యకూడదు. "వీళ్ళ పరీక్షలెప్పుడై పోతాయిరా దేముడా!" అని జపం చేస్తూ కూర్చోవాలి అయిపోయే వరకూను.

ఒక్క అల్లరి చెయ్యక పోవటంలోనూ, మాట్లాడక పోవడంలోనూ వాళ్ళ పాట్లు పూర్తవవు. ఇవతల ఈ పరీక్షలకు కూర్చోబోయే అదృష్టవంతులకి, 'అందింపు'అందివ్వలేక, ఈ మధ్యకాలంలో చిక్కి సగమయి పోతారు. అసలు పరీక్షల కోసం చదివేవాళ్లు రోజుకి పదిసార్లు ఫలహారాలు చేసి, నాలుగుసార్లు భోంచేసి, బొండుల్లా తయారవుతారు. పరీక్షలయిపోయే టప్పటికి. మధ్య ఈ చిన్న పిల్లల మొహాలమీద పరీక్షల ప్రభావమంతా కనబడటం!

మా చెల్లెల్ని ఒక చుట్టం "ఏమే తల్లీ! అంత చిక్కిపోయావూ?" అని అడిగితే అది చెప్పిందిగదా, "ఏం చెయ్యనండీ, మా అక్కయ్య పరీక్షలు కదూ!" అని. ఆవిడ నన్ను కూడా ఓసారి పరామర్శిస్తుందేమోననుకున్నా. కాని నా సరదా తీరలేదు. ఆవిడ తప్పేమీ లేదందులో నిజానికి; అద్దంలో చూసుకుంటే, నా నటుకు నాకే "కొంచెం లావయ్యానేమో" ననిపించింది. "మళ్ళీ, 'పరీక్షలయిపోయాయిగా, ఇంక చిక్కిపోతాను ఫరవాలేదులే' అని సరిపెట్టుకున్నాను.

రోజూ "అమ్మా! కాసిని మంచినీళ్ళివ్వవే," అని మెల్లిగా వినయంగా అడిగితేనే, "ఏం దొడ్లోకెళ్ళి తోడుకు తాగలేవూ, అన్నీ అందియ్యాలి కాబోలు" నని కసురుకునేది మా అమ్మ. పరీక్షల్లో అయితే, అడగటమే తడవుగా కూల్ డ్రింకులూ, పళ్ళరసాలూ—అవీ ఇవీ ఏమిటి, ఏవి కావాలంటే అవి సరాసరి నోటిదగ్గరకే పట్టుకురమ్మన్నా ఎవ్వరూ విసుక్కోరు. పైపెచ్చు, బతిమాలుతారు కూడా: "కాస్త ఈ కప్పుడు రసం తాగెయ్యమ్మా! లేకపోతే వేడి చేస్తుంది, మా అమ్మకదూ!" అంటూ.

అల్లా బతిమాలించుకోటమంటే నాకెంతో సరదా! వట్టిరోజుల్లో తీర్చేవారుండరు కాబట్టి పరీక్షల్లో దాన్ని తీర్చుకుంటూ వుంటాను. "అమ్మా! ఆ ఆకలెయ్యటములేదే!" అని అడుగు మెట్టు దగ్గరనుంచీ మొదలుపెట్టి, "ఛ, ఛ; వెధవ కూర; ఇదేమిటిట్లా వండావే? గడ్డిలా వుంది," అని కోపగించుకునే చివరిదశదాకా ప్రతిచోటా బతిమాలించుకోవచ్చు చక్కగా. మా యింట్లో మాత్రం, నా పరీక్షలన్నాళ్లూ నా ఆజ్ఞలమీదే వంటకాల్ని తయారుచెయ్యటం! వాటల్లో ఏమాత్రం తేడా వచ్చినా నేనూరుకోను. అంచేత, జాగ్రత్తగా, నా కిష్టమైన పద్ధతుల్లో లోపాలేమీ రాకుండా తయారవుతుంది భోజనం.

మనం నిజంగా చదివినా, చదవకపోయినా కష్టపడినా కష్టపడకపోయినా, ఈ ఆధిపత్యానికీ ఈ జరుగుబాటుకీ ఏమీ లోపం వుండదు. వట్టి రోజుల్లో అయితే. ఈసౌఖ్యాలుండవు సరిగదా, రాత్రి పదిన్నర వరకూ చదవకపోతే వూరుకోరు పెద్దవాళ్ళు. నిద్రొస్తే, కాస్త టీ తాగి మెలకువగా వుందామన్నా, "వెధవ అలవాట్లు! టీ లేదు, ఏమీ లేదు, కళ్ళకి నీళ్ళు రాసుకో అదేపోతుంది నిద్ర." అని కేకలేస్తారు. వుత్తప్పుడు "అప్పుడే పడుకేశావూ, ఇంకా పదన్నా కాలేదు," అని సాదించే వాళ్ళు, పరీక్షల్లో, "పగలంతా చదివేవుగా, ఇంక చాల్లే పడుకో. ఇంకా

## మీ ఇంటి వాడుకకు...

# మేలు రకపు

# డస్ట్ టీ

మేలురకపు టీనే తమ ఇంటి
వాడుకకు కోరే వారికి
బ్రూక్ బాండ్ ఏ-వన్ (A 1)
డస్ట్ టీ. ఖర్చు తక్కువ.
ఒక పౌనుకు ఎన్నో కప్పుల
టీ అవును.




బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

నిశిరాత్రి దాకా మేలుకుంటే, ఏదైనా జబ్బు చెయ్యగలదు" అని తొమ్మిదింటికే పవ్వళింపు గీతాలు మొదలెడతారు. రోజూ విదున్నరకల్లా నిద్రలేవకపోతే మంగళ హారతు లెత్తుకునే వాళ్ళు, పరీక్షల్లో ఆలిండియా రేడియోవారలు వింటూ లేచినా, మొఖం కడుక్కొచ్చేటప్పటికి, కాఫీగ్లాసు రెడీగా వుంటుంది. వుత్తప్పుడట్లా లేస్తే ఆ పూట కాఫీకి స్వస్తే గాకుండా "చదువుకునే వాళ్ల లక్షణం ఇదేనా?" అనే ప్రశ్న ఇంట్లో వాళ్ళందరి నోట్లోంచీ తలోసారీ వినలేక బాధపడాలి. మరి యీ లక్షణం పరీక్షల్లో వర్తించదు. "ఆ, అలిసిపోయారులే" అని సరిపెట్టుకుంటారు.

ఈ చదువూ, ప్రొద్దున్నే లేవటం, ఇవట్లా వుంచి, మామూలుగా ఇంటిపనుల్లో మా అమ్మకి సాయం చెయ్యకపోతే ఆవిడసలూరుకునే మనిషి కాదు. కొంతమంది అనుకుంటారు. "చదువుకునే ఆడపిల్లలు, ఇంట్లో పనులుకూడా చేస్తారా!" అని. అల్లాంటివాళ్లు ఒకసారి మా యింటికొచ్చి చూస్తే వాళ్ళ సందేహం సమూలంగా తీరిపోతుంది. అటువంటిది, పరీక్షల్లో చిన్న కంచం కూడా ఎత్తక్కర్లేదు. ఒకవేళ ఎప్పుడైనా మొహర్బానీకోసం, నేనెత్తబోయినా, "అదట్లావుంచి నువ్వెళ్ళి చదువుకోవే" అని ఎత్తనివ్వదు అమ్మ.

ఓమూల, ఇంతసౌఖ్యంగా వున్నా, మనసులో భయంగానేవుంటుంది. "ఏంచేస్తామో పరీక్షల్లో" అనేభయం, "మనంసరిగ్గా రాయగలుగుతామో, లేకపోతే పాడుచేస్తామో" ననే ఆత్రుత, తీరాచేసి, పరీక్షలో ఫెయిలయితే జరిగేమర్యాద, ఇప్పటి ఈ మర్యాద కెన్నిరెట్లు అధికంగా ఉంటుందోననే ఆలోచన, బెంగపట్టుకునేట్లు చేస్తాయి. అందుకనే పరీక్ష లయిపోయిన క్షణంలో ఏదో బరువు దింపుకున్నట్లు ప్రాణానికి హాయిగా ఉంటుంది. ఆ తరవాత, మళ్ళీ ఫలితాలకోసం ఎదురుచూడటం వేరేసంగతి.

పరీక్షల్లో అన్నంతినబుద్ధెయ్యదు. ఆకలాకలే కాదు ఏమీ తినకపోయినా, ఎంత చక్కగావండినా, ఎంతయిష్టమైన పదార్థాలు చేసినా, నోట్లోపెట్టుకో బుద్ధెయ్యదు. చచ్చిచెడి, ఏదో పెద్దవాళ్ళ బలవంతంవల్ల తిన్నా, ఆ గాభరాలో వాంతులు కూడా పట్టుకుంటాయి.

ఏదో భయం భయంగా ఉంటుంది పరీక్షలయ్యేవరకూ. పోనీ, ఆ భయంతోనైనా బాగాచదువుతామా అంటే అదీ లేదు. ఊరికే భయపడిపోవటమే కాని చదవాలని ఉండదు. ఆ ఖంగారులో పుస్తకం తెరుస్తే వచ్చిందేదో, రానిదేదో కూడా తెలియనంతటి అయోమయంగా, అగాధంగా కన్పిస్తుంది. చివరికా "పాఠాలసలెక్కడైనా విన్నానా?" అన్న సందేహంకూడా వస్తుందొక్కొక్కసారి.

పోనీ, చదవటంమానేసి పడుకుని నిద్రపోదామనుకుంటే అదీసాగదు. కంటిమీదికి కునుకురాదు. కళ్ళుమూస్తే ఎదురుగా పరీక్షలూ, ప్రశ్నపత్రాలూ కనిపిస్తాయి. తమాషా—వచ్చేకలలన్నీ మనం ఫెయిలయిపోయినట్లే వస్తాయి ఆ సమయంలో!

ఎక్కడలేని ఆలోచనలూ, పరీక్షల్లోనే వస్తాయి. "మిగతా వాళ్ళందరూ ఏం చేస్తున్నారో" అని సహాధ్యాయుల్ని గురించి తలుచుకుంటే "అయ్యబాబోయ్" అనిపిస్తుంది. ఎవరిమటుకు వాళ్ళు, "అందరూ చదివేస్తున్నారు. నేనే చదవటంలే"దని ఖంగారుపడిపోతారు. తీరా చదవబోతే మనస్సు నిలకడగా ఉండదు. పరీక్షల్లో ప్యాసయితే ఏంచెయ్యాలో, ఫెయిలయితే ఏవిధంగా రైలుకింద తలకాయపెట్టాలో— అన్ని ఆలోచన్లూ అప్పుడేవస్తాయి. పరీక్షల రోజుల్లోనే, ఒకప్పుడు మా స్నేహితురాలు కవిత్వంకూడా అల్లింది:—

"పరీక్ష లొచ్చేస్తున్నాయ్
గుండెలు గుభేలు మంటున్నాయ్
పుస్తకం తీస్తే అయోమయం
అది మూసేస్తే మరీభయం—"

అంటూ ఏదో, శ్రీశ్రీధోరణిలో. ఇదీ బాగానేఉంది, పరీక్షల ధర్మమాఅని ఈ అమ్మాయికి కవిత్వం పట్టుబడుతుందేమో ననుకున్నా. కాని, అందరిఆధునిక కవులకిమల్లేనే, ఆపరీక్షల ఆవేగం పోయేటప్పటికి, ఆ కవిత్వ ధోరణే పోయింది.

సంవత్సర మంతా లేని పశ్చాత్తాపం పరీక్షల్లో వస్తుంది, అన్నాళ్ళూ వృథాగా గడపేసినందుకు. అప్పుడైనా, ఇన్నాళ్ళూ చదవలేదే అని విచారిస్తాం గాని, పోనీ ఈ కొంచెం సమయంలోనైనా కాస్త చదువుకుందామనే దృష్టి ఉండదు. పుస్తకం చేత్తో పట్టుకుంటే మనస్సు పరిపరివిధాల పోతుందికాని దానిమీద లగ్నం చెయ్యలేము. ఎంతచెప్పినా, పరీక్షరోజుల్లో విద్యార్థుల మనఃస్థితి పూర్తిగా మాటల్లో చెప్పడాని కలవికాదు. అదొక అనుభవైకవేద్యమైన వింతదశ. అన్నంతినలేక, నిద్రపోలేక పడే అవస్థ చూసేవాళ్ళకి నవ్వూ, జాలీ, రెండింటినీ తెప్పిస్తుంది. నిద్రలేక ఎఱ్ఱబడిన కళ్లనిమూసి "అయ్యోపాపం, పరీక్షలకోసం ఎంత కష్టపడుతున్నారో" అనుకుంటారు.

పొద్దున్న పరీక్ష అనగా, నా అనుభవాన్నిపట్టి తెలుసుకున్న విషయమేమంటే, ఆ రాత్రి, ఆ సబ్జక్టుని అసలు చూడకూడదు; తలుచుకోకూడదు. పోనీ, ఓసారి ఏం వచ్చిందో, ఏం రాలేదో చూసుకుందామని అనుకుంటే మన పనైపోయిందన్నమాటే! మన కొచ్చిందీ, పరీక్షలో ఇస్తే వ్రాయగలిగేదీ ఒక్కవిషయం కనబడదు. అంతవరకూ చదివిన దేమైపోతుందో, బుఱ్ఱంతా ఖాళీగా ఉన్నట్లనిపిస్తుంది. ఆ పరీక్షంటే హడలుపుట్టి పరీక్షలు మానేద్దామనిపిస్తుంది. అంచేత, మరీ పరీక్షలముందు మనజ్ఞానాన్ని పరీక్షించుకోకూడదు. ఆ పని మర్నాడెట్లాగూ జరుగుతుంది. మన మనుకున్నదానికంటే తేలిగ్గానే ఉంటుందికూడా.

ఎప్పటికప్పుడు "ఈ ఒక్కసారీ ఎల్లాగో పాసయిపోతే మళ్ళీ సంవత్సరంనుంచీ జాగ్రత్తగా ఎప్పటి పాఠాలప్పుడు ముందుగానే చదివేసుకుందాం" అనుకుంటాం. కాని తర్వాత యథాప్రకారమే. ఎంత "దేముడూ లేడు, దయ్యమూ లేడు" అనే వాళ్ళకైనా పరీక్షల్లో "దేముడనే వాడుండి, పరీక్ష పాసయేటట్లు చేస్తే కొబ్బరికాయ కొడతా" నని అనుకో బుద్ధేస్తుంది.

పరీక్షలప్పుడు, బాగా చదివి మంచి మార్కులు తెచ్చుకోగలిగిన విద్యార్థికీ, ఏమీరాని శుద్ధ బడుద్ధాయికీ ఒకేవిధంగా ఉంటుంది మనఃస్థితి.

ఒక చెంప వెన్నెల్లోనూ, రెండవచెంప ఎండలోనూ ఉన్నట్లుగా ఉండే పరీక్షలయిపోయిన తరవాత, పెద్దభారం తగ్గిపోయినందుకు 'అమ్మయ్య' అనుకుంటాం. అదే క్షణంలో, మనకా సమయంలో ఉన్న ఆధిక్యత, ఆధిపత్యమూ ఇక ఉండవన్న సంగతి తలుచుకుంటే 'అయ్యో' అనిపిస్తుంది. ★

# బంగారం సింగారం

3

బాపు — బొమ్మలకథ —






















మరుక్షణంలో పెద్ద పిడుగు పడింది ఆ కంగారులో ధనగుప్తుడి కళ్ళు చీకట్లు కమ్మి ముందున్న పాడు నూతిలో పడి పోయాడు - పెట్టెతో సహా -


హాయ్యో పెట్టె! నూతులో పెట్టె! అందులో ఎన్ని వజ్రాలున్నాయో!
ఫరవాలేదు - బంగారు శర్మా వాన తగ్గాక వచ్చి పెట్టె తీసి పంచుకుందాం


దగా చెయ్యకూడదు మరి
ఛా! ఎంతమాట - ఎంత పడితే అంత ఒట్టు -


కాని ఇంతలో ఇంకో పిడుగు ఓ చెట్టు మీద పడింది ఆ చెట్టు కాస్తా ఫెళఫెళా విరిగి వీళ్ళిద్దరి మీదా పడింది - పడగానే ఇద్దరూ దాని కింద నలిగి.....పోయారు


బంగారంగారు తిరిగి ఈ లోకంలోకి వచ్చారు
ఎంత చిత్రం!


కాని నా మేనల్లుడు సింగారం వెధవ ఆ జన్మలో కూడా నన్ను శనిలా పట్టుకున్నాడే! - పోలికంతా వాడి లాగే ఉంది -


శలవు - నేను పోయొద -- మీ వాడు కాఫీ మటుకు తేలేదు - బీడీ లన్నా....
పోవయ్యా పో! నాకు అర్జంటు పనుంది -


జూవా పోవాలిగా మరి! ఆ పెట్టె ఇంకా అక్కడే ఉండచ్చు

# అవిముక్తుడు

శ్రీనివాసరావు అప్పుడే ముఖం కడుక్కొని వచ్చి, వాలుకుర్చీలో కూర్చున్నాడు. ఇంతట్లో పేపరుకుర్రాడు పేపరిచ్చాడు.

శ్రీనివాసరావు మొదటి పేజీలో ముఖ్య శీర్షికలు చూసి రెండో పేజీనుండి మూడో పేజీలోకి వచ్చాడు,

బి. ఎ. రిజల్ట్సు వచ్చాయి.

గజగబ నంబరు వెతికాడు.

'అనంతం' నెగ్గాడు.

సంతోషం వేసింది. అపరిమితమైన సంతోషం. చాలమందికి లభ్యంకాని ప్రత్యేక సంతోషం తనకివాళ లభ్యమైంది. గర్వంగా తనలోతానే నవ్వుకున్నాడు. శ్రీనివాసరావుకు ఏడేళ్ళక్రితం అనంతాన్ని తనయింట చదివించే ఏర్పాటు ఎలా అయిందో జ్ఞప్తికి వచ్చింది.

తను అనంతం యింటికి వెళ్లాడు. అనంతం తన పెదతండ్రి మనుమడు. ఆయేడే అనంతం మూడోఫారం పాసయేడు. అప్పుడు అనంతం తల్లి అంది: "బాబూ! శ్రీనివాసూ! నిన్ను ఒక్కటి కోరాలనుకుంటున్నాను. అనంతం చదువు ఎలా సాగుతుందో తెలీకుండావుంది. నా స్థితిగతులు నీవెరగనివి కావు. మీ అన్నగారే వుంటే ఏదోచేసి చదివించేవారే. కానీ నా సాహసం అంత్యదేమీ కాదు.

ఈభారం నీమీదే వేస్తున్నా. వీలున్నది ప్రతీనెలా పంపుతా. నువ్వు వాడిని నీకొడుకులా భావించి విద్యాబుద్ధులు గరపి పెద్దవాడ్ని చెయ్యాలి. కాదనవు నువ్వు. నీ వొదిన కోర్కె చెల్లిస్తావుకదూ!"

ఆమెగొంతూ, ఆమెదీనత్వమూ, ప్రాధేయతా - తనలో కదలికను తెచ్చాయి. మారుమాటాడకుండా అలాగే అన్నాడు. తనతో కూడా అనంతాన్ని తోడ్చుకు వచ్చాడు యింటికి.

లక్ష్మి సంగతి తెల్సుకుని అంగీకారమే తెల్పింది. తనయిద్దరి పిల్లలతో అనంతమూ ఒకడనుకుంది.

మూడేళ్లు గడచి స్కూలుఫైనలు పాసయాడు. అనంతం తల్లి 'చేసిన వుపకారానికి' కృతజ్ఞతచెప్పి తర్వాత ఉద్యోగమూ యిప్పించ కోరింది.

తను ఒప్పుకోలా. బి. ఎ. పూర్తిచేయించాడు అనంతాన్ని.

ఇవాళే తను తలపెట్టిన సత్కార్యం, ప్రసాదించిన విద్యాదానం సార్థకమయింది. తనజీవితంలో ఎంతవిశేషం!

ఆలోచనలలో తన్మయుడయాడు. లక్ష్మి కాఫీ తెచ్చి అందిచ్చింది.

"రిజల్ట్సు వచ్చాయి లక్ష్మీ! అనంతం పాసయేడు."

"ప్యాసయేడా! చాలబాగుందండీ, మన శ్రమకు ఫలం దక్కింది."

"ఆఁ దక్కకేమవుతుంది? నా ఆశయం మంచిదాతే. మరి టెలిగ్రాం యిప్పిస్తా అనంతానికి."

"అవునండీ. వెంటనే యివ్వండి. అయినా పల్లెటూరికి అందుతుందా వేగంగా?"

"ఆఁ రెండుమైళ్ళేకదూ! టెలిగ్రాఫ్ ఆఫీసుకు మైలేజి చెల్లించాలి."

"అయితే వెళ్తారా బజారుకు?"

"ఆఁ"

*  *  *

శ్రీనివాసరావు టెలిగ్రాం యిచ్చి యింటికివస్తున్నాడు. స్నేహితుడు భాస్కరమూర్తి కనిపించాడు.

"ఏమిటోయ్ ఎక్కడ్నుంచి?"

"టెలిగ్రాఫ్ ఆఫీసుకు వెళ్లా."

"అదెందుకోయ్?"

"మా యింట్లోవుండి చదువుకొనేవాడే అనంతం? ఆ అబ్బాయి బి. ఎ. పాసయేడు. అతనికే టెలిగ్రాం."

"ఆ! బాగుందోయ్. బి. ఎ. వరకూ చెప్పించావ్. అసాధ్యుడివోయ్."

"ఏదోలెద్దూ-చేతనైనది చేశాను."

"అయినా ఎందరుంటారు నీవంటి సదాశయులు!"

శ్రీనివాసరావు యింటిసమీపానికి వస్తున్నాడు. పొరుగింటాయన్ని పలకరించి:

"అనంతం పాసయేడండి" అన్నాడు.

"అలాగా! మంచిపని చేశారండీ శ్రీనివాసరావుగారూ! మీ వుదారబుద్ధిని మెచ్చుకోవాలండీ. ఒక కుర్రవాడ్ని బాగుచేసి ఆ కుటుంబానికి ఉపాధి కల్పించిపెట్టారు."

"ఏదో...ఏమాత్రం..! నేను చెయ్యగలిగిన ధర్మం చేశా."

శ్రీనివాసరావులో ప్రతి రక్తాణువూ తన సామర్థ్యాన్ని, ఘనకార్యాన్ని తలచుకొని మురిసిపోతున్నది.

*  *  *

మర్నాడు శ్రీనివాసరావును ఆఫీసులో మిత్రులందరూ అభినందించారు.

"మీరు నిజంగా యీ ఏడేళ్లూ చదివించడంచూస్తే మాకు ఆశ్చర్యం వేస్తుంది. మీ అభిమానం ఎంత గొప్పదండి!"

"మీరు ఆదర్శవాదులు. ఆ ఆదర్శం ఆచరణలో చూపించారు. ఈ రోజుల్లో ఇన్నేళ్ళు యింట్లో వుంచుకొని చదివించడం సామాన్యమా!"

ఇలాగే పలువురు మిత్రులు శ్రీనివాసరావును కొనియాడారు. అతని హృదయమంతా సంతృప్తితోనూ, సరదాతోనూ వెల్లివిరియగా జవాబిచ్చాడు.

"అబ్బాయిని విద్యాబుద్ధులు చెప్పించి పెద్దవాణ్ని చేశాను, ఏదో మనపేరు చెప్పుకొని సుఖిస్తాడుగదా అని. ఇప్పుడు నాకు చీచాలావరకూ వదలిపోయింది. ఏదో సామాన్యులం యింతకంటే..."

"బాగుంది మీరనేమాట! ఇదేం తక్కువ త్యాగంటండీ! మాకొసాహసం ఏదీ?"

శ్రీనివాసరావు మౌనంగా క్షణం నెమరవేడు. తను నిజంగా గొప్పపని చేశాడా! అవును. నిజంగా గొప్పపనే!

*  *  *

అనంతం వచ్చాడు.

శ్రీనివాసరావు అనంతాన్నిచూస్తే శివి ప్రదర్శిస్తాడు.

అనంతం శ్రీనివాసరావునుచూస్తే అణకువ చూపుతాడు.

అనంతాన్ని భావికార్యక్రమం ఏమిటన్నాడు.

"ఏముంది, మీరున్నారు ఏ నిర్ణయానికి.."

"అవును ఎంప్లాయిమెంటులో పేరు రిజిష్టరు చేస్తావా?"

"అలాగే."

అనంతం శ్రీనివాసరావు అడుగుజాడల్లో మెలగుతాడు. అంతే. మెలగాలి.

శ్రీనివాసరావు ఏడేళ్ళు తనయింట వుంచుకొని పోషించాడు. అందుకు అతని మాట జరపాలి.

అనంతం నాల్రోజులు పోయింతర్వాత దేశం తిరిగిరావటానికి తన స్నేహితుడొకడు రమ్మన్నాడని, వారంరోజుల్లో తిరిగివచ్చేస్తానని శ్రీనివాసరావుతో అన్నాడు.

## "ప్రసూనా"

అంగీకరించలా శ్రీనివాసరావు.

"అదేమిటోయ్! నేడో రేపో ఇంట రూప్యకి పిలుస్తారు. నేను నిన్ననే కల్సుకున్నా ఎంప్లాయిమెంటు గుమస్తాను. ఇపుడు ఖాళీ ఎలాగు?"

అనంతం కాదనలేదు. తను ఎలా కాదనగలడు? కానీ అతని వ్యక్తిత్వం కొంచెం గిజగిజలాడింది.

అనంతం వుద్యోగంలో ప్రవేశించాడు. ఏం వుద్యోగం దొరుకుతుంది? గుమస్తా! బి. ఎ. ప్యాసయినా గుమస్తాయే. మరోటైతే ఎలా కుదురుంది? ప్రవేశించాడు.

శ్రీనివాసరావు మనసు అనంతాన్ని గురించి యింకా సంతోషపడింది.

అనంతం శ్రీనివాసరావింట్లోనే భోజనాదికాలు నెరవేరుస్తూ వుంటున్నాడు. ఏడేళ్ళుగా చేస్తూ వచ్చిన కార్యక్రమం నేటికీ తప్పలేదు.

ఉదయానే బజారుకు వెళ్ళి కూరలు వగైరాలు యింటికి చేర్చటం ప్రారంభమై, లక్ష్మిదేవి, శ్రీనివాసరావుల కటాక్షవీక్షణాలకు అనువుగా అవసరోపచారాలు నిర్వర్తించడం వరకూ అన్నీ యథావిధిగా సాగుతున్నాయ్.

శ్రీనివాసరావు తను చేయగలిగినదానికి దేనికో కొన్నాళ్ళు ఆరాటపడ్డాడు. అయితే ఆ ఆరాటం అట్టేనాళ్ళు వుండనక్కర లేకుండా తన దూరపు బంధువుల్లో ఒక బడిపంతులు వచ్చి, ఆ కాస్త వేదనా ఉపశమించే దారి చూపాడు. అంతేకాదు. తన మండి బ్రహ్మాండమయిన ఉపకారం అరించి వెళ్ళాడు. అంచేత, శ్రీనివాసరావు స్వతహాగా త్యాగచింత గలిగినవాడు కనుక, అనుకున్నదానికంటే ఎక్కువగా సంతృప్తుడవగలిగే అవకాశం కల్గింది.

* * *

అనంతం తల్లి శ్రీనివాసరావు లేఖ చూసుకొని వచ్చింది.

విషయం చెప్పి శ్రీనివాసరావు పిల్లకుటుంబాన్ని వర్ణించి చెప్పాడు.

ఆమె అంది: "కన్నతల్లిని. వాడొక యింటివాడు అవటంకంటే నాకేం కావాలి? అయితే మా స్థితిగతులు నీకు తెలియనివి కావు. పిల్లడికి నీవు సమకూర్చిన విద్యాధనం తప్ప మరేం లేదు, ఇప్పుడు ఖర్చులకేనా..."

"ఇదిగో-వాట్ని గురించి ఆలోచించకండి. నేనున్నాగా! అయితే ఒకటి. కట్నం ఎక్కువ వాంఛించలేము. నా మిత్రుడు హైస్కూల్లో బడిపంతులు."

"నీ యిష్టం నాయనా!-సహజంగా కుర్రవాడి తల్లిని కనక కట్నం పుచ్చుకోవాలని వుంటుంది. కాని నాకే ఆడపిల్ల వుంటే... అయినా నీవు తలపెట్టి జరుపుతున్నావ్. నా అడ్డంకి ఏమీ వుండదు. అయినా అనంతాన్ని తెలుసుకోవాలికదా"

"అవునమ్మ అనంతాన్ని అడగండి. అతని అంగీకారం లేకుంటే ఎలాగా?"

"అదేమిటి? అనంతం నీ మాట తీసేస్తాడా బాబూ!" నిజమే నన్నట్టు తలవూపాడు.

శ్రీనివాసరావు భోజనంచేసి పడక గదిలోకి వెళ్ళాడు.

అనంతమూ, తల్లీ మాటలాడుకోడం విన్పిస్తూంది. అనంతం గొంతు:

"అమ్మ! ఇంకానా - ఒద్దమ్మ! యీ సహాయం యింకా వద్దమ్మ! ఇప్పటికే వారికి చాలా ఋణపడివున్నా".

శ్రీనివాసరావు తనపట్ల అనంతం చూపుతున్న సద్భావాన్ని, వినయాన్ని అనంతం మాటల్లో విని చాల సంబరపడ్డాడు.

అనంతం అంటున్నాడు:

"అమ్మ! నీకేం తెలీగు. ఏడేళ్ళు నేనిక్కడ ఎలా వున్నానో! నాకేలోటూ జరగలేదు. కాని నేను ఒక్కరోజూ స్వేచ్ఛగా లేను. స్వతంత్రంగా తిరగలేదు. ఆలోచించలేదు. నన్ను యిన్నేళ్ళు యిక్కడ పరాధీనజీవిగా వుంచావు. ఇప్పటికైనా నాకు విముక్తి కలుగనియ్యి.

ఇంకా ఆ వచ్చేపిల్లా నాలాగా బాబాయ్ గారికి జీవితాంతమూ ఋణపడి వుండకూడదమ్మ!"

అనంతం తల్లి-కొడుకు మాటలకు సంభ్రమంతో నిరుత్తర అయి అతన్ని చూస్తూ కూర్చుంది. ఆమెకు ఏం తోచలేదు. ఇన్నేళ్లు వుపకారం చేసి విద్యాబుద్ధులు గరపిన శ్రీనివాసరావు నేనా యిలా అంటున్నాడు తనకొడుకు! ఇంత విశ్వాసఘాతకుడా తన అనంతం! అనుకుంది. ఆమెకు కొంత బాధకల్గింది. 'శ్రీనివాసరావు గురించి అపార్థంచేసుకుంటున్నా'వని గట్టిగా గద్దించి అంది

"ఏమిట్రా అనంతం! ఏరికే మాటాడుతున్నావా? ఎవరినిగురించి నీవనేది? నిన్ను ఏడేళ్ళు సర్వోపచారాలుచేసి, పెద్దచేసిన శ్రీనివాసరావు బాబాయ్ నేనా అంటున్నది?"

తల్లి కోపం తగ్గటానికి కొన్ని నిముషాలు మౌనం వహించాడు అనంతం. తర్వాత అన్నాడు:

"అవునమ్మ! శ్రీనివాసరావు బాబాయ్ నే. నీకు తెలీగు. ఇంక నేనిక్కడ వుండలేను. ఈ బానిసతనానికి రేపటినుంచే విముక్తి- మళ్ళీ నేను స్వతంత్రునిగా నీకళ్ల ముందుకు వస్తా- శ్రీనివాసరావు బాబాయిని నా జన్మలో మరచిపోను—అతని అవ్యాజమయిన ఆదరాభిమానాలు మరచిపోను. అతని ఋణం తీర్చుకొనే తరుణోపాయం వెతుకుతూనే వుంటా—క్షమించు" అనంతం అక్కడనుంచి తప్పుకొని పోయాడు.

అనంతం తల్లికి ఏమీ పాలుపోలేదు. ఆమెగుండె దడదడలాడింది క్షణం. కోపంతో వుడికిపోయింది మరుక్షణం. అయినా ఆమె

( 28 పేజి చూడండి)



# అద్దం పగిలింది —

వాడ్రేవు పతంజలి

ముందు ట్రంకుపెట్టె; తర్వాత పరుపు చుట్ట; ఆతరువాత మిఠాయిబుట్ట. పసుపు, కుంకుమపొట్లాలూ అన్నీ బండిలో పెట్టారు.

"లేవండర్రా మరి. బస్సుకి టైము అవుతోంది." అంటూ బయటకు వచ్చారు తాతగారు. పిన్ని, అత్తయ్య, మామయ్య అంతా సావిట్లో దిగాలుగా నుంచున్నారు. అమ్మ మాత్రం ఒకమూల అమ్మమ్మని ఓదారుస్తోంది.

"ఏమిటో దూరమా, భారమా? ఎప్పుడు కావాలంటే అప్పుడు మళ్లా వస్తుంది," అన్నారు తాతగారు. అన్నారేగాని ఆయనకు కూడా కనుకొలుకుల్లోంచి ముత్యాల్లా నీటిబిందువులు తొంగిచూస్తూనే వున్నాయి.

"సూరక్క— అసలు అత్తవారింటిలో ఎప్పుడూ వుండే—ఎప్పుడో ఒకసారి చుట్టపుచూపుగా వెడుతుంది. మళ్ళా మనం రమ్మని కబురంపితే బావ తీసుకువచ్చిదిగబెడతాడు. దాని కింత బాధపడట మెందుకూ?" అంటున్నారు మామయ్య.

నాకు కళ్లవెంట నీరు బొటబొట రాలుతున్నది.

"ఓరేయ్—నువ్వెందుకురా ఏడుస్తావూ? జ్ఞానం వచ్చినవాడివి. అమ్మతో వెళ్ళి చదువుకి స్వస్తి చెబుదామనా? ఊరుకో, ఊరుకో" అంది పిన్ని నన్ను బుజ్జగిస్తూ. నాకెంతో సిగ్గేసింది.

అమ్మమ్మ బేల; పిన్ని బేల; అత్తయ్య బేల; అందరూ బేలలే. అయితే ఎవరికివారు తాము మహా గుండెదిటవు అయినవాళ్ళ మన్నట్లు ప్రక్కవారిని ఊరడించ ప్రయత్నిస్తారు. అమ్మమ్మదిమాత్రం తల్లిగుండె.

అమ్మ అంటే తాతగారింట్లో అందరికీ ప్రాణం. ఇంటికి పెద్దఆడబడుచు. నలుగురికీ తలలో నాలుక. చిన్నతనంలోనే కాలికి ఆ ప్రమాదం జరగబట్టి ఇంట్లో ఏ చాకిరీ అమ్మను చేయనిచ్చేవారు కారు. అత్తవారింటి దగ్గరఅయితే అదెలా సాధ్యం? తనబిడ్డ - అసలే అర్భకం—చాకిరీతో మరింత నీరసపడిపోతుందని అమ్మమ్మ దిగులు. ఎన్నాళ్ళనుంచో మాబామ్మ అంటూన్నదని నాన్నగారు అమ్మను పంపవలసిందిగా ఉత్తరం వ్రాశారు. ఆవూరికీ, ఈవూరికీ దూరం ఏభయిమైళ్ళుఅయినా, 'నాతల్లి నాయింట లేకపోయినతర్వాత ఏభయిమైళ్ళలో వుంటేనేమి, ఏడువందల మైళ్ళలో వుంటేనేమి" అని వాపోతుంది అమ్మమ్మ.

ఒక్కొక్కరూ వీథిఅరుగుమీదకు జరిగారు. బండివాడు ఎద్దుదగ్గర కూర్చుని ఎద్దు నోటికి గడ్డిపరకలు అందిస్తున్నాడు. చుట్టుపక్కల అమ్మలక్కలు వీథిఅరుగు లెక్కి చోద్యం చూస్తున్నారు.

"నా వెంకటేశ్వరుడి ఫోటో బండిలో



పెట్టారర్రా?" అని అడిగింది అమ్మ కళ్ల నీళ్లు వత్తుకుంటూ. పెట్టామన్నారు. మామయ్యొకసారి బండిదాకా వెళ్ళి చూసివచ్చాడు.

"నడవండింక!" తాతగారు మెట్లు దిగుతున్నారు. అమ్మమ్మ అమ్మచెవిలో ఏదో గుసగుసలాడి కొంగున ఏదో మూటగడుతోంది.

"అమ్మమ్మా! బస్సుస్టాండుదాకా నేనూ రావద్దూ?" అన్నాను నేను.

"అలాగే. రా. నువ్వుఇందు బండెక్కుదువు గాని" అంటూ అరుగుమీదనుంచి మామయ్య లోపలికి వచ్చి, నన్ను తీసుకువెళ్ళి బండిలో కూర్చోపెట్టాడు. బండి అబ్బి లపాగా సర్దుకొని వచ్చి, కాడిదగ్గర నిలబడ్డాడు.

"ఒసే సీతా! నువ్వు కాస్త ఎదరికి వెళ్లి నుంచో బండి కదిలేటప్పుడు ఎదురు వద్దుగాని," అన్నారు తాతగారు పక్కింటివారి అమ్మాయితో.

"బండి అబ్బి సిద్ధంగా వున్నాడు. నేను బండి ఎక్కాను. మంచి శకునం కూడా ఏర్పాటయింది. అందరూ వీథిలో నుంచున్నారు. అమ్మమాత్రం బయటకు ఊడి పడదేం," అనిపించింది నాకు.

అప్పటికి నాకు పన్నెండేళ్లుంటాయేమో? తర్డుఫారం క్లాసులు చదువుతున్నాను. అమ్మను విడిచివుండాలనే దిగులు మనసులో పీకుతున్నా, 'మనం మగవాళ్ళం-మనంఏడవకూడదురా' అన్న తాతగారిమాటలూ, 'చదువుకి స్వస్తి చెప్పదామనా?' అన్న పిన్ని మాటలూ, కొంతవరకూ పనిచేశాయి. రాత్రి పడుకోబోయేటప్పుడు ఎన్నో కథలు చెప్పి: "చక్కగా చదువుకుని, నాకూ, నాన్నగారికీ, మన కుటుంబానికీ ఎంతో పేరుప్రతిష్టలు సంపాదించిపెట్టాలి నాయనా!" అనేది అమ్మ. అలాంటప్పుడు "నేనూ పెద్దవాణ్ణయి,



# అద్దం పగిలింది



పెద్దపెద్ద చదువులు చదివి. ఇంకా పెద్దఉద్యోగాలుచేసి అందలమెక్కి అందరినీ సుఖపెడతాను," అని నాలో నేను అనుకొనేవాడిని. అంతులేని అభిప్రాయాలుండి, అమ్మ నాన్నగారి దగ్గరకు వెడుతూంటే, నేనూ వెళ్ళి ఆపలేటూళ్ళో దూడలను కాసే వాళ్ళతో గోళీకాయలూ, గోటీబిళ్ళా ఆడుతూ చదువుకు స్వస్తి చెప్పడమంటే.. పిన్ని మాటలకు నాకందుకే అంత సిగ్గువేసింది. ఆతుణంతర్వాత "మనం ధైర్యవంతులం— మనం అమ్మతో వెళ్ళకూడదు. మనం చదువుకోవాలి. మనం ఎంతోగొప్పవాళ్ళంఅవాలి," అనిపించి మరి కళ్ళమ్మట నీళ్లు రానివ్వలేదు.

పెట్టెకు వేసిన రెండు తాళాలూ సరిగా వేశానో, లేదో, పరుపుకట్ట తాడు గట్టిగావున్నదో లేదో పరిశీలించడం ప్రారంభించాను! మిఠాయి బుట్ట ఘుమ్మ్' మంటోంది. వీథి చివరవున్న సీత మాటిమాటికీ తొంగిచూస్తోంది. అమ్మ త్వరగా వస్తే బాగుండు ననిపించింది. "కదలండర్రా మరి అలస్యమైపోతోంది," అని మళ్ళా తాతగారు హెచ్చరించారు.

అమ్మ, అమ్మమ్మ బండిదగ్గరకు వచ్చారు. అరుగుమీద నుంచున్న వాళ్ళందరూ మెల్లిగా క్రిందకు దిగారు. బండిఅబ్బికాడి నొక్కిపట్టుకున్నాడు. చెయ్యితప్పి తేలిపోయింది.

"ఎక్కమ్మా! వారానికో వుత్తరమైనా వ్రాస్తూండు," అంది అమ్మమ్మ.

"అత్తారింటి కెడుతోందేవిటి నూరక్క?" పొరుగింటావిడ మాటలు విని అమ్మ బండి ఎక్కబోయేదల్లా ఆగి, వెనుదిరిగింది.

"అవునండీ. వెళ్ళొస్తా," అంది.

"మంచిదమ్మా. మీవాళ్ళనందరినీ అడిగానని చెప్పు".

కొందరికి మాటలతోనూ, మరికొందరికి కళ్ళతోనూ, వీడ్కోలు చెబుతూ, అమ్మ బండి ఎక్కింది "నువ్వూ వస్తున్నావేమిట్రా బస్సు స్టాండుదాకాను? ఒరే వీడిచేతకాస్త చదివిస్తూండండి ర్రాత్రిళ్లు." అంది సగం నన్నూ, సగం మామయ్యనూ ఉద్దేశించి అమ్మ. తాతయ్య సీతకు సైగచేశాడు.



"పోనీయవోయ్, శకునం బాగుంది." బండి కదులుతోంది. అమ్మ బయటకు తొంగి చూస్తూ "వెళ్లొస్తానమ్మా! వస్తానర్రా! ఉత్తరాలురాస్తూండండి," అంది.

సీత ముసిముసి నవ్వులు నవ్వుతుంటూ ఎదురువచ్చి, బండి తన్నుదాటాక ఆగి," వుంటాం, నూరక్కపిన్నీ, మళ్ళా ఎప్పుడు వస్తావూ?" అంది. అమ్మ చిరునవ్వు నవ్వింది. బండి సాగిపోయింది.

"అయ్యో, బండిఅబ్బీ! ఒక్కసారి ఆపు. ఒరే క్రితంసారి మీ బావ వదిలేసిన పంచ, లాల్చీ మూటలో కట్టిందేమో. మాణిక్యాన్ని అడుగు" అని కేక వేసింది అమ్మ.

"పోనీలేవే-ఎవరో ఒకరు వస్తూనే వుంటారు. ఈ సారి పంపిస్తాంలే".అన్నారు తాతగారు.

"మూటలో వున్నాయే అమ్మా. నేను చూశాను" అన్నాను నేను.

"నేను లేనుకదా అని నువ్వు అస్తమానూ ఆటలతోటే తిరక్క బుద్ధిగా చదువుకో తెలిసిందా?" అంది అమ్మ.

"అలాగే నాకో మిఠాయి ఉండ యివ్వవూ"?

"ఇంటికి వెళ్ళాక అమ్మమ్మ పెడుతుందిరా నీకు కావలసనన్ని" అన్నారు తాతగారు. బుట్టవిప్పి, మూడువుండలు బయటకు తీసి, తాతగారికి, మామయ్యకూ చెరొకటీ ఇచ్చి, నాకొకటి అందివ్వబోయింది.

బండిఅబ్బి పక్కనే కూర్చున్న నేను, పెట్టె ఎక్కి చెయ్యి క్రింద ఆనించి, వుండ అందుకోడానికి రెండో చెయ్యి చాచాను. ఏమిటో 'ఫళుక్కు'మంది.

"ఏమిట్రా అదీ, ఏదో పగిలిందీ"అన్నారు తాతగారు ఆత్రంగా. నేను చెయ్యి గభుక్కున తీసేశాను. ఉండ అమ్మవళ్లో పడింది. "అయ్యో, వెంకటేశ్వరుడి ఫోటో అద్దం పగిలిపోయింది. ఒరే, అంత చూసుకోరూ చెప్పూ!" అమ్మ మనసు చివుక్కుమంది. నేను బిక్కమొహం వేశాను. మామయ్య బండి ముందుకు వచ్చి నన్ను క్రిందకి దింపి నడవమన్నాడు. లోలోపల పొంగివచ్చే ఏడుపును దిగమ్రింగే ప్రయత్నంలో గట్టిగా పెదవులు కరుస్తున్నాను.

బస్సుస్టాండు చేరుకున్నాము. బండి అబ్బి సామానుదింపుతున్నాడు. అమ్మ మెల్లిగా బండిదిగింది. బండికింద వేలాడుతున్న మునిసిపల్ లైసెన్సు బిళ్లకు కొంగు తగులుకుని అడుగు మేర అమ్మ కట్టుకున్న ఆకాశపురంగు బండార్లంక కొత్త జరీచీర అంచు చిరిగిపోయింది. తాతయ్య మనసు అపస్వరం పలికింది.

అరగంట తర్వాత బయలుదేరే బస్సులో టిక్కట్లు దొరికాయి "ఒరేయ్, రేపులో తిప్ప బాగావుంటే బండి కట్టించు మర్చిపోక," అని జ్ఞప్తి చేశారు మామయ్యకు తాతగారు—మబ్బులు ముసురుకొని వస్తున్న ఆకాశంవైపు చూస్తూ.

బస్సు కదిలింది.

"వెళ్ళొస్తాం. ఉత్తరాలు రాస్తూండు ఒరే బుద్ధిగా చదువుకో—అన్నట్టు బండిలో పడిన ఉండ తీసుకున్నావా." తలపైకి పెట్టి అరిచింది అమ్మ. "వాడికి అమ్మమ్మ ఇస్తుందిలే." తాతయ్య గట్టిగా అరిచాడు. బస్సు మమ్మల్ని దాటిపోయింది. చిన్న చినుకులు రాలుతూంటే రోడ్డువార నున్న కాఫీ హోటలు అరుగుమీదికి దారితీశారు తాతగారు.

* * *

రాత్రి భోజనంఅయాక పెద్ద మంచం ఎక్కి బోర్లా పడుకుని అవాళ్టి సంఘటనలను గూర్చి ఆలోచిస్తున్నాను. వెంకటేశ్వరుల వారి ఫోటో అంటే అమ్మకు ఎంతో యిష్టం. చూసుకోకుండా అద్దం బ్రద్దలు కొట్టి, అమ్మ మనను కష్టపెట్టాను. నాకు దుఃఖం పొంగివచ్చింది.

"అదికాదే, ఎదురొచ్చిన సీత తిన్నగా యింటికి రాక నూరక్కని పలకరించడమూ, బండి ఎక్కబోతున్న నూరక్క పక్కింటావిడ పలకరించిందని—వెనక్కి తగ్గడమూ, నాకు ఏవీటో అపశకునంలా కనిపించాయి." అంటున్నారు తాతగారు భోజనం చేస్తూ.

"ఏమిటో మన పిచ్చిగాని మావయ్యా, ఇలాంటివాటివల్ల ఏమీ అశుభం జరగదు" తాతయ్యగార్ని వారించబోయింది అత్తయ్య.

"దానికెంతో ఇష్టమైన వెంకటేశ్వరుల వారి ఫోటోఅద్దం పగలడం, కట్టుకున్న కొత్తచీర చిరగడం, కారు బయలుదేర బోయేముందు వాన రావడం-ఇవన్నీ ..." అంటూ తగ్గిపోయి—

"ఒసేయ్ చూడూ. వాడు మంచంమీద పడుకుని ఏడుస్తున్నట్టున్నాడు. ఇలా తీసుకురా వాణ్ణి" అన్నాడు తాతగారు నా మూలుగు విని.

లేవనుగాక లేవనంటే నన్ను అలాగే వదిలేసి అమ్మమ్మ కళ్లనీళ్లు కక్కుకుంటూ వెళ్లిపోయింది.

ఇంట్లో ఎవరికీ ఏమీ తోచడంలేదు. అమ్మమ్మ ఫలహారం చేయనంటే బలవంతాన తినిపించారు.

* * *

మర్నాటి సాయంకాలానికి మామయ్య తిరిగి రానేవచ్చాడు. అంతా ఆత్రంగా చుట్టూమూగి ఏమేమో అడిగారు. అమ్మ

(28-వ పేజీ చూడండి)

# ★ అవిముక్తుడు ★

(23 వ పేజీ తరువాయి)

కన్నకొడుకుతో ఏమీ అనలేకపోయి, అచలనంగా వుండిపోయింది.

శ్రీనివాసరావు తనగదిలో మతిపోయిన వానిలా అయిపోయాడు.

అతనిమనసులో అనేక ఆలోచనలు సంఘర్షణ ప్రారంభించాయి.

తనునిజంగాస్వార్థపరుడేనా? లోకంలో యితరులకు అనేక ఉపకారాలు చేసే వ్యక్తులంతా స్వార్థపరులేనా? స్వార్థం లేకుండా ఎవరూఏపనులూ చేయనే చేయరా? నిజమా?

నేను యిన్నేళ్లు అనంతానికి చేసిన సహాయమంతా ఏమిటి? నేనేం ప్రతిఫలం కోరేను?

అయినా అనంతం—అమాయకుడూ, విధేయుడూ, మితభాషి అయిన అనంతం-నాపోషణలో నాయింట్లో ఏ వేదన అనుభవించేడు?

మరెందుకిలా వాపోతున్నాడిప్పుడు? నేను యీ అనంతానికి విద్యాదానం చేసి సంబరపడడం తప్పా? అనంతం జీవితాంతము నాకు వినమ్రుడు, అనుకూలుడు అయి వుండటంలో దోషం ఎందుకుంటుంది?

బి. ఏ చదివించి. వుద్యోగం వేయించి అభివృద్ధికి తెచ్చానే! ఇంకా మిగిలివున్న కాస్త సదుపాయమూ వివాహం కూడా జరిపించి అతణ్ని జీవితంలో కృతార్థుని చేయాలనుకుంటున్నా. ఇదేం తప్పు? నిజంగా స్వార్థపరుడ్నే అవుతే అంతా నన్నుగురించి మంచిగా ఎందుకు చెప్పుకుంటారు?"

శ్రీనివాసరావు మెదడులో చాలా ఆలోచనలు వచ్చాయి. తను ఎప్పుడూ స్వార్థపరుడు కాడని, ఉదారుడిననీ అతని నమ్మకం.

అంచేత తన్నుగురించి ఎట్టి సందేహము, అపోహ వుంచుకోక నిశ్చింతుడయ్యాడు.

అనంతం ఎలా వెళ్ళిపోతాడు? ఎక్కడికి వెళ్లిపోతాడు? ఎందుకు వెళ్లిపోతాడు? తన త్యాగాన్ని కాదని, తనమాటను కాలదన్నగలిగేవాడేనా అనంతం అనుకుంటూ నిద్రపోయాడు శ్రీనివాసరావు.

ఉదయం కాఫీ త్రాగిన తర్వాత అనంతాన్ని పిల్చాడు శ్రీనివాసరావు.

అనంతం ప్రయాణ సన్నాహంలో వున్నాడు. శ్రీనివాసరావు లేచినుంచీ అది పసికట్టే వున్నాడు.

అనంతం రాగానే శ్రీనివాసరావు తన సహజ ఔదార్యాన్ని చూపుతూ అన్నాడు.

"ఇదుగో అమ్మ చెప్పిన విషయం నువ్వు ఆలోచించే వుంటావ్. నీ శ్రేయస్సుకోరుతూ యిప్పటివరకు చెస్తూవచ్చిన అన్నిటివలె ఈ సహాయాన్ని కూడా నీవు అందుకోక తప్పదు. నీకేం నేను ముప్పు తీసుకురాలేదు. పోనీ నీ సహచరుల్ని సంప్రదించు. యుక్తవయస్కుడవు— అమ్మ నీ వివాహంగురించి ఉబలాటపడుతూన్నది. నాచేతులమీదనే యీ శుభకార్యము జరపాలని నా కోరిక. ఇవాళ మంచిది. పిల్లను చూడడానికి వాళ్ళూరు వెళ్లాలి. ఇప్పుడే తొమ్మిదింటి బస్సులో బయల్దేరుదాం."

అనంతం ఎన్నో అనేయాలని మహా ఆత్రుతపడ్డాడు. కానీ ఒక్కమాటా అనలేకపోయాడు.

శ్రీనివాసరావుతో ప్రయాణమయ్యాడు.

* * *

అనంతం భార్యతోనూ. తల్లితోనూ శ్రీనివాసరావుగారి ఔదార్యంలో, వారింట ఒకగదీ-వంటిల్లు వాడుకుంటూ జీవితం సాగిస్తున్నాడు.

అనంతం శ్రీనివాసరావుగారింట ప్రవేశించిన ప్రారంభంలో అలవాటుపడిన కార్యకలాపాలలో వేటినీ విస్మరించక విధ్యుక్తంగా నిర్వర్తించుకుపోతున్నాడు.

శ్రీనివాసరావు తాను అనంతం సమస్తాభివృద్ధికి కారకుడినయానని పొంగుతు లావెక్కసాగేడు.

అనంతం శ్రీనివాసరావుగారి సానుభూతి, సహకారాల్లో శల్యావశిష్టుడు కాసాగేడు.

శ్రీనివాసరావు ఉదారగుణం పలువురు మెచ్చుకుంటూ, "అనంతం ఎంత అదృష్టవంతుడు!" అనుకుంటారు. ★



# అద్దం పగిలింది

(26వ. పేజీ తరువాయి)

ఖులాసాగా వుందట. వంటా, ఇతరపనులూ చేయడానికి పనిమనుషుల్ని పెట్టుకున్నారట. అమ్మమ్మకి ఈ కబురు వినేసరికి కొండంతభారం తీసినట్టయింది.

* * *

నెల తిరక్కుండానే నాన్నకి మళ్లా కబురు మామయ్యకొడుక్కి పుట్టువెంట్రుకలు తీస్తారట. అమ్మ, నాన్న ఓ నాటి సాయంకాలం కనుచీకటిపడేవేళ గుమ్మంలో బండిదిగారు. నేను అమాంతం వెళ్లి అమ్మను కావలించుకున్నాను. ఇంటిల్లిపాదికీ అమ్మ ఏమిటో ఎక్కడనుంచో దిగివచ్చినట్టనిపించింది.

* * *

నాకుమాత్రం ఇప్పటికీ అద్దం పగలడం చూసినా, చప్పుడువిన్నా, ఆ నాటి సంఘటన జ్ఞాపకంవచ్చి, 'అప్పుడైతే అమ్మ తిరిగివచ్చింది; ఇప్పుడెక్కడనుంచి వస్తుంది,' అనిపించి మనసును కలచివేస్తుంది. ★

# దేశదేశాల బొమ్మలు



"శంకర్స్ వీక్లీ" బొమ్మల ప్రదర్శనంలోని ఒక అందాలబొమ్మ



కిమోనో ధరించిన జాపనీస్ గెయ్‌షా బొమ్మ

నవ్వుతున్న బొమ్మలు, నవ్వించే బొమ్మలు, ఆడుతున్న బొమ్మలు, పాడుతున్న బొమ్మలు, నుంచున్నవి, కూర్చున్నవి, పడుకున్నవి, పడిపోయినవి, కోపంగా చూసేవి, కొంటెగా చూసేవి, కదలకుండానే కదుల్తున్నట్లు కనిపించేవి, కమ్యూనిస్టు బొమ్మలనీ కాపిటలిస్టుబొమ్మలనీ తేడాలేనివి, 50 దేశాల్లో గడిచిన అయిదేళ్ళలో "శంకర్స్ వీక్లీ" సంపాదకుడు సంపాదించిన మూడు వేలబొమ్మలు ఈ మధ్య మద్రాసు, రాజాజీహాలులో అనేకులను ఆహ్లాదపరిచాయి. పిల్లలు ఏ దేశపువారైనా పిల్లలే కనుక, పిల్లల బొమ్మలుకూడా ఏ దేశంలో తయారైనా ఒకరకంగానే ఉంటాయి. దుస్తులు తేడా, మొహాలు తేడా, అంతే. రష్యా బొమ్మలు బొద్దుగా, అమెరికా బొమ్మలు ముద్దుగా ఉన్నాయి. అన్నిట్లోకీ జపాను బొమ్మలు చాలా ఆకర్షణీయంగా ఉన్నాయి. భారతదేశపు బొమ్మల్లోకల్లా బెంగాల్ బొమ్మలు, ఆంధ్రదేశపు కొండపల్లి బొమ్మలు బావున్నాయి.



అరేబియన్ నైట్స్ కథలో ఒక దృశ్యానికి చెందిన బొమ్మలు

ప్రదర్శనంలో అడుగుపెడితే పువ్వుల్తో పిట్టల్తో, వెన్నెల్తో కలకలలాడుతున్న మంత్రనగరిలో అడుగుపెట్టినట్లు, శ్లేషారాలు, అపశ్రుతులులేని బాలల ఐక్యరాజ్యసమితిలోకి అడుగుపెట్టినట్లు అనిపిస్తుంది. బొమ్మల సేకరణలో శ్రీ శంకర్ పగల అభిరుచికి ఈ ప్రదర్శనం చక్కని నిదర్శనం. ★



# ఆంధ్ర మహాభారతము

## ఆదిపర్వము - షష్ఠాశ్వాసము

ఆ. సతి విముక్త యయినఁ బతికిఁ బునర్దార,సంగ్రహంబు సేత శాస్త్రమతము
పతి విముక్తుఁ డయిన సతి కన్యపురుషసం,గ్రహము సేత లోక గర్హితంబు.

వ కావున నేను భవద్విహీననయి యొక్కనిమిషంబేనియు జీవింపనేర నేర్చితినేనియు నిక్కుమారుల రక్షింప నేర నెట్లనిన శూద్రులు వేదశ్రుతిం బ్రార్థించునట్లు కులాచారసదృశులు గానివా రిక్కన్యం బ్రార్థించినం దత్ప్రతీకారంబు సేయను నిక్కుమారునందు గుణాధానంబుసేయను నాకొలందిగాదు మత్పరోక్షంబునం బునర్దారపరిగ్రహంబుసేసి గృహస్థధర్మంబును నగ్నిహోత్రంబునుం బుత్త్రులను రక్షించునది యనుచు మరణవ్యవసాయంబునందున్న తల్లిని దండ్రిని జూచి కూఁతు రిట్లనియె.

ఆ. ఒలసి యెంతకాల ముండిన నేను మీ,దానఁ గాన యొరుల ధనమ నన్ను
నెన్నఁడయిన నొరుల కిచ్చుచో నసురకు, భోజనముగ నిచ్చి పుచ్చుఁ డిపుడ.
తే. తండ్రి చేయు తిలోదక దానవిధులు, పొందు పరలోకగతమైన పుత్త్రియందుఁ
బుత్త్రిచేసినవిధులు దత్పురుషుఁ గాని, తల్లిదండ్రులఁ బొందవు ధర్మయుక్తి.

వ. మీకు నాయం దయ్యెడు దౌహిత్రలాభంబునకంటె మీరిద్దఱు జీవించిన ననేక పుత్త్రపౌత్త్రలాభంబగు దానంజేసి కులంబు నిలుచుంగావునఁ నన్నుఁబుచ్చుండనినఁ గూఁతుం గౌఁగిలించుకొని యేడ్చుచున్న వారలకన్నీళ్లు దుడుచుచు.

తే. బాలుఁ డొక్కరుండు కొండొక కోల సేతఁ
బట్టికొని యేను రక్కసు గిట్టి చంపి
చులుకఁగా వత్తు మీ రేడ్వవలవ దనుచు
గలయ నూరార్చెఁ దనతొక్కుఁ బలుకు లొప్ప.

వ. వానియవ్యక్త వచనంబులు విని యందఱు నేడ్పుడిగి రయ్యవసరంబునం గుంతీదేవి వారల డాయం బోయి.

క. ఇది యేమి తెఱఁగు దీనికి, మొదలెయ్యది నాకుఁ దెల్లముగఁ జెప్పుఁడు తీ
ర్చెద నని విగతాసులఁ దన,మృదువచనప్రశ్న మను నమృతమున నెత్తెన్.

వ. ఇట్లడిగినఁ గుంతీదేవికి నవ్విప్రుం డిట్లనియె.

సీ. ఏ నేమి సెప్పుదు దీని నెవ్వరికిని, మానుషంబునఁ దీరఁ గానిదాని
నయినను జెప్పెదఁ బ్రియహితవచన యీ, ప్రోలికి నామడనేల నల్ల
యమునానదీగహ్వరమున బకుం డను,రక్కసుం డుండు వాఁ డక్కజముగ
నిందులకాఁపుల నందఱఁ దొల్లి యి,ల్వరుస గ్రమింగుచు నున్నఁ బరమసాధు

ఆ. లగు ధరామరేంద్రు లగణితజపహోమ,దానవిధులఁ జేసి వానివలనఁ
గ్రమము వడసి యొక్క సమయంబుఁ జేసిరి, యొనర దాని తెఱఁగు వినుము తల్లి.

వ. నిత్యంబు నిలువరున నొక్కమానిసి రెండెనుపోతులం బూనిన శకటంబున నపరిమిత భక్ష్యపిశిత మిశ్రాన్నంబు నించుకొనిపోయిన దానిని వానిని నయ్యెనుపోతులను భక్షించుచు.

ఆ. మనుజభక్షుఁ డిదియ తనకు నప్పనముగా, నొరులవలని బాధ నొరయకుండ
దీనిఁ గాచుచుండు నీనాఁటిరాజును, దలఁపఁ డసురనోర్వ బలిమి లేమి.

ఉ. పోలఁగ ధర్మశీలుఁ డయి భూరిబలాధికుఁడైన ధారుణీ
పాలకురక్ష ముక్క వడసి భార్యను బుత్త్రిల నర్థయుక్తితో
నోలిన మేలుగాఁ బడసి యాళ్లను నున్నది యట్లు గానినాఁ
డేల గృహస్థవృత్తి సుఖ మేఁగి వనంబున నుక్కి కష్టమే.

క. అరి యని విప్రులచేతను, ధరణీశులు రాకయును మొదలుగాఁ గొన రె
వ్వారు నిప్పాపుఁడు మానిసి, నరిగొనియెడు భక్షణార్థియై విప్రులచేన్.

వ. పెద్దికాలంబునకు నీయిలువరున నేఁడు మాకు వచ్చిన నిచ్చిఋతవాని నారాక్షసునకు భక్ష్యంబుఁగాఁ బుచ్చనోప నేన పోయెదనని దుఃఖించి పలికిన బ్రాహ్మణునకుఁ గుంతి యిట్లనియె నయ్యా దీనికి సంతాపింపవలవ దీయాపద దలఁగు నట్టి యుపాయంబు గంటి నీకుం గొడు కొక్కరుండ వాఁడును గడుబాలుండు బలిగొనిపోవ నర్హుండు గాడు నా కేవురు గొడుకులు గలరు వారలలో నొక్కరుం డారక్కసునకు భవదర్థంబుగా బలి గొనిపోయెడు ననిన దాని విన నోడి బ్రాహ్మణుండు చెవులుమూసికొని యిట్లనియె.

మధ్యాక్కర. అతిథి యై వచ్చిన బ్రాహ్మణుక జీవి తార్థి నై నాకు
హితముగా రక్కసువాతఁ ద్రోవ నే నెట్లొడంబడుదు
మతి నవమానింపఁ గా దనిన విప్రు మరణంబు దలఁచు
టతిపాతకము పాతకములలోఁ బ్రహ్మ హత్యయుం బెద్ద.

క. ధృతిసెడి వేఁడెడువానిని, నతిథిని నభ్యాగతుని భయస్థుని శరణా
గతుఁ జంపఁగ నొడఁబడు దు,ర్మతి కిహముం బరముఁ గలదె మదిఁ బరికింపన్.

వ. మఱి యాత్మఘాతంబు మహాపాతకంబు దాని కెట్లొడంబడితంచేని యది యనతిక్రమణీయం బయి యొరులచేతం జేయంబడుటంజేసి నాకుం బాతకంబు లేదు దానిం జేసినవానికి మహాపాతకం బగుంగావున బ్రాహ్మణహింస కే నొడంబడ నోప ననినఁ గుంతి యిట్లనియె

క. ఏనును దీనిన తలఁచి మ,హీనుత విప్రవధ యెద స హింపక మఱి నా
సూను సమర్పించితి మ,త్సూను వధింపంగ రక్క సునకుఁ వశంబే.

క. ఖలు నసుర నోర్వ నోపెడు,బలయుతుఁగా నెఱిఁగి కొడుకుఁ బంచితిఁ గా కి
మ్ముల శతపుత్త్రిలు గలధ,న్యుల కైన ననిష్టుఁ డగు తనూజుఁడు గలఁడే.

వ. ఈతనిచేతన తొల్లియుఁ బెక్కండ్రసురలు నిహతులయిరి వీఁడు మహాబలవంతుఁడు మంత్రసిద్ధుండని భీముం బిలిచి యీబ్రాహ్మణునాపదం దలఁగి నాకు మనఃప్రియంబు సేయు మనిన వల్లె యని భీముం డారక్కసుఁ జంపంబూనె బ్రాహ్మణుండును దనబంధువర్గంబుతో సంతసిల్లె నంత ధర్మార్జున నకులసహదేవులు వచ్చి పరమహర్ష పరిపూర్ణ హృదయుండై యున్నపవనతనయునాకారం బుపలక్షించి విస్మితు లగుచుండ ధర్మతనయుం డల్లన తల్లికి నిట్లనియె.

చ. నరనుతకీర్తి యియ్యనిల నందనుఁ డెవ్వరితోడ నేని భీ
కరసమరంబు సేయ నమకట్టినయట్లు మహానురాగని
ర్భరమున నున్న వాఁ డితని భావము సూడఁగ వేఱు వీని ను
స్థిరబలు మీరు పంచితిరొ చెచ్చెరఁ దాన యుపక్రమించెనో.

వ. అని యడిగిన ధర్మతనయునకుఁ గుంతీదేవి యీ యేకచక్రంబున బ్రాహ్మణుల బకాసురుండు బాధింపుటయుఁ దను విడిసినయింటి బ్రాహ్మణున కైన యాపదయు దానిందీర్పం బవనతనయు బ్రాహ్మణార్థంబుగాఁ దనసమర్పించుటయుం జెప్పిన విని ధర్మజుండు దుఃఖించి యిది యేమిసాహసంబు సేసితి రొడ్లకొడుకులకుంగాఁ దమకొడుకుల విడుచు దుర్బుద్ధులునుం గలరె యిది లోకాచారవిరుద్ధంబు మఱి భీమసేనుఁడు మీకు విడువందగియెడికొడుకే.

# సీతా కల్యాణం

ఫెళ్లున విల్లు విరిగింది.
మిథిలిగుండె ఝల్లుమంది.
సిరిహరిని వరించింది.

* * *

పర్జన్య గర్జనవంటి ఆ ఫెళఫెళార్భటికి సమస్తచేతనా ప్రపంచమూ సంభ్రమ చకితమై సమ్మోహితమైపోయింది. భూధరాలు బ్రద్దలయే వేళవలె భువనభవనం దద్దరిల్లిపోయింది.

ఆ ఘోర ధనుర్భంగ ధ్వని ధర్మాత్ములకు అభయదమై, అధర్ములకు భయదమై మనోహరంగానూ, ప్రాణహరంగానూ కూడా వినిపించింది. దశదిశాంతాలనూ సోకి ప్రతిధ్వనించింది.

దూరాన, హిమవత్పర్వతసీమలో తపోనిష్ఠలో ఉన్న భార్గవరాముడికి అది హెచ్చరిక అయి వినిపించింది. ధర్మప్రతిష్ఠాపనల అనర్హక్షాత్ర సంహారకుడు భృగుకులతిలకుడి భూమికను క్షాత్రధ సంరక్షకుడు రఘుకుల తిలకుడు స్వీకరించే మహత్తర సన్నివేశానికి నేపథ్యగీతమై భాసించింది. భార్గవుడు ఆధ్వనివిని ముహూర్తకాలంపాటు భ్రుకుటిముడిచాడు సాలోచనగా.

మిథిలాధిపుడి సభలో నే దగ్గరగా ఉన్న బ్రహ్మర్షి విశ్వామిత్రుడికి అది విజయభేరిగా వినిపించింది. 'ప్రకృతయా నా కార్య... నానికి నాంది ప్రస్తావన చేశావా ప్రభూ!' అనుకున్నా...

'దశకంఠ సంహార కాండలో పతాక సన్నివేశం ఆ... మైంది' అనుకుని ఆనందించారు దేవతలు.



"మా అన్న!" అనుకున్నాడు లక్ష్మణుడు సగర్వంగా.

"నా ప్రతిజ్ఞ చెల్లింది. భగవంతుడే నాకు అల్లుడౌతున్నాడు" అనుకున్నాడు రాజర్షి జనకుడు తృప్తిగా, సగర్వంగా.

* * *

నీలమేఘ శ్యాముడు రాముడు, తాను విరచిన విల్లును సగౌరవంగా వేదికమీద వుంచి, గురువుకునమస్కరించినిలచాడు.

'కల్యాణమస్తు. (లోక) కల్యాణమస్తు' అన్నాడు గురువర్యుడు విశ్వామిత్రర్షి.

అన్న బలాన్ని తాసెరిగినా, కన్నులారా మనోహరహరధనుర్భంగ దృశ్యాన్ని చూచి ముగ్ధుడు కాకుండావుండలేక పోయాడులక్ష్మణుడు. విల్లును చేపట్టబోవడంలో సొగసు, నిలబెట్టి దక్షిణ పాదాంగుష్ఠానికి దన్ను పెట్టి వంచి. త్రుటిలో అల్లెతాడు ఎక్కించడంలో ఒడుపు, సౌలభ్యం, బాణం ఆరోపించడంలో మెలకువ నారిని ఆకర్ణాంతం లాగబోవడంలో చూపిన అంగవిన్యాసం సమ్మోహనకరంగా తోచాయి. అవలీలా మానుష విగ్రహుడుగా గోచరించాడు— 'ఈయన మా అన్నగారు' అనుకున్నాడు లక్ష్మణుడు.

శివ ధనుర్భంగ గర్జనను మించిన జయఘోషతో లక్ష్మణుడు ప్రకృతంలోకి వచ్చాడు. రఘుకులానికీ, రాముడికీ, మిథిలాపతికీ, మైథిలికీ జయాలనూ శుభాలనూ ఆకాంక్షిస్తూ వారిని కీర్తిస్తూ అప్పుడే తెప్పరిల్లిన సభికులు చేస్తున్న జయధ్వానాలతో హర్షధ్వానాలతో దిక్కులు పిక్కటిలుతున్నాయి. శివుడివిల్లు విరచిన ఈ నల్లటివాడి ఘనతను వందిమాగధులు ఉత్సాహంగా అనర్గళంగా గానం చేస్తున్నారు.. లక్ష్మణుడు సగర్వంగా సభనంతా కలయజూశాడు...

ఎదుట జనకరాజు ఉత్సాహంతో ఉప్పొంగిపోతూ 'రామా! ఇటు రావాయనా' అన్నాడు. తాను ఒక మెట్టు దిగుతూ.

విశ్వామిత్ర సమేతుడై రఘురాముడు ఒక అడుగు ముందుకు వేసేవరకూ మరోసారి హర్షధ్వానాలు చెలరేగాయి. జరగబోతున్నదేమిటో అందరికీ తెలుసు. జరగబోతున్నది అందరికీ ఆనందకరమైనదనికూడాఅందరికీ తెలుసు. మనసులో పదేపదే అనుకొంటున్న ఆమంచి మాట, అనవలసినమనిషి నోట రాగా చెవులారా వినాలనిఅంతా చంద్రుడికోసం చాతక పక్షులలా ఎదురు చూస్తున్నారు.



# ★ సీతా కల్యాణం ★

జనకమహర్షి అంజలి ఘటించాడు. 'పూజ్య విశ్వామిత్రమహర్షీ! మీ శిష్యుడు, నా అనుంగుమిత్రుని పుత్రుడు అయిన ఈ దశరథ రాముని పరాక్రమాన్ని కన్నులారా చూచి ఆనందించాను. అసంభవము అసాధ్యము అనుకున్న ఈ రుద్రధనుర్భంగం మేము ఊహించనంత అద్భుతంగా జరిగింది. నాకు ఏహిః ప్రాణమైన సీతను వీర్యశుల్క ప్రతిఫలంగా ఇవ్వ సంకల్పించాను. ఇప్పుడు ఈ విధంగా దాశరథిని భర్తగా పొందుతున్న మా జానకి, విదేహ వంశానికే కీర్తిప్రతిష్ఠలు సమకూర్చుతున్నది. ఓ మహర్షీ! ఈ పురుషోత్తముడు రామచంద్రుడికి నేను నా కుమార్తె, సుగుణాలపేటి సీతావధూటిని కన్యాదానం చేయ సంకల్పించాను" అంటూ జానకిని దగ్గరకు తీసుకుని జలకలశం అందుకోబోయాడు జనకమహారాజు.

హర్షధ్వానాలతో మంగళగానాలతో సభ మారుమ్రోగింది.

రామచంద్రుడు ఒక్కమారు విశ్వామిత్ర మహర్షి వంక చూచి వినయంగా తలవంచుకొన్నాడు.

"మా తండ్రిగారి అనుమతిలేనిదే పాణిగ్రహణం సంభావ్యం కాదు గదా" అన్నాయి ఆ రాముడి చూపులు.

"ఔనౌను. ఈ ఆనందోద్వేగ సమయంలో కూడా ఎంతటి స్థిమితమయ్యా నీకు" అంది ముహూర్తకాలం పాటు సౌమిత్ర వదనంలో తొంగిచూచిన గౌరవ భావరేఖ.

'అది న్యాయ్యమే. అవశ్యకరణీయమే' అని ఆమోదించింది గురు [illegible]

పరేంగితజ్ఞుల ప్రభువు, జనక రాజర్షికి రామహృదయం అవగతమైంది జనకసుత సీత కూడా ఈ ధర్మాన్ని గ్రహించిందని, ఆమె చెంపలకెంపుల వెలుగులోనే అధరాగ్రాన లీలగా గోచరించి మాయమైన మందహాస రేఖను చూచి రాముడు అవలీలగా గ్రహించాడు.

సభలో హర్షధ్వానాలు స్థిమితపడేవరకు ఈ కర్తవ్య నిదాన, నిర్ణయాలు జరిగిపోయాయి.

* * *

"—కావున ఓ బ్రహ్మజ్ఞానసంపన్నుడా! ఈ శుభవర్తమానాన్ని దశరథమహారాజుకు అందజేసి వారిని ఆహ్వానించడానికై నా మంత్రులను అయోధ్యకు పంప సంకల్పించాను. ఇందుకు తాము అనుమతించవలెను" అన్నాడు జనకమహారాజు.

* * *

జనకనృపతి పురోహితుడు శతానందుడు దారి చూపగా విశ్వామిత్రుడు, రామచంద్రుడు, ఆవెనుక సౌమిత్రి విడిదికి బయలుదేరారు.

ఈసారి దారి వేరు.

తాము మిథిలానగరం వచ్చిన వేళ జనకమహారాజు యాగశాలలో వున్నాడు. ఆహూతులతో నగరం కోలాహలంగా ఉంది. రథాలతో వీధులన్నీ నిండివున్నాయి.

"మహర్షీ మనకు ప్రశాంతమైన స్థలంలో నివాసాన్ని చూడండి" అని రాముడు కోరాడు.

విశ్వామిత్రుడు చూసిన బసలో విడిది చేసిన వేళ, తాము శివ ధనుస్సును చూడవచ్చిన, మరిద్దరు రాకుమారులు.

"ఆ నల్లనివాడే విల్లువిరచిన రాముడట." అంటున్నారు ఎవరో...

"వాళ్ళు మొత్తం నలుగురన్నదమ్ములు... రాముడివెంట ఉన్న తేజోవంతుడే—"

"వందిమాగదుల స్తుతి పాఠాలు ఇవాళ శ్రుతి మధురంగా, అతి సహజంగా వినిపించాయి సుమీ"

"దాదాపు అతిశయోక్తులు దొరకక అవస్థపడ్డారట. ఎంత చెప్పినా వాళ్ళకే తృప్తి లేదనుకున్నారు ఇందాక."

"విశ్వామిత్ర మహర్షి శిష్యుని వెంటబెట్టుకు వచ్చాడు. ధనుర్వేదం అంతా ఉపదేశించాడట."

"అయ్యా వందిగారూ—ఇందాక మీరు గానం చేసినపుడు రాముడి పేరుతో ప్రాస వేసిన మిగతా మూడు మాటలూ ఏమిటండీ—"

"అలా వెళ్ళవయ్యా. వెళ్ళి ఆయన ఎదట నిలబడు. మాటలు వాటంతట అవే వస్తాయి. ధారాళమైన కవితాశక్తి అబ్బుతుంది.. "

"శతానందులవారి తల్లి అహల్యాదేవికి శాప విముక్తి ప్రసాదించిన రామ పాదాలు అవే. నమస్కరించు నాయనా! నమస్కరించు..."

ఈమాట విన్నపుడు రామపాద మహిమ వల్ల సంభవించిన ఒక రమణీయ సన్నివేశం లక్ష్మణుడి మనసులో మెదిలింది.

అహల్యా గౌతమ మహర్షులవద్ద సెలవు తీసుకొని, మిథిలకు ప్రయాణం కొనసాగిస్తూ ఉండగా గంగీనదీ తీరాన తామంతా విశ్రమించారు. మరునాడు ఉదయం నదిని దాటడానికి పడవ ఎక్కబోయేవేళ ఈ రామ పాదమే పేచీ తెచ్చిపెట్టింది. పడవవాడు ఒక్క నమస్కారం పెట్టి వెళ్ళిపోబోయాడు.

"ఏమయ్యా గంగ దాటించవా" అన్నారు విశ్వామిత్రుల వారు.

స్వామీ, మీవెంట ఉన్న ఆ నల్లనాయన పాదధూళి సోకితే రాళ్లు ఆడువాళ్లుగా మారుతున్నట్లు విన్నాను బాబూ! నాకున్నదల్లా ఒక్కటే పడవ. ఇప్పుడాయన కాలు మోపగానే అది ఇంకో ఆడదిగా మారిపోతే నాగతేం కాను?—నన్ను దయచూడండి" అన్నాడా పడవవాడు గడగడ వణకుతూ.

అందరికీ నవ్వు వచ్చింది. "భయపడకయ్యా! అలాటిదేమీ జరగదులే" అన్నాడు అన్నగారు నెమ్మదిగా నవ్వుతూ....

"అదుగో తనలో తను నవ్వుకుంటున్నాడే.. అందగాడు. ఆయనే లక్ష్మణుడు. సుమిత్రాదేవి కుమారుడు."

"అపర విష్ణువులా ఉన్న ఆ చిన్నవాడికి ఊర్మిళాదేవినిచ్చి పెళ్లి చేస్తేనో—"

జనవాణి విని ఆనందిస్తున్న సౌమిత్రి ఉలికిపడి, చుట్టూచూసితలవంచుకుని అడుగు చురుకుగా వేసి అన్నకు దగ్గరగా వెళ్ళాడు.

అన్ని కక్ష్యలూ దాటి, సింహద్వారం సమీపించే సరికి రథం ఆయత్తం అయిఉంది. అక్కడ రామదర్శనం కోసం వేచి ఉన్న వేలాది జనులు జయధ్వానాలు చేశారు.

రాముడు అందరికీ నమస్కరించి రథం ఎక్కాడు.

(54వ పేజీ చూడండి)

# కలదానందం

నాళ్ళచెర్వు అన్నాజీరావు

కలదానందం ! కలదానందం !
కృష్ణుని మురళీగానములో.

వెన్నెలతేనెల దొన్నెలలో,
కనుసన్నల మెలగెడు కన్నెలలో,
మున్నెన్నడు నెరుగని మురిపెములో,
మునివంద్యుని ముఖపద్మములో

కలదానందం ! కలదానందం !
కృష్ణుని మురళీగానములో.

శిఖలోనుంచిన పింఛములో
శిఖ జుట్టిన పరిమళపుష్పములో
ముఖపద్మపు కస్తురి తిలకములో
సుఖమగు సుందర దృశ్యములో

కలదానందం కలదానందం
కృష్ణుని మురళీగానములో.

కంఠసీమ గల హారములో,
కట్టిన పచ్చని పుట్టములో,
మొల బంగరు ఒడ్డాణములో,
కాళ్ళగజ్జియల నాదములో,

కలదానందం కలదానందం !
కృష్ణుని మురళీగానములో.

మూడువంపులుగ నిలుచుటలో,
మురళిని కేలను దాల్చుటలో,
మువ్వల రవళులు కలియుటలో,
వేణుమనోహరగానములో

కలదానందం ! కలదానందం !
కృష్ణుని మురళీగానములో.

బృందావన ప్రకృతిదృశ్యములో
గోబృందము పచ్చిక మేయుటలో
గోపాంగనబృందము మధ్యములో
గోపాలుని రాసక్రీడలలో

కలదానందం ! కలదానందం !
కృష్ణుని మురళీగానములో.



అభిసారిక

చిత్రం : బి. ఎమ్. కొండాచారి-బళ్ళారి

# నక్షత్ర ఫలితాలు

| 22-4-59 మొదలు 28-4-59 వరకు |

## గ్రహ స్థితి.

| బు కే | ర | శు | కు |
|---|---|---|---|
| | కన్య, తుల, వృశ్చిము, ధనస్సులలో చంద్రుడు | | |
| | | | |
| శ | గు | | రా |

### *అశ్విని [చూ, చే, చో, లా]*

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ. రాబడి తక్కువ. గృహావసరములు తీరక కలతలు. ఆరోగ్యము చెడుచున్న సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందడమే కాకుండా గ్రహరాజైన రవికి శాంతి చేయించుట మేలు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. 24, 25, 26 పితృవర్గ సహాయము, కార్యలాభము, ప్రయాణము 27 రాజకీయవాదులకు ఆందోళన, అధిక ఖర్చులు. 28 అనారోగ్యము.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము మీకు మొదట్లో నిరాశగా వున్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము. పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు ఏమంత బాగుండదు. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువుసాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగములున్నా మిత్రసహాయము, కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము, విచిత్రవస్తుసంపాదనవంటి శుభ యోగము కూడా వుంటాయి.

### * కృత్తిక [అ, ఈ, ఊ, ఏ] *

ఈ వారము మీకు మిశ్రమ యోగము. కార్యాచరణలో ఆటంకములు కలుగుతాయి. మీ బుద్ధి బలము నుపయోగించి ప్రయత్నించినా కార్యసిద్ధి వుండదు. చేతికి వచ్చేడబ్బు అవసరములకు సరిపోక ఇబ్బందిచే అశాంతిగా వుంటుంది. దూరమందున్న ఆత్మీయులకు అనారోగ్యముగా వుందని తెలిసి వ్యథపడతారు. అయిననూ దైవానుగ్రహముచే అన్నీ సరిపడతాయనే మనోధైర్యముతో వుంటారు. ఉద్యోగస్తులకు అస్థిమితము. వర్తకులకు ఆందోళన. నిలకడలేని స్థితి, ప్రయాణము, 25, 26 నష్టద్రవ్యప్రాప్తి, పుణ్యక్షేత్ర సంచారము దేవతాదర్శనము వింతలను చూచుట 27 ఆరోగ్యచింత.

### * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈవారము అనుకున్నట్టుగా డబ్బు చేతికి రాకపోవుటచేతను, అధిక ఖర్చులచేతను అశాంతి కలుగుతుంది. కోర్టువ్యవహారాలు కొంతవరకు అనుకూలిస్తవి ఉద్యోగస్తులకు అధికారుల తొందరలు. వర్తకులకు

## బి. నరసింగరావు

అశాంతి. భార్యకు ఆరోగ్యము బాగుండదు. వ్యవహారముల పరిష్కారములో దుష్టస్త్రీలతో వివాదము. విద్యార్థులకు చదువుపై అనాసక్తి. 25, 26 ధనలాభము, 27 కార్య భారము త్రిప్పట. కార్యసిద్ధి. 28 వివాదములు, భార్య అనారోగ్యము.

### * మృగశిర [వే, వో, కా, కి] *

తలపెట్టిన పనులు మీదవేసుకొని, కార్యసాధన అవసప్పటికి నిరుత్సాహపడక పట్టుదలతో ప్రయత్నించి తుదకు ఫలమును పొందుతారు. సోదరసహాయము కొంత అనుకూలత కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు అధికారుల చురుకుమాటలచే మనోవ్యథ కలుగుతుంది. అవసరాలు తీరనందున ఇంట్లో అశాంతి, ప్రమాదములవల్ల గాయములు కలుగవచ్చును. రసాయినిక పదార్థములు, ఎరువులు వ్యాపారస్తులకు, గనుల యజమానులకు లాభము. 24,25 కార్యభారము, ఆటంకములు 26, 27 సోదరసహాయము, కార్యలాభము. 28 ప్రమాద సూచన.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈవారము మీకు యోగకాలము, బంధుసహాయము, అధికారుల సహాయము కలుగుటచేతను ఆటంకములను, గడిచి కార్యలాభము పొందుతారు. ఆదాయము వృద్ధిఅగును. కవులు నూతన రచనలు చేస్తారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషిస్తారు. విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలు కాలము.

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారము మీకు మంచి భాగ్యయోగ్యము. అనుకున్న డబ్బు చేతికివస్తుంది. ఇబ్బందులు తీరుతాయి. దావాలలో గెలుపు పొందుతారు. పిల్లల బాగుకొరకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయస్థాన ఉద్యోగస్తులకు, న్యాయవాదులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుకాలము.

### * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈ వారము మీకు యోగదాయకము ధనయోగం వుంటుంది. సంగీతసభలు కవితాగోష్టి వంటి వినోదాలలోపాల్గొని మృష్టాన్న భోజనము వెండిపాత్రలలో చేస్తారు. శుభకార్యాలలో పాల్గొంటారు. నూలు, బట్టలు, బియ్యము- వెండివర్తకులకు లాభము. విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా వుంటుంది.

### * ఆశ్రేష [డీ, డూ, డే, డో] *

ఈవారము యోగదాయకము వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభకరముగా ముగుస్తవి. శుభపుణ్యకార్యాలలో పాల్గొంటారు. నూతన గృహనిర్మాణమునకు ప్రయత్నిస్తారు. ఉద్యోగస్తుల హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో ఎక్కువ లాభము. వారమంతా శుభయోగములతో కూడివున్నా కుటుంబ కలహముచే ఆందోళన కలుగుతుంది. వారమంతా కుటుంబములో మిత్రులతో విందు వినోదము.

### * మఖ [మా, మీ, మూ, మే.] *

ఈ వారము రాబడి తక్కువ. కార్యభారం ఎక్కువ. గృహావసరములు తీరక స్పర్థలు వస్తవి. అనారోగ్య సూచనలు కనపడగానే ఔషధచికిత్స పొందడము రవికి శాంతిచేయడం మంచిది. వుద్యోగస్తులకు క్రొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు, వారమంతా భయాందోళనలతో కూడివున్నా పితృవర్గమునుండి సహాయము. కార్యలాభము కలుగుతవి.


కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను ఉతికింది
—అట్లు చేసినట్టిది దాని అధిక నురగ
చిన్ని చేతులకు పెద్ద కృషి: అంత పెద్ద బట్టల దొంతరను, దుప్పట్లు, తువ్వాళ్లు—రాధ, సుధ, వాటన్నిటినీ ఇస్త్రీ చేయుచూ అమ్మకు సాయపడుచున్నారు.
ఎన్నో బట్టలు—అయినా అమ్మ వాటిని ఎంతో కొద్ది సబ్బుతోనే ఉతికింది. సహజంగా సన్‌లైట్‌తో. అది బాదకుండానే మురికినంతయు తొలగించివేస్తుంది! మీ బట్టలుతుక్కొనుటకు సన్‌లైట్ సబ్బును వాడండి!
SUNLIGHT SOAP
సన్‌లైట్ సబ్బు బట్టలను తెల్లగాను కాంతిగాను ఉతుకును.
S. 263-X52 TL
హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి

 

# నక్షత్రఫలితాలు



### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### (మో, టా, టీ, టూ)

ఈ వారము మొదట్లో నిరాశగావున్నా మిత్రసహాయమువల్ల ఆందోళన తీరుతుంది. యింట్లోవున్న వారి ఆరోగ్యమువల్ల అశాంతి కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. వర్తకులకు వారాంతమున లాభము. వారమంతా ఉద్రేకముతో ఉంటుంది. విదేశీయుల పరిచయము, అపురూపవస్తు సంపాదన కలుగుతవి. 27 న అధిక ఖర్చులు, మనోవ్యథ.



### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈ వారము ఆశించిన సహాయము లభించక, అవసరములు తీరక, ఆందోళన కలుగుతుంది. అయినప్పటికీ దైవానుగ్రహమువల్ల కష్టములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ, వర్తకులకు చాంచల్యము. పుణ్యపురుషుల సాంగత్యమువలన మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతిగావున్నా నష్టద్రవ్యలాభము పొందుతారు. 28 న అధిక ఖర్చులు.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈవారము అనుకూలతకన్నా ప్రతికూలత యెక్కువ. ఇచ్చిపుచ్చుకు నేపట్లవివాదములు వచ్చి మనోవ్యథ కలుగుతుంది. కోర్టు వ్యవహారములు అనుకూలించినా, అమిత ఖర్చుల వల్ల ఆ సంతోషముండదు. భార్యకు అనారోగ్యముకలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నూవ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభయోగము. ఇతరజాతుల వల్ల గౌరవము కలుగుతుంది. 27 న బంధువులరాక అధిక ఖర్చులు.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారము ఎంత ప్రయత్నించినా యత్నకార్యాలకి ఆటంకము కలుగుతూనే వుంటుంది. అయినప్పటికీ పట్టుదలవల్ల కార్యలాభము పొందుతారు. సోదర సహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. దెబ్బలుతగిలే ప్రమాదములు జాగ్రత్తవల్ల తప్పవచ్చు. గనుల యజమానులకు, లోహ, ఖనిజ, వ్యాపారస్తులకు, భూస్వాములకు కష్టముతోగూడిన లాభము. పోలీసు శాఖ ఉద్యోగస్తులకు మేలుకాలము. 28 న ప్రమాదసూచన.

### * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈ వారము మీకు యోగదాయకము. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. ధనలాభము కలుగుతుంది. ఈశాన్యదిక్కునుండి క్షేమసమాచారము తెలుస్తుంది. శుభ కార్యాలలో పాల్గొంటారు. బంధుదర్శనము, గణిత జ్యోతిషశాస్త్ర చర్చలుజరుగుతాయి. ప్రత్తి, దూది. నూలు, బట్టలు, ఇత్తడి,కంచువర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము. 27 న అధిక ఖర్చులు.

## ఈవారము ధరలు:

నూలు, వస్త్రములు :- సమస్థాయిలో వుండును.

నూనెదినుసులు:- స్వల్పముగా పెరిగే సూచనలున్నవి.

ఆహారధాన్యములు :- స్వల్పముగా పెరుగును.

బెల్లము, పంచదార:- మార్పులేదు.

చింతపండు:-మందముగా వుండును.

పప్పుదినుసులు .- తగ్గుదలలో వుండును.

వెండి .- స్వల్పతేడాలో వుండును.

బంగారం:-స్వల్పతేడాలోవుండును.

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము నెరుగనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనునది. కృష్ణుడను పేరునకు మృగశిర, హృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయునూ చూచుకోనునది.

### * విశాఖ [తీ, తూ, తే, తో] *

ఈ వారము మీకు శుభయోగము. ఆశించినడబ్బు చేతికివస్తుంది. ఇంట్లో శుభ కార్యాలు జరుగుతవి. పుణ్యకార్యాచరణ ప్రభుత్వసన్మానము, వైద్యజ్యోతిష శాస్త్రములవంటి ప్రసంగాలు జరుగుతవి. విద్యార్థులు నూతనాంశాలు నేర్చుకుంటారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు,ఉపాధ్యాయులకు మేలుగావున్నా కొంత ఆందోళన కూడా వుంటుంది. పిల్లల అభివృద్ధికి కొన్ని యేర్పాట్లు చేస్తారు.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈ వారము మీరు తలపెట్టిన కార్యములలో జయము పొందుతారు. వెండిపాత్రలో మృష్టాన్న భోజనము బంధుమిత్రులతో చేస్తారు. వినోదములలో పాల్గొంటారు. విద్యార్థులకు చదువు ఉత్సాహముగా సాగుతుంది. ప్రత్తి, దూది,నూలు, బట్టలు, వెండి, బియ్యము ద్రవపదార్థజనిత వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభదాయకము. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలుకాలము. 28 న అధిక ఖర్చులు.

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము మీకు యోగప్రదము. ధనధాన్యవృద్ధి కలుగుతుంది. వివాహాది శుభకా

ర్యాలలో పాల్గొంటారు. ఇష్టవస్తులాభము. పరోపకారంవల్ల కీర్తి కలుగుతుంది. విద్యార్థులకు చాలా చురుకుగా చదువు సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులు అమితలాభము పొందుతారు. వాహనయోగములు కలుగును. కవులకు, గాయకులకు, కళాకారులకు నటీనటులకు యోగకాలము. 27 న కుటుంబ కలహము.

## * మూల [ యే, యో, బా, బీ ] *

ఈ వారము కార్యభారము ఎక్కువ. వింతమాటలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ప్రయాణము, ధనలాభము వుంటును. అకాల భోజనమువల్ల అనారోగ్య సూచనలు కనపడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్పఅనుకూలత. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితోపాటు అనుకూలత. 27 న అనారోగ్యం.

## *పూర్వాషాఢ [ బూ, ధ, ఫా, డా |*

ఈ వారము తలపెట్టిన పనులు నెరవేరవు; ఆలస్యము కలుగుతుంది. వర్తకులకు లాభము ఎక్కువ. ఆత్మీయుల ఆరోగ్యం చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వన పర్వత ప్రాంతములకు. బదిలీఅయే సూచన లున్నవి. రహస్యములను కనిపెట్టుటకు నియోగించబడతారు వారమంతా చికాకుగావున్నా వారాంతములో మిత్ర సహాయము, విదేశీయుల పరిచయము. కార్యసిద్ధి జరుగును.

## *ఉత్తరాషాఢ | బే, బో, జా, జీ |*

ఈ వారము ధనాభావము ఎక్కువ, ఎవరి సహాయంవల్ల కార్యసాధన చేదా మనుకుంటారో వారివల్ల నే ఆటంకములు కలుగుతవి. అయినా దైవబలంవల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుండదు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచి రోజులు కావు. వారమంతా వింత ఆందోళన వున్నా సాధు సజ్జనసాంగత్యము పుణ్య క్షేత్ర సంచారము. దేవతా దర్శనము వింతలను చూచుట, నష్టద్రవ్యలాభము కలుగుతవి.

## * శ్రవణము | జూ, జే, జో, ఘా |*

ఈ వారము అనుకూలత కన్న ప్రతికూలత ఎక్కువ. యత్న కార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తవి. కోర్టు దావాలు అనుకూలిస్తవి. పరోపకారానికి యత్నపడి సాగక నిందలు పొందుతారు. భార్య ఆరోగ్యము సరిగా యుండదు. ఇచ్చి పుచ్చుకోవే పట్ల వివాదములు. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడివున్నా తోటివారి సహకారము లభిస్తుంది. వర్తకులకు వారమంతా నిరాశ. వారాంతమున లాభము. విద్యార్థులకు చదువు బాగా సాగదు.

## * ధనిష్ఠ | గా, గీ, గూ, గే | *

ఈ వారము ఎన్ని అవాంతరములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభము పొందుతారు ఆశించిన ధనం సమయానికందక అప్పుచేస్తారు. ఆత్మీయులవల్ల నిందలపాలవుతారు. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు భూస్వాములకు ఇంజనీరింగు శాఖ ఉద్యోగులకు, రంగులు లోహ వు సామానుల వ్యాపారస్తులకు, కష్టముతో కూడినలాభము 28 న ప్రమాదం, భయం.

## *శతభిషం [ గో, సా, సి, సూ |*

ఈ వారము మీకు యోగప్రదము. బంధువుల సహాయముతోను అధికారుల సహాయముతోను ఆటంకములు గడిచి ఫలం పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. వైద్య జ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్యదిక్కునుండి క్షేమము తెలుస్తుంది. విద్యార్థులకు మంచికాలము. కవులకు, శిల్పులకు, గణితశాస్త్రజ్ఞులకు, నటనటులకు యోగకాలము. 24, 25 తేదీలలో ధనలాభము, కార్యసిద్ధి.

## * పూర్వాభాద్ర [ సే, సో, దా, దీ |*

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. ఆశించిన సొమ్ము చేతికి వస్తుంది. నూతన కార్యములు ప్రారంభిస్తారు. కోర్టు దావాలలో కొంత అనుకూలత వుంటుంది. పండిత గోష్ఠి జరిపె విషయాలు తెలుసుకుంటారు వారమంతా శుభయోగములున్నా కొంత ఆందోళనతో కూడి వుంటుంది ధనలాభము, పుత్రుల అభివృద్ధి, కార్యసిద్ధి, 27 న అధిక ఖర్చులు. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు ఉపాధ్యాయులకు మేలుకాలము.

## *ఉత్తరాభాద్ర [ దూ, శం, ఛా, ధా ]*

ఈ వారము వినోదములలో పాల్గొనుట దధి, క్షీర మధుర పదార్థయుక్త భోజనము రజతపాత్రలలో భుజించుట, తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము, తెల్లని వస్త్రములు కొనుట మొదలగు యోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థముల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము. వారాంతమున అధిక ఆందోళన.

## * రేవతి దే, దో, చా, చీ ] *

ఈ వారము ధనధాన్యాభివృద్ధి, పశువృద్ధి, కృషిమూలకముగా లాభము, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తు లాభము, పరోపకారమువల్ల కీర్తి వంటి రాజయోగములు కలుగును. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా చదువు బాగా సాగుతుంది విలువగల వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు రెట్టింపు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము స్త్రీలతోనూ, ఆప్తులతోనూ, విందువినోదము. 27 న కుటుంబ కలహము.

★

# బాలసాహితి

## శ్రీరామ నవమి

బాజాలు అవిగోను
బాజాలు రార!
పాటలతో సన్నాయి
పిల్చె నదిగోర!

బాజాలు అవిగోను
పాపాయి రార!
పాలకీలో సీత,
రాము లరుగోర!

జనకుని కూతురూ
సీతమ్మ తల్లి!
దశరథుని పుత్రుడూ
రామయ్య తండ్రి!

శ్రీరామ చంద్రుండు
సీతమ్మ భర్త!
రామన్న తమ్ముడే
లక్ష్మన్న చిన్న!

నవమి నాడూ పుట్టె
శ్రీరామ భద్రుడూ!
నవమి కీడే యేము
వనవాస మొచ్చింది.

పదునాల్గు వర్షాలు
జానకీ రాముడూ
అడవిలో పడినారు
పడరాని పాట్లు!

రామ నామంబంటె
తెలుగు నాడంత-
సీతమ్మ పేరంటె
స్త్రీ లోకమంత-

ఉప్పొంగి పోతారు
ప్రేమతో, భక్తితో!
ఉత్సవాల్ చేస్తారు
బహు గొప్పవారు.

బాజాలు అవిగోను
పాపాయి రార!
పాలకీలో సీత,
రాము లరుగోర!

 "ఎల్లోరా" 

# రామావతారంలోని రహస్యం

పి. లక్ష్మి

ఒకనాడు కలహాభోక్తయైన నారదుడు కైలాసముచెంత తిరుగుతూ గంగానదిలో స్నానమాచరించి శుచియై ఒక సముచితప్రదేశంలో కూర్చుని 'శివోహం' అనే మంత్రము జపించుతూ తపస్సు చేస్తున్నాడు. రోజులు, మాసములు, సంవత్సరములు, గిర్రున తిరుగుతూ గడుస్తున్నాయి.

నారద తపోవిధానము విన్న దేవేంద్రుడు 'ఆహా! నారదునకు కూడా స్వర్గాధిపత్యమునకై కోరిక పుట్టింది కాబోలు. లేకపోతే నారదుడింతకాలము తపస్సు చేస్తాడా? నేనిట్లే ఊరుకున్నట్లయితే నారదుడు తన తపోబలముతో స్వర్గము నాక్రమించి నన్ను పదభ్రష్టుని చేయకుండా ఉంటాడా? కనుక యెట్లాగయినా యీతని తపస్సు భంగం చేయాలి,' అని తలచి వెంటనే మన్మథుని రావించాడు. ఎట్లయినా నారదుని తపస్సు భంగముగావించాలనీ చెప్పి మన్మథుని పంపించాడు.

మన్మథుడు వసంతుడు మున్నగు మిత్ర బృందముతోను, భార్యయగు రతీదేవితోను, బయలుదేరి తపస్సు చేస్తున్న నారదుని సమీపించి తన వద్ద ఉన్న అస్త్రములనన్నిటిని నారదునిపై ప్రయోగించాడు. కాని నారదుడు కొంచమైనా చలించలేదు. మన్మథుడు తన ఓటమికి తానే సిగ్గుపడి దేవేంద్రునివద్దకు వచ్చి నారదుని తపోభంగము చేయటం తనకు శక్యముకాదని చెప్పుకున్నాడు.

నారదుడును చిరకాలము తపస్సు చేసి మన్మథుని కూడ జయించి సిద్ధిని పొందాననే గర్వంతో తన గొప్పతనమును త్రిమూర్తులకు తెలియచేయాలని బయలుదేరి ముందు కైలాసమునకుపోయి పరమశివునితో తన తపోవిధానము, మన్మథునినయితము జయించిన తన గొప్పతనము చెప్పుకున్నాడు.

భక్తజన వత్సలుడైన శివుడు నారదుని అహంభావమునకు జాలిపడి "మునీంద్రా! నీ తపస్సునకు చాల మెచ్చుకున్నాను. కాని నీ యీ తపోవిధానము, మన్మథుని జయించటం మున్నగు విషయాలు విష్ణుమూర్తితో చెప్పకుసుమా! నీ శ్రేయస్సు కోరి నేను యింతగా చెబుతున్నాను," అని పలికాడు.

ఆ మాటలు నారదుడు లెక్కచేయక బ్రహ్మదేవుని కడకు పోయి అతిగర్వముతో మన్మథుని జయించిన తన తపోవిధానము గురించి చెప్పగా బ్రహ్మ 'నారదమునీంద్రా! ఈశ్వరానుగ్రహమున నీవు మన్మథుని జయించావు. అంతేగాని వేరొకటి గాదు. అంతమాత్రాన కులుకబోకు. గర్వమెవరికీ తగదు. పరమశివుని ఆజ్ఞ లేనిదే పరమాణువు కూడ చలించదు. కనుక అంతా నాప్రజ్ఞే అని కులుకబోకు," అని



శ్రీ రామ పట్టాభిషేకం

[శంకర్స్ వీక్లీ బొమ్మల ప్రదర్శనంలోనిది]




**వినీతాంజలి**

చిత్రకారుడు: ఆర్. ఎస్. శర్మ-పెడబల్లె

# ★రామావతారంలోని రహస్యం★

హితవు ఉపదేశించాడు. కాని అది పెడచెవిని బెట్టి నారదుడు సరాసరి వైకుంఠమునకు వెళ్లి శ్రీ మహావిష్ణువుతో మన్మథుని జయించిన తన తపోవిధానము గోరంతలు కొండంతలు చేసి వర్ణించుకున్నాడు. మహావిష్ణువు అది విని విని "మునీంద్రా! మన్మథుడంతవానిని జయించి ఘోరతపస్సులో సిద్ధిపొందిన నీకు ఏ ఋషీ సాటిరాడు" అని పొగిడాడు. నారదుడు మరింత పొంగిపోయి విష్ణువుతో "మహాత్మా! గుండెనిబ్బరముగలవారిని మన్మథుడుమాత్ర మేమి చేయగలడు? మన్మథుని కూడ జయించలేని వారు తపస్సున కుపక్రమించు టెందులకు? అయినా నావంటి వానికి మన్మథుని జయించటం ఏం గొప్ప?" అని అహంభావముతో ఇదంతా తన ప్రజ్ఞయే అనుకొని మాట్లాడాడు.

ఇది అంతా పరమశివుని మాయాజాలమని గ్రహించిన మహావిష్ణువు ముక్కంటియిచ్చానుసారముగా నారదుని గర్వమణచాలని తలచాడు.

తరువాత నారదుడు మన్మథుని మాయాజాలమునకు లొంగిన త్రిమూర్తులు కూడా తనకు సాటి రారని గర్వించి పోతూండగా మార్గమధ్యంలో ఒక్క పట్టణం కన్పించింది. నారదుడు ఆ పట్టణం ప్రవేశించి శీలనిధి అను రాజు ఆ పట్టణము పరిపాలించుతున్నాడనీ, అతనికి శ్రీమతి అనే కూతురు కలదనీ, ఆమె కానాడు స్వయంవరమనీ, అందుకై అనేక దేశములనుండి రాజులు వస్తున్నారనీ, తెలుసుకొని తానుకూడా రాజభవనమునకు వెళ్లాడు. శీలనిధి నారదుని రాక తెలుసుకుని యెదురేగి నమస్కరించి నారదుని తీసుకుని వచ్చి అర్ఘ్యపాద్యాలతో పూజించి సింహాసనము మీద కూర్చుండబెట్టి తన కూతుర్ని రావించి నారదునకు నమస్కరింప చేసి స్వయంవర వృత్తాంతము తెలియచేశాడు.

నవయౌవన సుందరాంగి, నానా విధాలంకార భూషితఅయిన ఆ రాజకుమారిని చూచిన నారదుడు తనకు తెలియకనే మన్మథాస్త్రములకు గురియై ఆ రాజుతో 'మహారాజా! సర్వలక్షణసంపన్న అయిన నీ బాలికకు మన్మథునిగన్న మహావిష్ణువే భర్త కాదగినవాడు' అని చెప్పి మన్మథ ప్రేరితుడై, చలించిన చిత్తము కలవాడై, పరుగు పరుగున సభను విడిచి వైకుంఠమునకు వెళ్లి, విష్ణువుతో "మహాత్మా! శీలనిధి అనే మహారాజు కుమార్తె శ్రీమతి స్వయంవరము జరుగబోతోంది. నా మనస్సెందుకో ఆ కన్యపై లగ్నమయినది. ఆ సౌందర్యరాశిని వివాహమాడని జన్మకూడ ఒక జన్మమేనా? ఆ సుందరాంగిని చేబట్టకపోతే నేను బ్రతకటం కష్టం.

కాన ఆ స్వయంవరములో ఆ నవమోహనాంగి నన్నే వరించి నామెడలో పూలదండ వేయటానికై నిన్నొక్క కోరిక కోరటానికి నేను వచ్చాను. ఏమిటంటే నీ సుందరాకారము నాకిచ్చినట్లయితే తప్పక ఆ బాల నన్ను వరించుతుంది. కనుక యీపుణ్యం కట్టుకొని నన్ను కృతార్థుని చేసి నన్నొక యింటివానిని చెయ్యి" అని వేడుకొన్నాడు.

తన మాయాజాలములో అతి సులువుగా చిక్కుకున్న నారదుని చూచి మహావిష్ణువు ఒక చిరునవ్వు నవ్వి "నారదా! నీవంటి తపోధనుని మాట కాదంటానా? నా సుందరాకారము నీకు యిచ్చాను. ఇక వెళ్ళి నీ పని నిర్విఘ్నముగా కొనసాగించుకో" అని చెప్పాడు. తన శరీరమంతా చూసుకొన్న నారదుడు తన సౌందర్యమునకు తనలో తానే మురుస్తూ ఆ కన్య తప్పక తన్నే వరిస్తుందని ఆశతో బయలుదేరి తొందరగా స్వయంవరము జరుగుతున్న చోటికి వచ్చి ఒక సింహాసనము మీద కూర్చున్నాడు.

ఎందులకో స్వయంవరమునకు వచ్చిన యితర రాజులందరూ నారదుని చూచి ముసిముసినవ్వులు నవ్వుకొంటున్నారు. తన సుందరాకారము చూసి వారందరు యీర్ష్య పడుతున్నారని నారదుడు తలచాడుగాని నారదుని పరాభవించటానికి విష్ణువు శరీరమునకు సౌందర్యము ఇచ్చి, ముఖము మాత్రము కోతి ముఖముగా ఉండేట్లు

ఈ సంచిక నుంచీ

## కొత్త శీర్షిక

రంగుల రాట్నం-1. వాల్ డిస్నీ




"ఏరోయ్, మన తుఫాన్ మెయిలు కొత్తకొత్తవన్నీ పెట్టుకుంటున్నాడే? "

"ఆ, అదంతా హంగు లే. వాడికి వెనకబడే వాళ్లెవరుంటారు? "

చేశాడని పాపము నారదున కేమి తెలుసు? ఇంతలో రాజకుమార్తె పూలదండను తీసుకొని ఒక్కొక్కరినే చూస్తూ బయలుదేరింది.

రాజకుమార్తె తనను సమీపించుతున్నకొలది తన సౌందర్యము చూచి తననే తప్పక వరించుతుందని నారదుడు 'ఇంకా చూస్తావేం? నాలాంటి భర్త నీకెన్ని జన్మలెత్తినా దొరకడు. ఆ చేతిలోని హారం కాస్తా నామెడలో వేసెయ్యి" అన్నట్లుగా తన మెడను కాస్త ముందుకు కూడా చాచాడు పాపం నారదుడు. కోతి ముఖం నారదుని చూచి ముందు అసహ్యించుకొన్నా అతని ఆతురత చూచి జాలిపడిన రాజకుమార్తె ఒక్క చిరునవ్వు ప్రసాదించి ముందుకు సాగింది.

నిరాశచెందిన నారదుడు తనవద్ద వుండి రాజకుమార్తె ముందుకు సాగిపోగానే కోపగించి సభను విడిచి బయటికి వచ్చాడు. కాని కాలు

# రామావతారము

ముందుకు పడడం లేదు. రాజకుమార్తె జాలిపడి నవ్విన ఆ చిరునవ్వే వెయ్యివరహాలమూటగా తలుచుకుంటూ భవనంముందు ఆగేడు.

అంతా విష్ణుని మాయయే కనుక రాజకుమార్తె సామాన్య రాజకుమారుని వేషమున వచ్చిన మహావిష్ణువు మెడలో పూలహారము వేసింది. విష్ణు వాకన్యను తన పురమునకు మరొకదారిని తీసుకుపోయాడు.

నారదుని వలెనే నిరాశతో బయటకు వచ్చిన రాజకుమారులు నారదుని జూచి 'నీ కోతిమొగమునకు రాజకుమార్తె నిన్ను వరిస్తుందనే వచ్చావా?" అని హేళన చేశారు. అప్పుడు నారదునకు కోపమువచ్చి "నన్ను వెక్కిరించారు కనుక మీరందరు రాక్షసులై పుట్టండి" అని శపించి తన ముఖమును అద్దములో చూసుకొన్నాడు. ఆశ్చర్యపోయాడు. కోపతాపములు రెండును ఏకమయ్యాయి. ఇదంతా ఆ మహావిష్ణువు చేసిన మోసమని గ్రహించి తిన్నగా విష్ణువుదగ్గరకు వెళ్ళి "ఓరీ! మోసగాడా! నాబాధ నీతో చెప్పుకొని కాస్త సాయం చేయమని కోరినందుకు ఇదా నువ్వు చేసినది. తుంటరీ! దాని ఫలము అనుభవించక నీకు తప్పదు. నా మనస్సును బాధపెట్టి నేను వరించిన స్త్రీని నీవు తీసుకొని వచ్చావు కనుక నీవును నరజన్మమెత్తి భార్యావియోగము పొంది మిక్కిలి బాధలు పడుతూ దుఃఖిస్తావు. అదిగాక ఏ వానరముఖము నాకిచ్చి పరాభవించావో ఆ వానరుల సహాయమే నీ అసహాయ స్థితిలో కావలసివస్తుంది." అని శాపమిచ్చాడు.

ఇదంతా యీశ్వరేచ్ఛ అని తలచిన విష్ణువు విచారపడలేదు.

నారదుని శాపము అనుసరించి విష్ణువు రాముడై జన్మఎత్తి సీతా వియోగమును పొంది చివరకు వానరుల సహాయమున రావణుని సంహరించి సీతను తీసుకుని అయోధ్యకు తిరిగివచ్చాడు. 



ప్రశాంత ప్రభాతం

ఫొటో: ఎన్. గిరిధర్

కందుకూరి లింగరాజు

# సమర్పణ

(గత సంచిక తరువాయి)

## 15

ఆ కార్తీకమాసం వచ్చేసరికిసోమయాజులు పార్వతి, వసుపతి, క్రొత్తగా శిష్యుడైన పేరావధానులు, పండరీపురంనుండి పూనా, బొంబాయి, బృందావనం, ఆగ్రా, నాసిక్‌త్రియంబకం, బీజపూర్, షోలాపూర్‌ల మీదుగా, ఢిల్లీ వెళ్ళి కాశీ చేరారు.

ఒక్కొక్క పట్టణం, పుణ్యక్షేత్రం చూస్తుంటే, ఓపెం చరిత్రలు జ్ఞాపకం రావడంతో. మహాత్ముల కథలు కూడా వినడం సమకూడితే ఇప్పుడున్న శిథిలస్థితిలోని నిగూఢగంభీరతకు మనస్సులు ఊగిపోయేవి. మహాభారతం, జయదేవ అష్టపదులు, రామాయణం, భగవద్గీత ఇవన్నీ తాదాత్మికమనసాలే అయ్యేయి తాత్కాలికంగా.

పూనాలో ఊరికంతా దర్శనం ఇచ్చేట్లు వున్న దుర్గగుడి, సింగపునడుంలా వున్న గోదావరితల్లి, బృందావన రాసక్రీడ మందిరం, ఆ భామినీసుల్తానుల మహాభవనాలు మర్చిపోలేనంతగా హృదయంలో హత్తుకుపోయేయి. ఆ చరిత్రల్లోని ఘట్టాలను బట్టి ఎంతగా అనాటి పరిస్థితులు ఊహిద్దామన్నా అది శక్తికి అతీతమైనట్లే అయ్యింది వాళ్ళకి.

ప్రత్యేకంగా, బీజపూరులో ఆ పెద్ద కట్టడంలో 'మహమ్మద్ ప్రవక్తవారి తలవెంట్రుక దాచబడింగి' అని వినడం నవ్వు కలించింది. అటు ప్రతీ శబ్దం ఎనిమిదిసార్లు ప్రతిధ్వనిస్తుంటే చెవుల్నే నమ్మలేని ఆశ్చర్యమూ కల్గింది; గోరి గుంబజ్‌ను చూచిన తర్వాత.

హిందూదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడానికి నిర్ణయంచేసేమన్న వార్త ఆగ్రాలో వుండగా వాళ్ళకు తెలిసింది. ఆనాటి వేడుకలు, ఉత్సాహం చూస్తూ సోమయాజులు, అంతవరకూ ఈ హిందూజాతిఅంతా దాస్యశృంఖలాల్లో ఆంగ్లేయపరిపాలనక్రింద జీర్ణమైపోయిందని, ఒక్క ఎముకలగూడే మిగిలింది, అంటే తను నమ్మలేకపోయేడు. అసలు ఈ రాజకీయజిజ్ఞాసే లేదు. అది తెలియదు కూడాను ఏ సభలో నేనా కూర్చుంటే జ్ఞానపీఠంలో వుండే నియంతృత్వం తెలుసు; అది నిలుపుకోవడం తెలుసు.

ఒకళ్ళను ఆదేశించడం, గదమాయించడం విద్యల్లో 'శాలువా వల్లె వేసుకుని కంకణాలు తొడుక్కుంటాం' అనేవాళ్ళను, పరీక్షించడం మాత్రం తెలుసు. అందులో లోతుపాతులు, గజకర్ణ గోకర్ణ విద్యలూ కరతలామలకమే యాజులికి.

అప్పుడప్పుడు వచ్చే వియ్యంకుడు వెంకట్రామయ్య చెప్పే గాంధీతత్వం, లేవదీసిన ఉద్యమాలు, చేసినక్రియలు ప్రభుత్వంపెట్టిన ప్రతిబంధకాలు, ఈ దాస్యవిముక్తి కొరకు పడే ఆవేదనా వినినవ్వుకునేవాడు. ఇప్పుడు అందులోని లోతు తెలిసవచ్చినట్లయ్యింది. ఈ అసంఖ్యాకమానవకోటిలో తొణికిసలాడే వెలుగుకు ముగ్ధుడే అయిపోయేడు. పూర్ణంగా కరిగిపోయినట్లయ్యింది.

వెర్రిగా ఆ ఉత్సవాలన్నీ, తన వయస్సును కూడా మర్చిపోయి చూచేడు. కూడా పార్వతి, అవెనగ్గా వాళ్లూ వుంటే, పార్వతి అడిగే ప్రశ్నలన్నిటికి తనే మురిసిపోయి సమాధానం చెప్పేవాడు. ఆవిడా ఉక్కిరిబిక్కిరి అయిపోయేది.

ఉండుండి "ఏమండీ! అయితే మన వూరికీ వచ్చిందా స్వాతంత్ర్యం?" అంది.

నవ్వువచ్చింది. నిజంగా ఆలోచిస్తే అదేమిటో ఊరూరా పంచిపెట్టే జడపదార్థంలాంటిది అని తనూ అనుకున్న కాలం లేకపోలేదు. నెమ్మదిగా ఆవిన్నది, ఇప్పుడు చూచినది, చరిత్రల్ని కల్పుకుంటూ, అది మృదువుగా, మధురంగా చెప్పేడు.

అంతావింది. ఆ ఊహల్కి నిర్ణీతపరిధులు ఏర్పడి, కొంచెంకై వారందాటిన ఇప్పటి స్థితిలోని మెరుగుకు సంబరంలో "ఆ! వాళ్లిచ్చేదేమిటి! పిల్లుపుచ్చుకునేదేమిటి? మీరు చెప్పండి. మనింట్లో నాకు స్వాతంత్ర్యం లేదా ఏమిటి?" అంది చటుక్కున.

ఆ మాటలు చాలా అవధిదాటినట్లే తట్టేయి. చురుక్కుమందికూడాను. ఆ మొదటి మూడునిద్రల నాటినుండి పార్వతి రూపాలు ఎదురుతిరిగేయి. చర్యలూ మననమయ్యాయి. ఆమె విలువా గోచరమైంది. కాని. .. 'తను' అన్న స్వార్థంలో, చండశాసనంలో దాని స్థితేమిటో తేటతెల్లంగా కన్పిస్తే గొంతుక బిగించినట్లయి, 'తను తెల్లవాడు' అన్న సాదృశ్యం వేదిక ఎక్కయ్యటంతో తబ్బిబ్బుఅయ్యేడు యాజులు.

ఆ సాయంకాలపు చీకట్లన్నిటిని ఎగరేసే వెన్నెలలు నెమరేస్తుంటే తాజమహాల్ చూచేరు. దాని సౌందర్యంలో వుండే నిండుకు కరగేపోయేడు. గంభీరంగా అవ్యక్త అనురాగంతో దానివైపు చూచేడు. పార్వతి మౌనంలో కలలేకని, తెలివి తెచ్చుకుని.

"చలపతీ, శచి ఎల్లావున్నారో!" అంది బరువుగా.

ఉదుటకు తట్టుకోలేనట్టు ఊగిపోయేడు. 'నిజమే! వాళ్లిద్దరిసంగతే! ఎంతదూరతీరంలో వున్నారో' అన్న బాధ కల్గింది. కళ్ళు చెమర్చాయికూడాను ఆ అనుభూతిలో.

ఆ బరువులో ఆగ్రావెనక్కే వెళ్లింది.

ఇంతదూరం, ఒకదానివెంబడి ఒకటి పుణ్యస్థలం అవనీ, కానీపోనీ. యాజులు చూడవలసిందే అయితే చూచేడు. అందులోనూ, వసుపతి వద్దంటున్నా. వీట్లన్నిటికి కూడా ఏదో నిగూఢశక్తి తన్నితోస్తోందన్న భావన, అది ఏక్రియా దోహదానికో అన్న సందేహం పీకుతూనే వుంది. దాంతో మనస్సు పరిపరివిధాలుగా పోయేది.

ఓవిధంగా చెప్పుకోవాలంటే ఆనాటి పండరీపుర విషయం దగ్గరనుండికూడా, మనస్సులో ఓవిధమైన సంచలనం బయల్దేరింది. అది అశాంతిగానూ తయారై, "ఇవన్నీ ఏమిటి? ఎవరు నువ్వు?" అన్న నిరంతర ఆవేదన ఎడతెగకుండా విజృంభిస్తూనే వుంది.

తనెవ్వరు? అనే ప్రశ్నకు 'అహం బ్రహ్మాస్మి' అని అనుకున్న రోజుల్లోని, నిర్ణయం, ధీమా, స్థయిర్యంకూడా ఇప్పుడు



# సమర్పణ



పరాజితమైపోతున్నాయి. మరి 'తనెవ్వరు?' దీంతో సతమతమైపోయేడు. దాంతో ఈ భార్య, ఈ పిల్లలు, సంసారం, దాంట్లోని లంపటాలు, సుఖదుఃఖాలు, పాపపుణ్యాలు కూడా ఏమిటి? ఎందుకోసంఅన్న సందిగ్ధంలోనూ పడ్డాడు.

ఈ భౌతిక, ఆధ్యాత్మికశక్తుల, నిరంతర సంగ్రామంలోని అశాంతిలో ఓవిధమైన సమాధానం దొరక్కుండాపోతుందా అనే అనుకున్నాడు. అందుకే, కాశీక్షేత్రంలో దిగీదిగటంతోనే, గంగామతల్లిదగ్గరకు పరిగెత్తేడు.

మణికర్ణికాఘట్టంలో, ఒక్కొక్క మెట్టే దిగుతున్నప్పుడు, అప్పుడు ఆ కాలంలో పండితరాయలు, గంగాలహరి చదివినప్పుడు ఒక్కొక్క మెట్టే గంగాభవాని ఎక్కింది; ఈనాడు తనో, అతల్లికోసం ఒక్కొక్క మెట్టే దిగుతున్నాడు—' అన్న దృశ్యం సాదృశ్యం అయితే కళ్ళమ్మట నీళ్లు పొరలు క్రమ్మేయి. దుఃఖం వచ్చింది. కుమిలిపోతూ ఆమె ఒళ్ళో కళ్ళు తుడుచుకున్నాడు. తర్పణాలు విడిచేడు. తర్వాత విశ్వేశ్వరస్వామి దర్శనమూ చేసేడు. ఏకాదశ రుద్రాభిషేకమూ చేసేడు.

పువ్వుపుట్టగానే పరిమళం ఒస్తుంది కొన్ని జాతులకు. కొన్నిట్లకు పుట్టుకలోనే వుంటుంది. మరికొన్నిట్లకు పుట్టనవసరం లేకుండానే పరిమళజాతి సంపన్నం అనే అనిపించుకుంటాయి. ఇది స్వభావసిద్ధం, ప్రకృతినైజమున్నూ.

వీట్లన్నిటికి అతీతమైపోయినట్లు సోమయాజులుకు కాశీపురంలో ఘనసన్మానమే జరిగింది. పండితుల పొగడ్తలు, ఘనాపాఠీల ప్రశంసలు, వేదాంతుల అభినందనాలు ఓనాడు జరిగిన్నీ పోయేయి. ఆ హిందూ విశ్వవిద్యాలయం, సాంస్కృతిక చైతన్యం, చరిత్రల ఆవృత్తి, సంస్కృత పుస్తక భాండాగారం చూస్తే యాజులికి విపరీత ఉద్రేకం కల్గింది. ఆ పురాతన సంస్కృత గ్రంథాలు, జీర్ణశిథిలాలు కాకుండా, వెలుగైనా చూడ్డానికి నోచుకోవకపోవడం, మనస్సును బాధించింది. 'ఆ రోజూ వస్తుందా' అన్నది సంశయాస్పదం అయితే మథన పడ్డాడు కూడాను.

కార్తీకంవెళ్ళి మార్గశిరం వచ్చేవరకూ అక్కడే వున్నారు. బ్రహ్మకపాలం, బదరీనాథ్ వెళ్ళాలనుకున్నాడు యాజులు. కాని అది వీలుపడకపోవడంతో పూర్ణయాత్ర ఓ పెడేనా అవుతుందని దక్షిణాదికి బయల్దేరేడు.

అక్కడ వుండగానే శ్రీపతి ఉత్తరం వచ్చింది. ఆత్రుతగానే విప్పేరు.

"బ్రహ్మశ్రీ వేదమూర్తులైన నాన్నగార్కి శ్రీపతి సాష్టాంగ నమస్కారములు చేసి వ్రాయునది.

ఈనాటి నా ఉత్తరం మీకు మనస్సు వికలంచేసి, క్షుభితం చేస్తుంది, అని తెలిసి వున్నా, వ్రాయకుండా ఇంతవరకూ వుంచుకున్న విషయాలను ఇంక లోపల ఇముడ్చుకునే శక్తిలేక వ్రాస్తున్నాను. ఇంతవరకూ నాకు ధైర్యంపోసిన శ్యామల ఒదిన కూడా భీరువైపోయింది.

అందువల్ల నేను మీకు తెలియపర్చడంలోని బాధ్యతలోనే వ్రాస్తున్నా. దానికి క్షంతవ్యుణ్ణి కూడాను.

మీరువెళ్లినకొన్నాళ్లకే చలపతిమామయ్య ఇంట్లోంచి వెళ్ళిపోయి కమ్యూనిష్టుల్లో కలసిపోయేడు. మకాం ఎత్తేసేడు. ఓసారి మామయ్యా, అత్తయ్యా కూడా మన ఇంటికి వచ్చి, శాంత పెళ్ళివిషయంలో పెట్టుకున్న ఆశలన్నీ ఇలా గొడ్డలిపెట్టు అయ్యాయని గోలపెట్టేసేరు. ఆనాడు మీరున్నారనే వచ్చి, అమో, తుమో తేల్చుకుందామని ఎల్లాగైనా చలపతికి ఏ ఘటశ్రాద్ధమో చేయిద్దామన్న కొండంత ఆశపెట్టుకుని, మీరు లేకపోడంతో, తిరుగుబండిలో వెళ్ళిన్నీ పోయేరు.

దీనికి తోడుగా, మనందరికి కూడా తలవంపు, నూనత్వ, కుమిలింపు కలగచేస్తూ ప్రతిపక్షంతో మంటకల్పేసి, ఆ చినరెడ్డి కూతురు, సీతమ్మను, ఎక్కడ కలుసుకున్నాడో కాని, పెండ్లిచేసుకున్నాడు. వాళ్ళ రాజకీయమతానుసారంగా, పెళ్లికి మామయ్యను కూడా పిల్చేడుట.

సీతమ్మ అంటే మీకు గుర్తు వుందనుకుంటాను. ఆమె పాలేరువాడితో లేచిపోయిందని ఆంక్ష విధించి కులంలోంచి వెలివేసినట్లు అప్పుడు మీరు నిర్ణయించేరు; అదే. ఇప్పుడు చినరెడ్డి, సూర్పరాజు, రంగాచారి కూడా, వాడిపక్షం అయిపోయేరు. మాలవీరడి కొడుకు ఈవూళ్ళో ఆ పార్టీకి ప్రతినిధి, నాయకుడున్నూ.

అవధానికి తెలుసును ఇదంతా. ఆ మొదట్లోనే ఏదో ఖచ్చితంగా నాలుచివాట్లూ పెట్టకపోవడంవల్ల చలపతి రెచ్చిపోయి ఇంతవరకూ తీసుకువచ్చేడు. అవధాని తనూ, తనభార్య. కాంగ్రెస్ అంటూ, ఉద్యోగం పోగొట్టుకుని తర్వాత అందులో మునిగిపోయేడు. ఇద్దరూ జైలుకుకూడా వెళ్ళి వచ్చేరు.

ప్రస్తుతం, నాకు ఒకరిజిస్టరీ నోటీసు చలపతి ఇచ్చేడు. అందులో అగ్రహారంలోనూ, పెదపూడిలోనూ వున్న తరతరాలనాటిఆస్తి ఇంతవరకూ ఉమ్మడిహయాంలోనే ఉండివున్నదనిన్నీ, అందులో ఐదవ భాగానికి తాను వారసుణ్ణి అనీ, అది వెంటనే తనస్వాధీనంచేసి, దస్తావేజు రిజిస్టరీ చేయించవలెనని వ్రాశాడు. అందులోనే, ఓ వేళ ఇది వెంటనే జరగడానికి ఆటంకంవుంటే, మధ్యవర్తులు నిర్ణయించిన దామాషాఖరీదు మొత్తం ఇచ్చేట్లయితే, తనువాక్కు భుక్తాలు వదులుకోవడమే కాకుండా, మైనరయిన తనకొడుకు తరఫునకూడా విడుదల వ్రాసివ్వడానికి తయారుగా వున్నానని కూడా వ్రాశాడు.

వెంకట్రామయ్య మామగార్ని, అవధానినికూడా సంప్రదిస్తే, ఇప్పుడు నేను

మీకు వ్రాయడంకన్న, మరోయుక్తమైన మార్గము లేదన్నారు.

నాకు వింపాలుపోక, మీకువ్రాస్తున్నా. మీ ఆజ్ఞ కొరకు ఎదురు చూస్తూన్నా.

అన్నయ్యగారితోకూడా సంప్రదించి ఏదో నిర్ణయానికి రాగోరుతున్నా.

మ॥ స॥ అమ్మగారు క్షేమమా? వారికి నా నమస్కారములు చెప్పవలెను. ఇక్కడ వారందరూ క్షేమం.

-చిత్తగించవలెను.
శ్రీపతి."

వంటింటి గుమ్మందగ్గర పార్వతి, సావిట్లో ఓపెడగా పేరావధాని, ఉత్తరం చదివి నిరుత్తరుడైన వసుపతికూడా నిశ్చేష్టులే అయిపోయి, మెడలు వ్రేళ్లాడేసేరు. కళ్లల్లో మాత్రం ఈ అగ్నిహోత్రుడు ఏ ప్రళయకాల రుద్రుడు అయిపోతాడో అనేభయం ఛాడ చూపింది.

సోమయాజులు శ్రోతే అయ్యేడు అంతసేపూ. మొదలుపెట్టినప్పటినుండీ, కిటికీ చువ్వల్లోంచి కన్పించే గంగామతల్లిని చూస్తూనేవుండిపోయేడు. ఆ చూపు మరలించనూ లేకపోయేరు. ఉండుండి చివరికి, "వసుపతీ! నువ్వు ఇంటికి వెళ్ళడం ఇప్పుడు మంచిది," అని వూరుకున్నాడు.

"నేనా?" తెల్లబోతూనే అన్నాడు. అందులో 'వెళ్ళి ప్రయోజనం' అన్న సందేహం లేకపోలేదు.

"అవును. వెళ్ళి కరణంగార్ని, వెంకట్రామయ్యను, గంగరాజుబావను, పెదపూడి కూచిభొట్ల సూర్యనారాయణగార్ని పిలిపించు. వారిచే ఆస్తివిలునా కట్టించు. అందులో చలపతి భాగం నాల్గోవంతు.."

మధ్యలో అందుకుంటూనే వసుపతి "నాల్గోవంతెలా? మరి మీమాటో!.."

నవ్వేడు. "నాకు కావలసిన ఆస్తి మీరివ్వలేరు నాయినా!" అంటూనే "భాగించి నేను కోశేవరి డబ్బు సర్దుపాటు చేయించి, కాగితాలు వ్రాయించు. అంత అత్యవసరమే అయితే రంగనాయికకు కబురుపెట్టు."

ఈ దెబ్బతో వసుపతి మండిపోయేడు. లోపల్లోపల ఆ చలపతిని పండంటి ఈ ఉమ్మడి కాపురాన్ని చితిమీద, నాన్నగారి హోమాంలోనే పెట్టేసేడని, ఆ కోనసీమలో వుండుకున్న వంశప్రతిష్ఠ అంతా బుగ్గై, నీచాతినీచ స్థితిలో పడేయ్యడానికి కారకుడయ్యాడని, చిత్రవధ చేసినా పాపంలేదనీ భావం కలిగి రెచ్చిపోయేడు.

పేరావధానికి వెలక్కాయ గొంతు పడ్డట్టయ్యింది. అయినా మనస్సు వుండబట్టలేక "సోమయాజులుగారూ!" అన్నాడు.

సోమయాజులు నవ్వుతూనే "అవును అవధానిగారూ! మీరు అనుకుంటూ వున్న హిందూ ధర్మ సిద్ధాంతరీత్యా, మతభ్రష్టుడయిన కొడుక్కి ఆస్తిలో హక్కు వుండదన్న విషయం నిజమే. బ్రతికి వుండగానే చచ్చినవాడితో సమానమని శ్రాద్ధంపెట్టి చేతులు కడుక్కోవడంతో పూర్తిచేస్తే సరి. ఆపని చెయ్యడం యుక్తమే అంటారు.

అయినా,

శాస్త్రం మీకు తెలుసు. విద్య మీకూ వచ్చు. న్యాయం అందరమూ చెప్పగలము. కాని ఆచరణలోమాత్రం పప్పులో కాలు వేసినవతు అవుతూనే వుంటుంది. కాదంటారా?"

ఆ ప్రశ్న సూటిగా, ఘాటుగా తగిలేసరికి బొప్పికట్టినంత పనయ్యింది అవధాన్లకి. ఓ విధంగాచూస్తే తనేఆయన అంత ఉగ్రతంలోకి వెళ్ళడానికి కారకుడు కూడాను. లేకపోతే కథ ఇంకోవిధంగా జరిగివుండేదే! ఆ బ్రహ్మహత్య జరక్కుండానే వుండేది.

"ఎవరి కర్మ వారు అనుభవిసేనే కాని ముక్తిలేదన్న సూక్తిని శాస్త్రం ఘోషిస్తోంది. ఎవరికి, ఎవరు నాయనా?

శారీరకా లున్నంతకాలం, మమత లన్నీ నీడలే. ఆధ్యాత్మికా లన్నీ కూడా ఎండమావులే. అవన్నీ తాత్కాలిక మానసిక శాంతికే.

కాని

ఒక్కటే బెంగ. ఆ వేదన. ఎక్కడికి ప్రయాణం? ఎందుకూ? ఎవరికోసం? ఎవర్ని? ఈ చింతనే వేధిస్తోంది అవధాన్లుగారూ?

నా తర్వాతా? అది శివాజ్ఞ" అంటూనే లేచేరు.

పార్వతి మాత్రం కిమిన్నాస్తి. పల్లెత్తు మాట, సలహాకూడా చెప్పలేకపోయింది. బెల్లంకొట్టిన రాయే.

ఆరాత్రే వసుపతి వెళ్ళేరు. వెళ్ళుతున్నప్పుడే "ఒక్కమాట చెపుతున్నా. ఏ విపరీత పరిస్థితులు నిన్ను చుట్టుముట్టనీ, మన వూళ్ళో. అన్నిట్లకీ కూడా అతీతంగానే వుండు నాయనా!

వాట్లని అన్నిటినికూడా క్షమ, ఓర్పు విశాలత్వంలోనే స్వీకరించు," అంటూనే చెప్పేరు సోమయాజులు.

ఇదంతా చూస్తే క్షణంసేపు ఎందుకో అవ్యక్తంగా సమష్టి హిందూదేశం బ్రద్దలవ్వడంగా అనిపించి గుండెలు వ్రక్కలే అయ్యేయిఅవధాన్లకి. (ఇంకావుంది)



# వనితా లోకం



## పూలను తాజాగా ఉంచడ మెలాగ?

సాధారణంగా మనము ప్రయాణం చేస్తున్నప్పుడు పూలను కొని తెచ్చుకొంటాము. ఎవరైనా మనయింటికి వచ్చినపుడు పూలను తెస్తూఉంటారు. వాటిని విప్పి చూచుకొంటే అన్నీ వాడిపోయి ఎందుకూ పనికిరకుండా ఉంటవి. మరి వాటిని తలలో పెట్టుకోనూలేరు, పారవేయుటకు చేతులూ రావు. వాటిని మరల తాజాగా చేయడానికి మార్గం ఉంది. మనం పూలను కొనేటప్పుడు గాని చెట్లనుండి కోసేటప్పుడుగాని కొస్త కాడలుండేటట్లు చూచుకోవాలి. పువ్వులు వాడినప్పుడు ఆ వాడిన పూలతొడిమలు కొస్త కత్తిరించి కాడలమీద కొసన ఒక అంగుళం మేరకు బ్లేడుతో సన్నగా బెరడు చెక్కి ఆ కాడలను గోరువెచ్చని నీటిలో ఉంచిన మరల పూలు బంతుల్లా విచ్చి ఘుమ ఘుమలాడుతూ ఉంటాయ్.

పూలను కొనడంతోను, కోయడంతోనే సరిపోదు. వాటివిషయమై శ్రద్ధతీసుకోక పోతే అవన్నీ వాడి ఎందుకూ పనికిరాకుండా పోతాయ్. తోటలోని పూలను యెప్పుడూ తెల్లవారుజామునే కోయాలి. ఎండతగులక పూర్వమే కోసినపూలు తొందరగా వాడి పోవు. పూలను కొన్నవెంటనే వాటిని నీళ్ళలో పెట్టాలి. లేకుంటే రేకులు త్వరగా విడిపోతవి. పువ్వులనుకోసి యింటియందు అలంకరణగా కూజాలో పెట్టుకొన్నట్టయితే కొస్త పెద్దకాడలుగా ఉండేటట్టు కోసి పెట్టాలి. కొంచెం పంచదారనుగాని ఒక యాస్పిరిన్ బిళ్ళగాని లేక కొంచెం పోటాసియం పర్మాంగనేటు రేణువులను గాని కూజాలోని నీళ్ళలో వేయాలి. వాటివలన ఆ పూలకు కావలసిన ఉష్ణోగ్రతను మనము వాటికి యిస్తున్నామన్నమాట. పువ్వులను పెట్టిన పాత్రనుండి రోజూ నీటినిమార్చుతూ పువ్వుల అడుగునున్న కాడలను కత్తిరిస్తూ ఉండాలి.

మనము ఎక్కడికైనా గులాబీలను తీసుకెళ్ళదలిస్తే లేక ఎక్కడనించైనా తెచ్చుకోదలిస్తే మొగ్గలు తెచ్చుకోవడం మంచిది. మొగ్గలంటే మరీ పసిరి మొగ్గలు కావుసుమండీ! విచ్చీవిచ్చని పూలను మైనపుకాగితంతో గాని తడిగుడ్డతోగాని చుట్టి తెచ్చుకోవాలి. కాడలు పొడుగుగా ఉన్నట్టయితే వాటికి తడిగుడ్డ చుట్టి అంతటిపైనా మైనపుకాగితము చుట్టి తీవ్రమైన ఎండవేడిమి తగలకుండా చూచి, పైనచెప్పిన రీతిని చేస్తే పూలు తాజాగా అప్పుడుకోసినపూలులాగ ఉంటాయ్.

సాధారణగా మనం మల్లెపూలను నీళ్లుచల్లి ఆరుబయట పెడ్తాం. అట్లా పెడితే పూలు తెల్లగా విచ్చుకొంటాయ్. కాని సన్నజాజులుగాని,విరజాజులుగాని అట్లాపెట్టామా అవి యెఱ్ఱగా మారి ఆ సువాసనంత పోయి అదోమాదిరి వాసన వస్తవి.అవి రాత్రిరాణులే. రాత్రులే వాటి అందం. కాని ఆ పరిమళం. తెల్లదనం పోకుండా ఉదయంవరకు తాజాగా ఉంచడానికో మార్గం ఉంది. సన్నజాజి, విరజాజి మొగ్గలను బాగా చల్లబడ్డాక కోసి దండలు గ్రుచ్చి లేక కట్టి సన్నపాటి తడిగుడ్డలో చుట్టి నీళ్లుచల్లి గట్టిగా మూత ఉండి, గాలిచోరని టిఫిన్‌బాక్సులో గాని, లేక ఒక గిన్నెలోపెట్టి పైన అదేసైజు గిన్నె బోర్లించి రాత్రంతా ఉంచితే ఉదయం మనము వాటిని వాడుకోడానికి బాగా ఉంటాయి. వాటి సువాసనా పోదు. రంగూ చెడదు.

చేమంతులను తరుచుగా అందరియిళ్లలో పెంచుతుంటారు. తక్కిన పూలవలె కాక అవి చెట్లను పూచి చాలకాలమువరకు ఉంటవి. వాటిలో తెల్లచామంతి పూలు చెట్లకు పూచి కొస్త త్వరగా వాడిపోతవి. అవి చామంతులలో సుకుమారమైనవన్నమాట. వాటిని తొట్లలోవేసి పూలు విచ్చుతున్నప్పుడు ఎండ బాగా వచ్చువేళ వాటిని (ఆతొట్లను) నీడకు లాగేస్తూండాలి. అంటే వాటికి తీక్ష్ణమైన ఎండ తగులకూడదన్నమాట మరల ఎండ తగ్గినవెంటనే ఆరుబయట పెట్టాలి. ఈవిధముగా మనము పూలవిషయములో శ్రమ అనుకోకుండా కొస్త జాగ్రత్త తీసుకొంటే అవి కొంతకాలము తాజాగా నవనవలాడుతూంటాయి. ★

బి. సుగుణబాల-పెద్దాపురం



# కలలు

## కె. లీలావతి

ఏదో కోర్టుపనిమీద పొరుగూరు నుంచి వచ్చిన ఓ పెద్దమనిషి ఆ రాత్రికి మా యింట్లో మకాం వేశాడు. మేమందరమూ చలిగా వుంటుందని యింట్లో పడుకున్నాం. ఆయనమాత్రం బయటే అరుగుమీద పడుకున్నాడు.

తెల్లవారుఝామున ఎవరో దేన్నో చడామడా కసిగా బాదేస్తున్నట్లు శబ్దం వినబడింది. నేనూ, అమ్మా, నాన్నా, అన్నయ్యా ఉలికిపడిలేచాం. బయట అరుగుపైన నిద్రపోతున్నాడనుకున్న పెద్దమనిషి ఓ లావుపాటి కఱ్ఱ పుచ్చుకొని బయల్లోని మల్లెపందిరిని అదేపనిగా బాదేస్తున్నాడు. అప్పటికే చుట్టుపక్కల వాళ్ళు నలుగురూ పోగయ్యారు. అతని చేతిలోని కఱ్ఱను లాగి పారేసి అతన్ని పట్టుకున్నారు. "చచ్చాడు కదూ! చావనీ వెధవ! చావాల్సిందే!" అని సనుక్కుంటూ, తూలుకుంటూ మామూలుగా అరుగుమీద పడుకున్న చోటికి పోయి తిరిగీ అయిదు నిముషాలలో గుఱ్ఱుపెట్టడం ప్రారంభించాడు తనకేమీ పట్టనట్లు.

ఆ మల్లె అంటు, నాటి సరిగ్గా ఆరునెలలు కాలేదు. ఎన్నాళ్ళనుండో మల్లె అంటు కోసం కలలుకని మా స్నేహితురాలి పుణ్యమా అని దాన్ని సంపాదించాం. ఎంచక్కా పందిరికెక్కుతున్న దానిని నిష్కారణంగా నాశనం చేసిపారేసి ఏమీఎఱుగనివాడికి మళ్ళె గుఱ్ఱుకొడుతున్న ఆ పెద్దమనిషిమీద గొంతుదాకా కోపం వచ్చింది.

"నే ననుకుంటూనే వున్నాను—యిల్లాంటి పనేదో చేస్తాడని. నిద్దరోతూ నిద్దరోతూ ఏవో కలలుకంటూ ఇంటి దగ్గరయితే ఒకొక్కప్పుడు గబుక్కున లేచి పెళ్ళాన్ని చావబాదేవాడుట. తెల్లారి లేచాక అడిగితే ఏమీ జ్ఞాపకం వుండదుట. గుచ్చిగుచ్చి అడిగితే ఎవరో విరోధి కలలో కనిపించినట్లు వాడిని చంపేసినట్లూ కలలు వచ్చాయని చెబుతాడు" అన్నారు నాన్నగారు మల్లె మొక్కకేసి చూసి నిట్టూరుస్తూ.

తెల్లవారాక ఎనిమిదికి లేచి ఆ మహానుభావుడు మొహం గిహం కడుక్కొని కాఫీకి సిద్ధమయ్యాడు. రాత్రి ఆయనచేసిన అఘాయిత్యాన్ని నాన్న వివరించాడు.

"ఏమిటి? ఏమిటి? నాకేం జ్ఞాపకంలేదే. ఏదో విరోధులతో దొమ్మి జరిగినట్లూ పరస్పరం కొట్లాడుకున్నట్లు ఏవో మామూలుగా కలలు వచ్చినట్టున్నాయి. అంతే! అంతే!" అని గొణుక్కుంటూ మల్లెపందిరివద్దకు వెళ్ళి చూచాడు. ముందటి రోజున కళకళలాడుతూన్న మల్లె ఆనాడు వెలవెలబోతోంది.

"వెధవది! కొంచెం ఆదమరచి నిద్రపోయానంటే ఇదే అవస్థ. ఊరికే బంగారంలాంటి మల్లెమొక్కను కొంచెం ధ్వంసం చేశాను. అయినా పరవాలేదులెండి. నేనింకో అంటు తెచ్చిస్తాను" అన్నాడు.

ఆతర్వాత అన్నట్టే అంటు తెచ్చి యిచ్చాడనుకోండి. అది వేరే సంగతి.

మా బావగారిదైతే మరీ తమాషా! మామూలుగా రాత్రి నిద్రపోతూ వుండి టక్కుమని లేచి మేడమీదినుండి క్రిందకు దిగివచ్చి మరోచోట పడుకొని నిద్రపోతాడు. తర్వాత లేచాక "అరె! పైన పడుకున్నవాడిని క్రింది కెలావచ్చానా?" అని విస్తుపోతుంటాడు.

నిద్రలో యిల్లా ఘోరాలు, తమాషాలు చేసేవారు చాలామంది వున్నారు. తమాషా ఏమిటంటే తెల్లవారి లేచాక వారికి వాటిని గురించి లీలగా అయినా జ్ఞాపకం వుండదు. ఒకొక్కప్పుడు ఆ పనులు మనం చేసినవి కాక—ఏవో దెయ్యాలు భూతాలు చేస్తున్నాయని భయపడి మన యింటిగుమ్మాలకు రక్షరేకులూ—అవీ తగిలించుకుంటూ వుంటంగూడా కద్దు మరి. అలా భయపడటానికి అవకాశం వుందాయె. నిద్రలో మనకు తెలీకుండా నడచి మరో చోటికి ఎలా పోగలం? అలా పోయినా లీలగా అయినా మనకు జ్ఞాపకం వుండదా? అని సందేహాలు వస్తాయి.

ఎవరైనా





# కలలు



"నీవు నిద్రపోతూ లేచినడచి వెళుతుండగా నేను చూచాను!" అని అన్నా నమ్మలేం. "మీ కేమైనా వెర్రెత్తా పిచ్చా? నాకు తెలీకుండానే ఏలా నడచి పోతానండీ!" అని అంటాం. నిద్రపోతూ నిద్రపోతూ చిట్టి చెళ్ళాయి టకీమని అర్ధరాత్రివేళ ఎగిరిపడి లేస్తుంది. "అదుగో దెయ్యం! మంచంక్రింద వుంది! దోమతెర పక్కనుంది! అదుగో! ఆ మూల! అమ్మో!—" అని ఒక్క గెంతున మంచంపై నుండి క్రిందకు దిగి పరుగు మొదలెడుతుంది. అమ్మ పట్టుకొని ఆపి తనదగ్గర పడుకో బెట్టుకొని నిద్రపుచ్చితే తిరిగీ నిద్రపోతుంది. తెల్లవారి లేచాక అడిగితే ఏమీ చెప్పలేదు. పైగా మావే ఒట్టి కోతలు అని డబాయించి పారేస్తుంది. ఇహ నాన్నయితే నిద్రలో కోర్టులో వాదిస్తూ వుంటాడు. అన్నయ్య రాత్రి కలలో ధారాళంగా యింగ్లీషు మాట్లాడి పారేసి తెల్లారి లేచింది మొదలు బియ్యే ఫస్టున్న పాసయినట్లు కలగన్నానని ఎగురుతుంటాడు. డిటెక్టివు నవలలూ—అవీ—చదివిన రోజున నేనూ ఏదో 'డిటెక్టివ్—దొంగ—హత్య' అని డిటెక్టివు పదజాలాన్ని పలవరిస్తానుట. తట్టిలేపితే 'ఊ' అని మరో వేపుకు తిరిగి పడుకుంటానుట. కానీ ఏమీ జ్ఞాపకం వుండదు. ఏవేవో కలలు వచ్చినట్లుంటుందే కానీ ఆ కలలేమో—వాటి మొదలూ చివరా ఏమిటో ఎంత కొట్టుకు చచ్చినా అంతుబట్టవు.



అసలు కలలంటే ఏమిటి? కలలు రావటానికి కారణం ఏమిటి? వాటికేమైనా అర్థం పర్థం వుందా? ప్రాచీన కాలం నుండీ ఈ ప్రశ్నలు మానవుడిలో కదలాడుతూనే వున్నాయి. వాటికి సమాధానాలుగా స్వప్నఫలశాస్త్రాలూ పుట్టుకొచ్చాయి. గొప్ప గొప్ప దైవజ్ఞులు - జ్యోతిష్యులు పుట్టుకొచ్చారు.

పూర్వంనుండీ కలలు, భవిష్యత్తును తెలిపే సాధనాలుగా చలామణి అవుతున్నాయి. గొప్ప గొప్పవారు పుట్టకమును పే కలల్లో తమ జననాన్నిగురించి తెలియజేసే వారట. శ్రీకృష్ణజననం - ఏసుక్రీస్తు జననం గురించిన కథలు ఈ సంగతులు మనకు తెలియజెబుతున్నాయి. బుద్ధభగవానుడు పుట్టకముందే మాయాదేవి కలగన్నది. ఆ కలలోని విషయాలను సాకల్యంగా పరిశీలించి దైవజ్ఞులు "మీకు కలుగబోయే పుత్రుడు గొప్ప విరాగిగాని మహాచక్రవర్తిగానీ అవుతాడు" అని చెప్పారు. వారి మాటలు అక్షరాలా నిజమై కూర్చున్నాయి.

మరో సంగతేమిటంటే గొప్పవారు చనిపోయే ముందుగూడా కలలు వారి మృతిని తెలియజేస్తాయట. షేక్స్పియర్ రాసిన జూలియస్ సీజర్ నాటకంలో వీరుడు సీజరు చావకముందే ఆయన చనిపోయినట్లు ఆయన భార్య కలగన్నది. ఆ కలను విని దైవజ్ఞులుగూడా మర్నాడు ఆయనను యిల్లు దాటిపోనీవద్దని సలహా యిచ్చారు. కానీ ఆయన వినిపించుకోక సెనెట్ హాసుకుపోయి ప్రాణాలు కోల్పోతాడు. ఈలా ఉదాహరణలు చెప్పాలంటె సాహిత్యం నిండా బోలెడు వున్నాయి.

అసలు సాహిత్యానికి కలలకు విచిత్రమైన సంబంధం వుంది. మన తెలుగు సాహిత్యాన్ని పరిశీలించండి. గ్రంథారంభంలో కవులు తమకు ఫలానివారు కలలో కనబడి ఫలాని పేరుతో తమ కంకితంగా ఓ గ్రంథం రాయమని పురమాయించారు కాబట్టి ఈ గ్రంథం అవతరించింది అని చెప్పుకు వచ్చారు. తిక్కనకు హరిహరనాథుడు కలలో కనిపించి భారతం పూర్తిచేయమని పురమాయించటంతో ఆయన ఆపని చేశారు. 'ఇహ భాగవతాన్ని ఆంధ్రీకరించవయ్యా'

అని శ్రీరామచంద్రుడు కలలో కనబడి ఆజ్ఞాపించటంతో పోతన భాగవతం అవతరించింది. ఈలా సాహిత్యంలో చాలా భాగాలకు కలలే అంకురార్పణ చేశాయి. ఏ దేవుడో - పూర్వీకుడో కలలో కనిపించి తన పేరుతో ఓకృతి రాయమనటమూ - సదరు కవి అలాగేనని రాసెయ్యటంతో సాహిత్యంలో గూడా కలలకు బోలెడు పరపతి వుందని తేలుతోంది. పోతే యిహ శాస్త్రజ్ఞుల థియరీలుగూడా కొన్ని కలల ద్వారానే రూపొందాయి. ఒక సమస్యను గూర్చి ఆలోచిస్తూ అల్లాగే నిద్రపోయిన శాస్త్రజ్ఞునకు కలలో ఆ సమస్యకు చక్కని పరిష్కారమార్గం లభిస్తుంది. ఆ దెబ్బతో ఆ శాస్త్రజ్ఞుడికి కీర్తిప్రతిష్ట వచ్చిపడతాయి. కలలు ఈలా సాహిత్య సేవా—శాస్త్రసేవా చేసి చాలా మంది కవులను-శాస్త్రజ్ఞులనూ ఉద్ధరించి-తద్వారా మనల్నందరను గట్టెక్కించి పుణ్యం మూట కట్టుకున్నాయి.

ఇటీవల శాస్త్రజ్ఞులు ఈ కలలపైకిగూడా దండెత్తి వాటతో మల్లయుద్ధం చేస్తున్నారు. ఆ కుస్లీలు-ఉరఫ్ పరిశోధనల మూలంగా భూమ్మీద రెండుకాళ్ళజంతువులన్నీ (మానవులందరూ) కలలు కనగలవని తేలింది. మనలో కొందరు "అబ్బే అసలు మాకు కలలే రావు!" అని అంటూ వుంటారు. అది అబద్ధం. అందరకూ కలలు వస్తాయి కానీ కొందరికి అవి జ్ఞాపకం వుండవు. అంచేతే వారికి కలలు వచ్చినా వచ్చినట్లనిపించదు. అసలు యింకో విచిత్రమైన సంగతేమిటంటే మనం యిరవై నాలుగు గంటలూ కలలుకంటూ వుంటామట. ఇంకా నిజం చెప్పాలంటే భూమ్మీదపడిన క్షణంనుండీ-భూమి క్రిందకు దాటుకునే గడియదాకా ఓ నిముషమైనా వీరవోకుండా కలలు కంటూవుంటామట. విచిత్రంగా లేదూ! అయితే అవన్నీ మనకు జ్ఞాపకం వుండవు ఎంచేత?

బాగా సస్పెన్సులో ఉన్న నవల చదువుతూ వున్నామనుకోండి. ఎవరైనా కొత్తవారు యింట్లోకి వచ్చారంటే మనం గమనించలేం. గమనించినా ఎవరో వచ్చినట్లు గుర్తుంచుకోగలం కానీ వారు ఫలాని వారు అని మాత్రం తెలుసుకోలేం. తర్వాత యింట్లోవారు "ఫలాని వారు వచ్చివెళ్ళారు" చూశావుటే అనంటే "ఎప్పుడు వచ్చారు? నేను చూడనేలేదే?" అంటాం. ఎంచేత? సస్పెన్సులోవున్న ఆ నవలను చదివేటప్పుడే నవలలోని పాత్రలలో కలిసిపోయి అదోరకమైన విచిత్ర మానసికస్థితిలో వుంటాం. అప్పుడు మన చుట్టుపట్లు ఏలా వున్నదీ గమనించలేం. నేను ఓమాటు "చంగిజ్ ఖాన్" అనే పుస్తకం చదువుతూ వుండగా మా పిన్నికూతురు కడపకు వెళ్తూ దారిలో వున్న మా యింటికి వచ్చిందిట. అందర్నీ పలకరించి "యిప్పుడు బస్సుకు టైం లేదుగానీ తిరిగి వచ్చేటపుడు ఓ రెండు మూడురోజులు మీ యింట్లో మకాం వేస్తాలే పిన్నీ!" అని అమ్మకి చెప్పిపోయిందట. హడావిడిలో నన్నూ పలకరించే పోయిందిట. నేను ఏదో సమాధానం గూడా యిచ్చానుట. కానీ నాకు మాత్రం పిన్నికూతురువచ్చిపోయిందని తమ్ముడు చెప్పేదాకా తెలీదు. మా పిన్ని కూతురు వచ్చి వెళ్ళిందని తమ్ముడు చెప్పాడు కాబట్టి నాకు తెలిసింది. కలలు వచ్చాయని-వస్తూన్నాయని-ఎవరూ చెప్పరు కాబట్టి మనకు వాటిని గురించి తెలియదు. కలలు అన్నీ జ్ఞాపకం వుండకపోవటానికి యిదే కారణం!

"నాకు నిన్న రాత్రి ఓకల వచ్చింది" అంటారనుకోండి. అంటే మీరు విచిత్ర మానసికావస్థలో కలలు కంటూ వుండగా మీ బుద్ధి హటాత్తుగా మేల్కొందన్నమాట అలా అర్ధజాగ్రదవస్థలో అర్ధమానసికావస్థలో వున్న కాసిని నిముషాల్లో జరిగిన సంఘటనలు సినిమా తెరమీది బొమ్మలలా మనకు జ్ఞాపకం వుంటాయి. అంచేతే కలలకు తలా తోకా కనిపించవు చాలా సందర్భాలలో! అమాంతం అరేబియా సముద్రంలో అవతరించి బంగాళాఖాతంలో పడదోసి చక్కామాయమైపోతాయి కలలు. అర్ధజాగ్రదవస్థలో అర్ధనిద్రావస్థలో వున్నంతవరకూ కలల్ని మనం చూడవచ్చు. అలా కలగాంచిన తర్వాత మనం నిద్రపోతామనుకోండి. ఎంత ఎక్కువసేపు నిద్రపోతామో అంత తక్కువగా కలల్ని గురించి మనం గుర్తుంచుకోగలం. అంటే నిద్రపోయే కొద్దీ కలల్నిగురించిన జ్ఞాపకాలు తగ్గుతూ వస్తాయన్న మాట. కల మనకు బాగాజ్ఞాపకం వుండాలంటే కలగన్న వెంటనే లేచి పుస్తకంలో రాసిపెట్టుకోవటం మంచిది. మా తమ్ముడు కలల్లో గొప్ప గొప్ప కథలు రాసి పారేస్తుంటాడుట. కానీ ఏం లాభం? తెల్లవారాక అందులో ఒకటీ జ్ఞాపకం వుండి చావదు. కల రాగానే లేచి కథరాసి పెట్టుకోవాలని వాడు చాలా అవస్థపడ్డాడు కానీ ఎంత ప్రయత్నించినా వాడు అలా రాసుకోలేకపోయాడు. అంచేతే పాపం వాడి కథలకు కలల్లోనే ఎక్కువ గిరాకీ తగుల్తోంది కానీ వాస్తవిక జగత్తులో కాదు. ★

# ★ వంటలు ★

## బూడిద గుమ్మడికాయతో హల్వా

వేసవి నాలుగు మాసములూ చల్లని ప్రదేశము, చలువనిచ్చు ఆహారము చాల ముఖ్యము. నిమ్మషర్‌బత్, చలువ పదార్థములతో కూడిన హల్వాలు తయారు చేసుకోవలెను. మరి మనము బూడిదిగుమ్మడి కాయతో హల్వా తయారుచేద్దాం! బూడిది గుమ్మడికాయ చలువకదూ!

కావలసిన సామగ్రి: 1 బూడిది గుమ్మడి కాయ (మరీపెద్దది మరీచిన్నది కాక మధ్య రకం) 1 వీశ. పంచదార, ½ వీశ. మంచి నెయ్యి, జీడిపప్పు, యాలకులు, కిస్‌మిస్, బాదమ్‌పప్పు, చారపప్పు ఎవరి ఇష్టము వచ్చినంత వారు వేసుకోనవచ్చును.

చేయుపద్ధతి:—గుమ్మడి కాయ బూడిద రంగు పట్టిన తరువాత మాఘమాసములో కోసిన కాయ అయితే హల్వాకు బాగుంటుంది. లేకపోతే కాయలో నీరులేక చెడి పోతుంది. కాయమాత్రము తాజాగా మెత్త బడకుండా, నీరుగలదిగా నుండవలెను. దీనికి టైమ్ చాల పడుతుంది కనుక ఉదయము 10 గంటలకు మొదలుపెడితే బాగుండును. కాయ చిన్న-చిన్న ముక్కలుగా కోసుకొని గింజలుతీసి ఒక కళాయి పాత్రలో వేయాలి. గింజలు పూర్తిగాతీసిన తరువాత ఒక్కొక్క ముక్కనూ ఎండు కొబ్బరి కోరు పేటతో కోరుకోవాలి. గింజలు, పొట్టు మాత్రము పడకుండ జాగ్రత్తపడవలెను. కోరటము పూర్తి అయిన తరువాత నీరు పోవునట్లు కొంచెము కొంచెము గుజ్జును బట్టలోపెట్టి గింజలున్న పాత్రలోకి నీరు పిండుకోవాలి. అంటే గుజ్జులో ఏమాత్రము నీరున్న హల్వా త్వరగా బూజుపడ్తుంది. పిండిన గుజ్జును వేరుగానుంచి నీరును గింజలు లేకుండ వడపోసుకోవాలి. ఇది ముగించేసరికి కనీసం 2 గంటలైన పడుతుంది. భోజనాదులు ముగించి కొంచెము రెస్ట్ తీసుకొని రెండు గంటలప్పుడు చేయటము మొదలుపెట్టాలి.

పొయ్యిమీద శేరున్నర ఉడికే గిన్నె అంటే పెద్దగిన్నె పెట్టి పదిపలాలు నెయ్యి వేసి కరిగి తరువాత సగము ముద్ద అనగా నీరు పిండిన కోరు వేసి గోధుమరంగు వచ్చు వరకు వేపాలి. వేగిన తరువాత తీసి, మిగతా నెయ్యివేసి మిగతాగుజ్జును పై విధముగా మాడకుండా వేపుకోవాలి. గుజ్జుఅంతా వేపిన తరువాత కాయలో వెళ్ళిన నీరును బాగుగా సగముగువరకు మరగించాలి. బాగా మరిగిన తరువాత పంచదార పోసి కరిగిన వెంటనే వేపిన ముదవేయాలి ఇది బాగా ఉడికించాలి. బాగ ఉడికి గరిటజారుగా అయిన తరువాత యాలకులు మొదలగునవి వేసి కలిపి దింపి కళాయి పళ్ళెములో పోయాలి. పూర్తిగా చల్లారిన తరువాత సీసాలో పెట్టుకుని మూత పెట్టవలెను. నెయ్యి చాలపడ్తుంది కావున రెండు మూడు నెలలైనా బాగా వుంటుంది. ఈ కాలములో జజారులలో తయారుచేసిన హల్వా అమ్ముతారు. పావు శేరుకు రెండు మూడు రూపాయలైన చెప్తారు. 5 రూపాయ లైతే మనకు ఐదు ఆరు పావుశేర్లు తూకం హల్వా తయారౌతుంది. ఇది గట్టిగ లేక స్పూన్‌తో తినుటకు అనువుగా నుండును.

గమనిక:—వేడిమీద వుంటుంది కావున వండుపాత్ర కళాయిది కాకపోయినా పర్వాలేదు. మంట బాగాపెట్టి ఎప్పుడు కలుపుతూ వుండాలి. కోరునప్పుడు, నీరు పోయుపాత్ర మాత్రం కళాయిదై వుండవలెను. ఎందుకనగా కాయ పులుపైన పదార్థము. మరో విషయము గుర్తుంచుకోండి వేడిశరీరమువారికి ఇది చాలా అనువుగా వుండి పనిచేస్తుంది. చలువు శరీరము వారికి కొంచెము జలుబు చేస్తుంది. ఉదయము పరగడుపున లేక మధ్యాహ్నము రెండు మూడు గంటల మధ్యన వాడుకుంటేచాలు. బాగుంటుంది. మందుకన్న బాగపనిచేస్తుంది. ఇది రోజు ఒక 'టేబుల్ స్పూన్' తింటే కాయ మంచిదిగా చూసుకోక, నెయ్యి తక్కువ వేసి చెడి పోయింది అనవద్దు. మరి చేసి చూస్తారు కదూ!

ఎం. ఇందిరాదేవి, (మద్దూరు)



## రకరకాల వడియాలు

శివరాత్రికి "శివశివా" అంటూ శీతాకాలం గడిచిపోయింది. వేసవికాలం వచ్చింది. ఈ వేసవికాలంలో ప్రతిఇంట్లో అప్పడాలు వడియాలు యేడాదిపొడుక్కూ సరిపోయేటన్ని పెట్టుకుంటారు. ఎందుకంటే—ఈ వేసవికాలంలో పెట్టుకుంటే అప్పడాలు, వడియాలు తీవ్రమైన ఎండలకు గలగల ఎండి యేటిపొడుగునా పురుగుపట్టకుండ చక్కగా నిలవవుంటాయి. ఇంటికి అతిథులువస్తే అప్పడం, వడియం లేకుండ యే గృహిణి భోజనం పెట్టటానికి ఇష్టపడదు. ఏ ఊరా లేనపుడు కష్టమూ ఉండదు. అసలుఈ రెండు లేకపోతే ఏమిటో వెలితిగా వుంటుంది. ఈ వడియాలకు మినప్పప్పు, పెసరపప్పు, బియ్యం, సగ్గుబియ్యం, శనగపిండి, గోధుమ పిండి—వీటితో రకరకాలుగా పెట్టుకోవచ్చు. మినప్పప్పు, సగ్గుబియ్యం, బియ్యపిండి—వీటితో వడియాలు సర్వసాధారణంగా అన్నిచోట్ల పెట్టుకుంటుంటారు. కనుక నేను పెసరపప్పు, గోధుమపిండి, బియ్యంనూక—వీటితో వడియాలు మా యింట్లో పెట్టేవిధంగా చెప్తాను. పెట్టుకోటానికి ప్రయత్నిస్తారుగదూ!

### పెసరపప్పు వడియాలు

కావలసిన వస్తువులు: శేరు పొట్టుపెసర పప్పు, రెండు సవాసేర్లు పచ్చిమిరపకాయలు, రెండుసవాసేర్లు వుల్లిపాయలు, రెండు టీస్పూను పసుపు, తగినంత వుప్పు.

రేపు వడియాలు పెట్టుకుంటామనగా, క్రిందటిరోజు రాత్రి శేరు పెసరపప్పును నీళ్ళల్లో నానపోయాలి. మరుచటిరోజు వుదయాన్ని పప్పులో పొట్టుతీసి, చిల్లుల పళ్ళెంలో కాని, బుట్టలోగాని, నీళ్ళన్నీ ఓడిపోయేట్లు వడేయాలి. తర్వాత రోలు శుభ్రంగాకడిగి, పప్పును రోట్లోపోసి మెత్తగా గారెలపిండి మాదిరిగా రుబ్బాలి. రుబ్బేటప్పుడు ఏమాత్రం నీళ్ళు పోయగూడదు. నీళ్లుపోస్తే వడియాలు సరిగ్గారాక బట్టకు అతుక్కుపోతాయి) పిండి రుబ్బినపిమ్మట పచ్చిమిరపకాయలు, వుప్పు అదేరోట్లో మెత్తగా నూరుకోవాలి. ఇప్పుడు వుల్లిపాయలు పొట్టుతీసి సన్నగా ముక్కలు తరుక్కొని, ఈ ముక్కలను, పచ్చిమిర్చి కారాన్ని, పసుపును, పిండిలోవేసి బాగా కలపాలి. తర్వాత శుభ్రమైన తెల్లటిబట్ట తీసుకొని తడిపి, గట్టిగా నీళ్లు లేకుండ పిండి, మంచంమీదగాని, బండలమీదగాని పరిచి, పిండిని చేత్తో చిన్న-చిన్న ముద్దలుగా బట్టపైనపెట్టి, రెండురోజులు ఎండనిచ్చి, ఒలిచి, డబ్బాలోగాని, సీసాలోగాని పోసుకొని నిల్వవుంచుకోవాలి. వీటిని వేతిలోగాని, డాల్డాలోగాని, పప్పు

# వనితా వాణి



జి. కె. విజయలక్ష్మిగారు వ్రాసిన సమాధానం దొరకని ప్రశ్న అనే వ్యాసం చాలా బాగుంది. వారితో నేను యేకీభవిస్తున్నాను.

శ్రీమతి భానుమతిగారు వ్రాసిన అత్తా తోడికోడలీయం చాలా బాగుంది వారికి నా ధన్యవాదాలు.

ఎస్. పార్వతీకుమారి. (నెల్లూరు)

* * *

ఉగాదిసంచికలో సినీతార భానుమతి గారు వ్రాసిన "అత్తా తోటికోడలీయం" అనువ్యాసం చాల బాగుంది.

రచయిత్రికి వనితావాణి ద్వారా నా అభినందనలు తెల్పుచున్నాను.

ఎ. యస్. కుమారి. (కాకినాడ)

"అత్తా తోడికోడలీయం చదివితిని బాగుగా నున్నది.

కె. ఎస్. ఎన్. శేషారత్నం, (పల్లిపాలెం)

* * *

బోయిన సుశీలగారు వ్రాసిన "ఆ! ఆ మాత్రం రాయడానికేం" అనే వ్యాసం చాలా బాగున్నది. సుశీలగారు ముచ్చటగా మూడు అంచెలలో చెప్పదలచిన విషయము చక్కగా వ్రాశారు. అందులకు వారికి నా అభివందనములు.

సంవత్సరాది.సంచిక చదివితిని. భానుమతి రామకృష్ణ వ్యాసం చాలా బాగుంది. వారికి నా అభివందనములు.

శారద. (విజయవాడ)

* * *

(శ్రీమతి వారణాసి సుబ్బలక్ష్మిగారు అదిలాబాదు) వ్రాసిన ఓ యమ్మ నీకు మారుడు వ్యాసమును చదివితిని. నా మనస్సును బాగుగా ఆకర్షించినది.

వి. అప్పారావు (తుని)

* * *

మార్చి 27,28,29 తేదీలలో బిలాస్‌పూర్‌లో ఆంధ్ర సమాజం వార్షికోత్సవాలు వైభవంగా జరిగాయి. మొదటిరోజు మహిళా సంఘ సభ్యులు నాటకములు, నృత్యములు ప్రదర్శించబడినవి. మహిళలందరూ అమితోత్సాహముతో పాల్గొనిరి. తొలిప్రయత్నమైనను కేవలము స్త్రీలే అన్నిపాత్రలను విజయవంతముగా నిర్వహించి ప్రేక్షకుల మన్ననల నందుకొనిరి. 29వ తేదిన జరిగిన వుత్సవములలోకూడ నృత్యములు, ఫ్యాన్సీడ్రెస్‌లు, సంగీత, వ్యాసరచన పోటీలలో పాల్గొని ప్రేక్షకుల ప్రశంస పొందినారు. వీటిలో పాల్గొన్న వారందరికి శ్రీమతి విమలా వెంక్రటామయ్యగారు బహుమతులు పంచిపెట్టారు. మహిళామండలి కార్యదర్శిని శ్రీమతి కర్రి కమలగారు వందన సమర్పణ చేశారు.

(ఎం. లక్ష్మి, మహిళామండలి సభ్యురాలు)
బిలాస్ పూర్,

---

నూనెలోగాని వేయించుకొని, అన్నంలో కలుపుకొని తింటే భలే బాగుంటాయి. వట్టివే వేయించుకొనితిన్నా కరకర లాడుతూ పకోడీల్లా కమ్మగా వుంటాయి.

### బియ్యపు నూకతో

సన్నటి బియ్యపునూక ఒకసోల. నీళ్ళు మూడుసోలలు, తగినంతవుప్పు, అర్ధసవాసేరు పచ్చిమిరపకాయలు.

రెండురోజులకు వడియాలు పెట్టుకుంటామనగా, బియ్యము కడిగి ఆరబోసి సన్నగా నూకవిసురుకొని, సోలెడు నూక తయారుగా వుంచుకోవాలి. కుంపటిమీద వెడల్పాటి మూతిగల గిన్నెబెట్టి, మూడు సోలల నీళ్ళు పోసి బాగా తెర్లనివ్వాలి. నీళ్ళు తెర్లినతర్వాత నూకపోసి, వుండలు కట్టకుండ, గట్టిగవుండేదాకా గరిటతో కలపాలి వుడికిన తర్వాత క్రిందకిదించి పచ్చిమిరకాయలు, వుప్పు మెత్తగా నూరి, పిండిలోవేసి గరిటతో బాగా కలిపి, చల్లారనివ్వాలి. తర్వాత బండలపై తడిబట్టపరిచి, కొరపువ్వాస గిద్దలతో, చక్కిలాల గిద్దలతోవత్తి, రెండురోజులు ఎండనిచ్చి, ఒలిచి. సీసాలో నిలవ వుంచుకోవాలి. ఇవి నేతిలో వేయిస్తే బాగా పొంగి, తెల్లగా, తినేందుకు రుచిగా వుంటాయి.మధ్యాహ్నం కాఫీలప్పుడు, ఎవరైనా ఫ్రెండ్సు) వస్తే, స్వీటుతోపాటు ఇవి వేయించి టోస్ట్‌గా పెట్టవచ్చు.

### గోధుమతో

కావలసిన వస్తువులు . శేరు గోధుమపిండి, అరవీశ వుల్లిపాయలు, సవాసేరు పచ్చిమిరపకాయలు, రెండు టేస్పూన్లు పసుపు, తగినంత వుప్పు.

శేరు గోధుమపిండిని పలపల కాగే నీళ్లుపోసి పకోడీల పిండిలాగ కలపాలి. తర్వాత వుల్లిపాయలు,పచ్చిమిరపకాయలు ముక్కలు తరుక్కొని, ఈ ముక్కలు, వుప్పు, పసుపు, పిండిలో వేసి కలిపి, బండలమీద తడిబట్ట పరిచి చేతో చిన్నచిన్న ముద్దలుగాపెట్టాలి. వీటిని రెండు రోజులు ఎండనిచ్చి, ఒలిచి, నూనెలోగాని, నేతిలోగాని వేయించుకు తింటే, కరకరలాడుతూ, పకోడీల్లా వుంటాయి బుడుగులాటి అబ్బాయి ఒక్కడుంటే చాలు. ఈ వడియాలు ఎన్ని వేయించినా ఇట్టే అయిపోతాయ్, తల్లికి ఒక్కటయినా మిగలకుండ !!

జి. లీలావతి, (వేటపాలెం)

# ★ శ్రీ సీతా కల్యాణం ★

(34 వ పేజీ తరువాయి)

దశరథమహారాజుకు జనకుడి శుభవర్తమానం అందజేయబోయిన దూతలు మూడు పగళ్ళు హుటాహుటిగా ప్రయాణం చేసి అయోధ్య చేరుకొన్నారు. చేరిన వెంటనే రాజదర్శనం సంపాదించారు

తేజస్వి అయిన చక్రవర్తినిచూచి అంజలి ఘటించి తమను పరిచయం చేసుకొన్నారు. ఆ స్నేహమయుడి ప్రియవాక్కులు విని ధైర్యం తెచ్చుకొని మాట్లాడారు. రామలక్ష్మణుల క్షేమం తెలిపారు. శివచాపఖండనోదంతాన్ని విన్నవించారు. జనక మహర్షి హృదయాన్ని, కల్యాణ సంకల్పాన్ని నివేదించారు.

దశరథమహారాజు సంతోషంతో ఉప్పొంగిపోయాడు. తమ ఉపాధ్యాయులు వసిష్ఠవామదేవుల ఆమోదంతో, మర్నాడే మిథిలకు ప్రయాణం కావాలని నిశ్చయించాడు.

ధనకనవస్తువాహనాలతో ప్రయాణానికి సర్వం సిద్ధమైంది. వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, దీర్ఘాయుష్మంతుడు మార్కండేయుడు, కాత్యాయనుడు మొదలగువారు ముందు నడువగా దశరథ మహారాజు భరతశత్రుఘ్నులతో, భార్యలతో ఇతర బంధుమిత్రులతో నాలుగు పగళ్లు ప్రయాణంచేసి మిథిలాపురి చేరుకొన్నాడు.

ఈ సప్తాహాలూ రామలక్ష్మణులు పుణ్యకథా శ్రవణంతో, శ్రుతకథా పునశ్చరణంతో కాలక్షేపం చేశారు. విశ్వామిత్రుడివెంట నిత్యమూ యాగశాలకు వెళ్ళి అక్కడికి వచ్చిన ఋషులను దర్శించి సద్గోష్ఠి నెరపారు. విడిదిలో ఉన్నపుడు, సిద్ధాశ్రమం నుండి తాము మిథిలకు సాగించిన ప్రయాణంలో రాత్రివేళల విశ్వామిత్ర మహర్షి చెప్పిన గాథను—కుశవంశీయులకథ, గంగావతరణం, కుమారసంభవం, సాగరచరితం, సముద్రమథనం మొదలైనవాటిని చర్చించి లోకవృత్తాన్ని అతిలోక వృత్తాన్ని ఆకళింపు చేసుకొన్నారు.

దానవులను సంహరించి సాధుజనులను సంరక్షించడానికి శ్రీమహావిష్ణువు ఎత్తిన అవతారాల కథలు చెప్పుకొన్నారు.



అక్కడ జనకరాజు అంతఃపురంలో కూడా ఈ యేడురోజులూ పుణ్యకథలే వినిపించాయి. అక్కడ పుణ్యకథా నాయకుడు ఒకడే. పురుషోత్తముడు రాముడు. చెలులూ చెల్లెళ్ళూ కూడా జానకికి ముప్పొద్దులా రామకథలే చెప్పారు. చెప్పినకొద్దీ ఊరేవి; ఊరినకొద్దీ ఊరించేవి.

* * *

దశరథ మహారాజు వస్తున్నాడన్న వార్త రాగానే జనకుడు ఉపాధ్యాయ, మంత్రి, పరివార సమేతుడై కాబోయే వియ్యంకుడు అయోధ్యానగర చక్రవర్తికి ఎదురేగి స్వాగతం చెప్పాడు. వారందరినీ యజ్ఞశాలకు తీసుకు వచ్చి మర్యాదలు చేశాడు.

"ఓ రాజా! తాము మా భూమికి రావడము నా భాగ్యము. వసిష్ఠాది మహర్షులంతా కూడా ఈ శుభకార్య సందర్భంగానైనా ఇటు రావడము నా సుకృత ఫలమునే తలుస్తున్నాను. ఓ రాజా! రామచంద్రుడి పరాక్రమ విభవం తామూ మేమూకూడా గర్వించవలసినది. రఘువంశము వారితో ఈవిధంగా మేము వియ్యమాడుతున్నందువల్ల మావంశ ప్రతిష్ఠ ఇనుమడిస్తున్నది. రేపు యాగం సమాప్తంకాగానే, వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షుల ఆశీర్వచనంతో తమ ఆమోదంతో సీతారాముల కల్యాణం జరిపించవలెనని సంకల్పించాను" అన్నాడు జనకుడు.

దశరథుడు మహదానందహాసం చేశాడు.

"రాజర్షి! ఇపుడు దాతలు తాము. అందువల్ల దానము మీ సంకల్పం ప్రకారం ఉంటుంది. తాము ఏమిఇస్తామన్నా ఎప్పుడు ఇస్తామన్నా, అందుకోవడమే మావంతు" అన్నడాయన.

ఈ ప్రియ వచనానికి జనకరాజర్షి, అక్కడి పెద్దలూ అంతా ఎంతో సంతోషించారు.

ఆరాత్రి దశరథుడు సూర్యచంద్రుల వంటి పుత్రులిద్దరినీ తనవద్ద కూర్చోబెట్టుకొని, వారి వనజీవన యాత్రా విశేషాలను గుచ్చి గుచ్చి అడిగి తెలుసుకొన్నాడు. సద్గుణ నిధి రాముడు వినమ్రతతో స్వీయ ప్రతాపాన్ని ప్రస్తావించిన సందర్భాలలో తండ్రి, తన చిన్న కుమారుడి వంక చూచేవాడు. లక్ష్మణుడు నవ్వి, ఆయా విశేషాలను, అన్నగారి ప్రజ్ఞా ప్రాభవాలను మహోత్సాహంతో వర్ణించి చెప్పేవాడు.

ఈవిధంగా ఆ రాత్రి ఉత్సాహవంతంగా గడచిపోయింది.

* * *

మరునాడు యజ్ఞకాండ నిర్ణీతప్రకారం పూర్తికాగానే, జనకుడు సాంకాశ్య నగరములో వున్న తన తమ్ముడు కుశధ్వజుడిని పిలిపించాడు. ఆయన రాగానే ఉపాధ్యాయ సమేతుడై కొలువు తీరాడు. వివాహముహూర్తం నిర్ణయించ నిశ్చయించి అందుకై దశరథ మహారాజునూ, వసిష్ఠ, విశ్వామిత్రులనూ ఆహ్వానించవలసిందిగా తన మంత్రి సుదామనుణ్ని పంపించాడు.

పురోహితులూ, హితులూ, పుత్రులూ వెంటరాగా దశరథుడు జనక సదనానికి వెళ్లాడు. స్వాగతాది మర్యాదల అనంతరము ఇక్ష్వాకుల కులగురువు, దైవము అయిన వసిష్ఠ మహర్షి, ఇక్ష్వాకువంశ సంభవాన్ని, ఆ వంశానికీ, వారేలిన నేలకూ కూడా కీర్తి ప్రతిష్ఠలు చేకూర్చిన రాజుల రారాజుల చరిత్రను వివరించాడు.

"జనక చక్రవర్తీ! ఇక్ష్వాకు వంశీయులంతా మహా పరాక్రమవంతులు. పరమ ధార్మికులు. నీవు వీరితో వియ్యమందడం అందరికీ హర్షం కలిగిస్తుంది. ద్యుతిమంతులు ధృతిమంతులు అయిన మా రామలక్ష్మణులకు మీ రాములు సీత, ఊర్మిళలు అన్ని విధాలా ఈడూ జోడూ అయినవారు" అని వసిష్ఠ మహర్షి చెప్పాడు.

అప్పుడు జనకరాజర్షి వసిష్ఠుడికి వందనం చేసి, తనవంశం చరిత్రను విపులంగా విన్నవించాడు.

"మహర్షీ! సీత దేవకన్య. శివధనుస్సును ఎక్కుపెట్టిన మహావీరునికే ఆమెను ఇచ్చి వివాహం చేయాలన్న నా సంకల్పం నెరవేరింది. ఇపుడు తాము, నా రెండవ కుమార్తె ఊర్మిళను లక్ష్మణుడికి ఇవ్వవలెనని హితవు చెప్పారు. మీ మాటను శిరసా వహించి, మనసా ఆ ప్రకారమే ఊర్మిళా లక్ష్మణులకు కూడా వివాహం చేస్తాను." అన్నాడు జనకుడు. ఆ విధంగా చెప్పి ముహూర్త నిర్ణయానికి ఉపాధ్యాయులను సంప్రతించాడు.

చిన్న కుమారుడి వంక వాత్సల్యముతో చూస్తూన్న దశరథ మహారాజును చూచి "ఓ రాజా! తాము రామలక్ష్మణుల వివాహాలకు నాందీకార్యాలను జరిపించాలి. ఈ రోజు మఘా నక్షత్రము. ఎల్లుండి ఉత్తర ఫల్గునీ నక్షత్రం వివాహానికి శుభస్కరమైన వేళ." అన్నాడు జనకుడు.

వసిష్ఠుడూ, విశ్వామిత్రుడూ ఈ వ్యవధిలో పరస్పరం సంప్రదించుకొని ఒక తీర్మానానికి రావడం లక్ష్మణుడు గమనించాడు. వారికి తోచిన ఊహను అతడు ఊహించుకుని ఆనందించాడు. క్రీగంట రాముడివంక చూచి, 'నవ్వు ఎందుకు' అన్న అన్నగారి చూపుమాచి తలవంచుకొన్నాడు...

"నేనూ విశ్వామిత్రులూ ఆలోచించిన విషయం ఒకటి ఉంది" అంటున్నారు వసిష్ఠులవారు.

పరేంగితజ్ఞుడు జనకుడు తత్క్షణం తన

తమ్ముడు కుశధ్వజుడివంక సాభిప్రాయంగా చూచాడు.

"జనక రాజా. నీ సోదరుడు కుశధ్వజుడు వీరుడు. ధార్మికుడు. ఆయన కూడా, మీతో పాటుగా రఘువంశీయులతో వియ్యమాడడం అన్ని విధాలా సమంజసమైనది. కుశధ్వజుడి కుమార్తెలు మాండవీ శ్రుతకీర్తులు ఇద్దరూ అసమాన లావణ్యాలు. రామానుజులైన భరత శత్రుఘ్నులు ఇద్దరూ పరాక్రమశాలులు. తేజో వంతులు. వీరికి అన్ని విధాలా యోగ్యులైన వరులు. వీరిని వారికి వరిస్తున్నాము. దిక్పాల కులవంటి దాశరథులు నలుగురికీ మీ అన్న దమ్ములిద్దరూ మీ మీ కుమార్తెలను ఇచ్చి వివాహంచేసి మీ రెండు వంశాలవారు బాంధవ్యం కలుపుకోవడం శుభప్రదం" అన్నాడు వసిష్ఠుడు.

జనక మహారాజు, కుశధ్వజుడూ ఈ విషయం ఆలోచించి, వెంటనే ఆమోదించారు.

మహర్షులకు అంజలి ఘటించారు. "మీ ఆజ్ఞ మాకు కల్యాణ ప్రదమైనది. సంతోషంగా మేము శిరసా వహిస్తున్నాము. ఎల్లుండి ఉత్తర ఫల్గునీ నక్షత్రం. ఒక్క ముహూర్తంలోనే నలుగురి వివాహాలూ జరగాలని మేముకోరుతున్నాము" అన్నారు.

వసిష్ఠ విశ్వామిత్రులూ, శతనందాది విప్రవరులూ ఈ వాక్యాన్ని ఆమోదించారు. లోకోత్తరమైన ఈ కల్యాణ సంకల్పాన్ని శ్లాఘించారు.

* * *

జనక మహారాజు, కల్యాణ వార్తను తెలుపుతూ శుభ పత్రికలు నలుమూలలకూ పంపాడు. దేశం నలుదిశలా ఈ వార్త ప్రకటించేయించాడు. పౌర్ణమినాటి సముద్రంలా దేశంలో ఉత్సాహం పొంగి పరవళ్ళు తొక్కింది. వెన్నెలలా సంతోషం వెల్లివిరిసింది. రామచంద్రుడి కీర్తిలా దశదిశలా వ్యాపించింది.

అతిశయోక్తులను అతి సామాన్య పదాల స్థాయికి దించే స్థాయిలో వాడవాడలా వీధి వీధులా అలంకరణలు బరిగాయి. మిధిలా నగరమే ఒక విశాలమైన వివాహ వేదికలా శోభాయమానంగా భాసించింది.

దశరథ మహారాజు పుత్రుల వివాహానికి నాందీకార్యమంతా శాస్త్రోక్తంగా జరిపించాడు. ఆరోగ్యవంతాలైన నాలుగు లక్షల గోవులను తెప్పించి వాటి కొమ్ములకు బంగారు తొడుగులు వేయించాడు. పాలు పిండుకోవడానికి కంచుపాత్రలు సమకూర్చి, వత్సాలు సహా, ఆ ధేనువులను, విశేషంగా ధనాన్ని దానం చేశాడు. ఉత్తరఫల్గునీ నక్షత్ర దివసోదయాన, విజయ ముహూర్తంలో పుత్రకళత్ర బంధుమిత్రులతో ఒయాలుదేరి, వసిష్ఠాది మహర్షులను ముందుంచుకొని మంగళవాద్యాలతో భేరీ తూర్యనాదాలతో జయదుందుభిధ్వానాలతో వైభవంగా జనక మహారాజు యజ్ఞవాటికకు చేరాడు. మంగళ స్నానాలాచరించి, శ్రేష్ఠ మణిభూషణాలతో అలంకరించుకొని, కల్యాణ కంకణ ధారణచేసిన రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నలుగురూ తండ్రి కిరువంకలాచేరి, బ్రహ్మదేవుడిని సేవిస్తున్న దిక్పాలకులవలె, విభవాన్ని ఇనుమడింప చేసున్న సుగుణాలవలె నిలచారు.

వసిష్ఠుడు యాగశాలలోకి వెళ్ళి, పెళ్ళి కుమారులు తరలివచ్చారనీ, దశరథమహారాజు కన్యాదాతరాకకై ఎగురుచూస్తున్నాడని జనకుని హెచ్చరిక చేశాడు.

జనక చక్రవర్తి సరసదరహాసంతో, 'ఓ పూజ్యుడా! ఇదేమి రాయబారము' అన్నాడు. "దశరథమహారాజుకు ఈ సీమలో అడ్డేమిటి? ఆయన ఒకరి అజ్ఞకోసం ఆగడమేమిటి! ఈ రాజ్యం ఆయనది కాదా. ఇంకా ఆలస్యమెందుకు. నా కన్యలు నలుగురూ, ఇరుగో అలంకృతలై, దీపకళికలవలె వేదికవద్ద కూర్చొని ఉన్నారు. వారిని వెంటనే తీసుకురండి" అన్నాడాయన.

అపుడు వసిష్ఠుడు దశరథమహారాజును, పెళ్ళికొడుకులను, ఋషులనూ, వివాహ వేదిక వద్దకు తీసుకువచ్చాడు.

పచ్చని కొబ్బరిఆకులతో వేసిన చక్కని విశాలమైన పందిరి క్రింద శాస్త్రోక్తమైన వివాహ వేదిక నిర్మించి ఉంది రంగవల్లులతో అందంగా తీర్చిదిద్ది ఉంది. గంధపుష్పాదులతో, నవాంకురాలతో అలంకరించిన బంగారూ పాలికలూ, నానావర్ణ రంజితాలు అయిన కుంభాలూ, ధూపదీపాలు అమర్చే స్తంభాలూ, శంఖాలవంటి చిత్ర విచిత్ర రూపాలలో ఉన్న కలశాలూ, ఇంకా అర్ఘ్యజలం, అక్షతలూ, పేలాలూ ఉంచిన రకరకాల పళ్ళెరాలూ ఆ వేదిక చుట్టూ అందంగా అమర్చారు, ఇవి కాక, అక్కడ కూర్చున్న మహర్షులవల్ల ఆ వేదిక తేజోవంతంగానూ, చుట్టూ చేరిన వారి ఆనందోత్సాహాలతో కల్యాణశోభాయమానంగానూ రాజిల్లింది.

జనక మహారాజు ప్రార్థన పురస్కరించుకొని వసిష్ఠుడు విశ్వామిత్ర శతానందోపాధ్యాయులను ముందుంచుకొని వివాహ కార్యం ఆరంభించాడు. వేదిక మధ్య అగ్నిహోత్రాన్ని ఏర్పరచాడు. శాస్త్రవిహితంగా దర్భలు పరచాడు. సమంత్రకంగా హోమం చేశాడు. అపుడు జనకుడు లేచి సీత వంక చూశాడు. మధుపర్కాలు ధరించి మనోజ్ఞ భూషణాలతో అలంకరించుకొన్న జానకి, వేదంలా మహద్వంతమైన, వెన్నెలవలె తెల్లనైన, ప్రియవచనం వలె మధురమైన మందహాసం చల్లగా ప్రసరిస్తూ సాక్షాన్మహాలక్ష్మిలా గోచరించింది.

సుహాసిని సీతను జనకుడు అగ్నిహోత్రం వద్దకు తీసుకువచ్చాడు. ఆ పైన రామచంద్రుడిని ఆహ్వానించాడు.

అక్కడ నీలమేఘ శ్యాముడు, రాముడు అగ్నిహోత్రకాంతులలో అద్భుతుడై గోచరించాడు. పురుషోత్తముడై ప్రకాశించాడు. సాక్షాత్పరాత్పరుడే నిలచాడనిపించాడు. ఆయనను కన్నతండ్రి దశరథుడు, కన్నెనిస్తున్న జనకుడూ, విద్య ప్రసాదించిన విశ్వామిత్రుడు, కులపతి వసిష్ఠుడూ అతని అనుంగు సోదరుడు లక్ష్మణుడూ కూడా ఆ నల్లని పెళ్ళి కొడుకులో అద్వితీయమైన తేజాన్ని దర్శించి ముహూర్త కాలంపాటు విభ్రాంతులై కర్తవ్య జ్ఞానం కోల్పోయారు. ఏకకాలంలో అత్యంత దర్శనీయుడుగానూ, సత్యంవలె దుర్నిరీక్ష్యుడుగానూ ప్రకాశించిన లోకైకవిగ్రహుడిని చూచి, చూడలేకా గ్రహించలేకా అనుభవైక వేద్యమైన ఆనంద స్థితిని అందుకున్నారు. క్షణం తరువాత, ఈ లోకోత్తరుడి లోకకల్యాణ కార్యక్రమంలో తామీ భూమికలు నిర్వహిస్తున్నామన్న తలపు రాగానే వారందరికీ శరీరాలు పులకలెత్తాయి.

* * *

కమలపత్రేక్షణుడు రాముడు మధుమధుర మందహాసం చేశాడు.

ముహూర్తం మించిపోతూందని గ్రహించి జనక మహారాజు జలకలశం పైకెత్తాడు.

"ఇయం సీతా—" అన్నాడాయన సముద్ర గంభీర స్వరంతో.

కమలలోచనాలు, పద్మదళాయితాక్షివంక చూశాయి.

జనకుని సరసత్వం లక్ష్మణునికి ఆహ్లాదం కలిగించింది. "ఇదేనయ్యా సీత నీవు సిద్ధాశ్రమంనుండి మిథిల వచ్చేదాకా, శివ ధనుర్భంగం చేసిన ముహూర్తంనుండి ఈ శుభ ఘడియదాకా, ఎప్పుడు చూస్తానని ఆరాట



**వీధి గాయకుడు**

చిత్రకారుడు : ఎమ్. రెడ్డెప్పనాయుడు

(మద్రాసు, స్కూల్ ఆఫ్ ఆర్ట్సు సీనియర్ విద్యార్థుల సంఘంవారు ఇటీవల ప్రదర్శించిన చిత్రాలలోనిది)



పడుతున్న సీత యిదేనయ్యా" అంటున్నది జనకుడి వాక్యం.

"—మమ సుతా" అన్నాడు కన్యాదాత.

'కన్య ఘనతకు ఆ ఒక్క ముక్క చాలు గదా - జనకసుత కావడం' అనుకున్నారు సదస్యులంతా.

'లక్ష్మీదేవిని శ్రీ మహావిష్ణువుకు ఇవ్వగలుగుతున్న భాగ్యశాలి' అనుకున్నారు.

జ్ఞాని జనకుడు మాత్రం తన భూమిక గురించి గురభిప్రాయపడలేదు. "మా లక్ష్మి సాక్షాత్తూ మహాలక్ష్మి. ఈమెను నీకు ఒకరివ్వడం ఏమిటి. నీవే గ్రహించాలి" అని ధ్వనించిం దాయన ఉచ్చరించిన 'పాణిం గృహ్ణీష్వ పాణినా' అన్న వాక్యార్థం; అందరి హృదయాలలోనూ

ఆపైన, మామగారుగా ఒప్పగించి, దీవించాడు. "నాయనా రామా! నా కూతురు నీకిక సహధర్మచారిణి. నీవెంట నీ నీడలా ఉంటుంది. ఈమె చేతిని పట్టుకో. నీకు శుభం అవుతుంది" అంటూ సమంత్రకంగా శ్రీరాముడి చేతిలో నీళ్లు వదలాడు జనకుడు.

మంగళవాద్యాలు మిన్నంటాయి; మింట దేవదుందుభులు మ్రోగాయి. పందిరి శుభాక్షతలు కురిసింది. ఆకాశం దివ్యాక్షతలను కురిసింది. దివీ, భువీ కూడా ఒకటై దంపతులను దీవించాయి.

లోకమంతా హర్ష పులకాంకితంఅయింది.

*          *          *

జనకుడు వెంటనే లక్ష్మణుడిని పిలిచాడు. "నాయనా లక్ష్మణా! నీకు శుభమవుతుంది. వెంటనేవచ్చి, ఇదిగో మా ఊర్మిళ చేతిని చేబట్టు...... ఓ రఘునందనా! భరతుడా. నీవుమాండవి కరాన్ని పరిగ్రహించు. మహాబాహూ! శత్రుఘ్నా నీవు శ్రుతకీర్తి హస్తాన్ని పట్టుకో. ఓ రఘుకులదీపకులారా! మీరంతా ఇపుడు అగ్నిసాక్షిగా గ్రహిస్తున్న ఈ మీ భార్యలతో సౌమ్యులై ధర్మపథం తప్పక చరించవలసింది" అన్నాడు.

శ్రీ రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నలుగురూ సీత ఊర్మిళమాండవీ శ్రుతకీర్తులచేతులు పట్టుకొని అగ్నికి, వివాహవేదికకు, చక్రవర్తులిద్దరికీ, మహర్షులందరికీ ప్రదక్షిణం చేశారు. వారికి నమస్కరించారు. పిమ్మట వేదికపై కూర్చున్నారు. తిరిగి శాస్త్రోక్తంగా కన్యాదాన, పరిగ్రహణాదికాలు జరిగాయి.

ఆ వరవధూవరులు చేతులుపట్టుకొని ముమ్మారు అగ్నికి ప్రదక్షిణంచేసి వందనమాచరించారు. మంగళాశీర్వచనఘోషతో, భువీదివీ ప్రతిధ్వనించాయి. దేవతలు పూలవాన కురిపించారు. గంధర్వులు స్పృహణీయమైన మాధుర్యాన్నంతా గానంలోకి అనువదించి భువికి దించారు. అప్సరసలు ఆనందాతిశయంతో నర్తించారు.

విజయ దుందుభులు, తూర్యనాదాలు మరొకమారు దశదిశలా మారుమ్రోగాయి.

రఘురాముడు, తన దక్షిణ హస్తంతో సీతావధూటి పాణి పల్లవాన్ని మృదువుగా అదిమాడు.

ఆపరమకల్యాణి మందహాసం సిగ్గుదొంతరలలో అందంగా కలసిపోయింది. సీతారాముల మధ్య ఆక్షణార్థంలో జరిగిన ఈ రహస్య మధురసరాగవృత్తం, నేటికీ వధూవరకర కమలాలలో పునఃపునరావృతం అవుతునే ఉంది. లోకమంతటా పాణిగ్రహణ మధుర క్షణాల వేళ వధూవరులంతా సీతారాముల ఈఅనురాగాన్ని ప్రస్తరిస్తూవారిని స్మరిస్తూ తరిస్తూ ఉన్నారు. ★

—సి. వి. విజయలక్ష్మి

## ఎవరు గొప్ప?

భారతంలో మొదటి రెండున్నర పర్వాలమీద ఈగవాలనివ్వని ఒక కవికీ, చివరి పదిహేను పర్వాలను చివరినుంచి మొదటికి అప్పచెప్పగల ఇంకో కవికీ ఒకసారి రాయలవారి ఆస్థానంలో పెద్ద మాట్లాట జరిగింది.

"నన్నయగారి గొప్పదనాన్ని నా చేతికర్రతో నిరూపించగలను" అన్నాడు మొదటాయన.

"ఆ చేతికర్రతోనే తిక్కనగారి గొప్పదనాన్ని ఋజువు చేస్తాను" అన్నాడు రెండో కవి.

రాయలవారు ఆ కవులిద్దర్నీ విడదీసి పెద్దనగార్ని అడిగారు తీర్పు చెప్పమని. పెద్దనగారు చిరునవ్వు నవ్వుతూ "ఏం చెప్పగలను? నేను ఉభయ కవి మిత్రుణ్ణి" అన్నారు.



# సినిమా

## వార్తావరణం

"జల్ దీప్" అనేది, బాల చలన చిత్రాభిమానులు చాలకాలం ఎదురుచూసి విసుగెత్తి ఆశ వదులుకొన్న చిత్రాలలో ఒకటి. బాల చలనచిత్ర సంస్థ పనుపు కిదార్ శర్మ ఈ చిత్రం తీశారు. ఇది విదేశాలు కూడా వెళ్ళి వచ్చిందన్నారు ఆ మధ్య.

ఇన్నాళ్ళకి, మనకి సంబంధించినంత వరకూ ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సౌజన్యం ద్వారా తెలుగులో ఈ చిత్రం విడుదల కాబోతోంది. ఆంధ్ర ప్రభుత్వం ఈ చిత్రాన్ని తెలుగులోకి అనువదింపచేశారు. ఈ కార్యాన్ని దక్షిణ భారత సినీ టెక్నిషియక్ల సంఘానికి ఒప్పగించారు. వారి పనుపున ప్రసిద్ధ నటుడు ముదిగొండ లింగమూర్తిగారు ఈ అనువాద కార్యక్రమాన్ని, దీనికి తిరిగి సంగీతం సమకూర్చి రికార్డు చేయించడంవంటి ఇతర కార్యాలను నిర్వహించి, నెలా పదిహేను రోజులలో పని ముగించారు. గతవారం ఉగాది పండుగనాడు ఉదయం మద్రాసు సన్ థియేటర్‌లో ప్రదర్శించారు. ఈ ప్రారంభ ప్రదర్శనానికి లింగమూర్తిగారు నగరంలోని నాలుగైదు వందలమంది తెలుగు బాల బాలికలను ప్రత్యేకం తీసుకువచ్చారు. ఆ పైన ఆంధ్ర ప్రదేశ్ ఆర్థికమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గారినీ, మద్రాసు రెవెన్యూమంత్రి శ్రీ మాణిక్యవేల్ గారినీ ఆహ్వానించారు.

పిల్లలూ, పెద్దలూ కూడా ఈ చిత్రాన్ని చూసి ఆనందించారు. ప్రదర్శనం తరువాత, లింగమూర్తిగారినీ, ఇందులో పాల్గొన్న పాత్రధారులనూ, సంగీత దర్శకుడినీ అభినందించారు.

కేంద్ర బాల చలనచిత్ర సంస్థ ప్రతినిధి కె. సుబ్రహ్మణ్యం ఈ సభకు అధ్యక్షత వహించారు. ఆంధ్రప్రభుత్వంవారు హైదరాబాద్ నగరం పిల్లలకోసం ఒక థియేటరు కట్టించాలని సుబ్రహ్మణ్యం బాలచిత్రసంస్థ తరఫున విజ్ఞప్తిచేశారు.

బ్రహ్మానందరెడ్డి లింగమూర్తిని అభినందించి పూలమాలవేసి సత్కరించారు. ఈ చిత్రాన్ని పురస్కరించుకొని, ప్రభుత్వం మున్ముందు పిల్లలకి మంచి చిత్రాలు తీయడానికి దోహదంచేస్తుందని మంత్రి చెప్పారు.

* * *

శారదావారి "జయభేరి" లో అంజలీదేవి, రేలంగి, రమణారెడ్డి, బాల, సుశీల.





పద్మశ్రీ వారి "జగన్నాటకం" చిత్రంలో కృష్ణకుమారి.

# వార్తావరణం

లలితకళా వికాసానికై ఆంధ్రప్రభుత్వం తలపెట్టిన మరొక అభినందనీయ సత్కార్యం రాజధానీ నగరంలో విశాలమైన నాటక ప్రదర్శనమందిరం నిర్మించడం. దీనికోసం శాసన మండలి సభ్యుడు బి. ఎన్. రెడ్డి ప్రభృతుల సహకారంతో పథకం తయారవుతోంది. ఇందుకై ఈ యేడాది బడ్జెట్‌లో విద్యాశాఖ పద్దుక్రింద ప్రభుత్వం కొంత సొమ్మును కేటాయించడం కూడా జరిగింది.

* * *

చలనచిత్ర కళాకారులను ఈ యేడాది ఉగాది, అనేకవిధాల సంతోషపెట్టింది. ఈ ఏప్రిల్ నెలఅంతా ఒక సుదీర్ఘ బహుమతి ప్రదానోత్సవంగా సాగిపోతుంది. ఇందరు కళాకారులు దాదాపు ఒకేసారిగా ప్రజల అభినందలూ బహుమతులూ అందుకోవడం అరుదు.

జయంతివారి 'పెళ్ళినాటి ప్రమాణాలు' రాష్ట్రపతి రజతపతకొన్ని అందుకుంటోంది. మద్రాసు చలనచిత్రాభిమానుల సంఘంవారు కూడా దీన్ని ఉత్తమ చిత్రంగా ఎన్నిక చేశారు. ఈ చిత్రానికి కథ వ్రాసిన పింగళి నాగేంద్రరావుగారిని ఈ సంఘం ఉత్తమ కథారచనకు సత్కరించబోతోంది. నాగేంద్రరావుగారికి ఈ నెలలోనే విజయనగరం రాఘవ నాటకోత్సవాలలో సన్మానం జరుగుతోంది. ఫిలిం ఫాన్స్ సంఘంవారు ఈ సంవత్సరం తెలుగులో ఉత్తమ నటుడుగా ఎన్. టి. రామారావును ఎన్నిక చేశారు. భూకైలాస్ చిత్రంలో బహుధా ప్రశంసలందుకొన్న రావణ పాత్రధారణకు రామారావును ఎన్నిక చేశారు.

ఆంధ్ర సినీ ప్రేక్షక సంఘం ఆధ్వర్యాన, తెలుగు ఫిలిం జర్నలిస్టుల సంఘం ఆధ్వర్యాన జరిగిన రెండు బాలట్‌లలోనూ, సామ్యం ఉన్న అంశాలన్నిటా ఫలితాలు ఒకేవిధంగా రావడం అందరికీ సంతోషం కలిగించింది. ఉత్తమ చిత్రంగా మంచిమనసుకు మంచి రోజులు, దర్శకుడుగా కె. వి. రెడ్డి, నటులుగా ఎ. నాగేశ్వరరావు, అంజలీదేవి, హాస్య నటుడుగా రేలంగి ఎన్నిక అయ్యారు. వీటి బహుమతి ప్రదానాలు త్వరలోనే జరుగగలవని తెలుస్తుంది. ప్రభుత్వ బహుమతి ప్రదానాలుమటుకు ఏప్రిల్ ఆఖరువారంలో జరుగుతాయి.

* * *

1958 వ సంవత్సరపు తెలుగుచిత్రాలలో ఉత్తమ చిత్రాన్ని, వాటిలో పాల్గొన్న



'కూతురు కాపురం'లో సూర్యకళ, రమణారెడ్డి, కుటుంబరావు.

వారిలో ఉత్తమ కళాకారులను, టెక్నీషియన్‌లను ఎన్నికచేయడానికై ఆంగ్రఫిలిం జర్నలిస్టుల సంఘం (మద్రాసు) నిర్వహించిన బాలట్‌లో ఈ క్రిందిఫలితాలు వచ్చినట్లు సంఘం కార్యదర్శి బి. వి. నరసింహారావు ప్రకటించారు.

ఉత్తమ చిత్రం: శ్రీ ప్రొడక్షన్స్‌వారి "మంచిమనసుకు మంచిరోజులు".

ఉత్తమ దర్శకుడు: కె. వి. రెడ్డి.

నటుడు అక్కినేని నాగేశ్వరరావు, నటి అంజలీదేవి, హాస్యనటుడు రేలంగి వెంకటరామయ్య, 'దుష్టపాత్ర నటన' ఆర్. నాగేశ్వరరావు.

రచయిత: ఆత్రేయ, ఛాయాగ్రహణ దర్శకుడు కమల్‌ఘోష్. సంగీత దర్శకుడు సాలూరు రాజేశ్వరరావు.

ఏటేటా ఉత్తమ చలన-చిత్రాలను, కళాకారులను ఎన్నికచేసి సత్కరిస్తున్న మద్రాసు చలనచిత్రాభిమానుల సంఘంవారు ఈ యేడాది తెలుగులో జయంతీవారి 'పెళ్ళినాటి ప్రమాణాలు'ను ఉత్తమ చిత్రంగాను, 'భూకైలాస్' చిత్రంలో రావణపాత్ర ధరించిన ఎన్. టి. రామారావును ఉత్తమ నటుడుగాను ఎన్నికచేశారు. తమిళంలో శివాజీగణేశన్ ఉత్తమనటుడుగా ఎన్నిక అయ్యాడు.

ఉగాది పండుగనాడు సాయంకాలం మైలాపూరు ఉడ్‌లాండ్స్ హోటలులో మద్రాసు శాసనమండలి అధ్యక్షుడు డా॥ పి. వి. చెరియన్ అధ్యక్షతన జరిగిన సభలో 19౫8 వ సంవత్సరానికి ఎన్నికచేసిన ఉత్తమ కళాకారుల పేర్లను ప్రకటించారు.

బహుమతుల వివరాలు:

ఉత్తమ చిత్రాలు: ఉత్తమ పుత్రన్ (తమిళం), పెళ్ళినాటి ప్రమాణాలు (తెలుగు), రాందీ దంగాజి (మలయాళం), స్కూల్ మాస్టర్ (కన్నడం).

నటులు: శివాజీగణేశన్ (అన్నయిన్ ఆణై చిత్రంలో నటనకు), ఎన్. టి. రామారావు (భూకైలాస్‌లో రావణుడు), సత్యన్ (మలయాళం), రాజకుమార్ (కన్నడం).

నటీమణులు: శ్రీమతులు కె. సావిత్రి (తమిళచిత్రం అన్నయిన్ ఆణైలో నటనకు), రాజసులోచన (మంచి మనసుకు మంచిరోజులు), కుమారి (మలయాళం), ఎం. వి. రాజమ్మ (స్కూల్ మాస్టర్).

హాస్య నటులు: రేలంగి వెంకటరామయ్య (ఇంటగుట్టు), తంగవేలు (ఉత్తమ పుత్రన్.)

సహాయ నటులు. టి. ఎస్. బాలయ్య



విశ్వరూపావారి 'కూతురు కాపురం'లో జమున, రాజసులోచన.



'ఇల్లరికం'లో హేమలత, జమున, గుమ్మడి.



శ్రీ కృష్ణసాయి ఫిలిమ్స్‌వారి "గాంధారి గర్వభంగం" లో ఒక సన్నివేశం.

(తేడివంద సెల్వం), ఎస్. వి. రంగారావు (పెళ్ళినాటి ప్రమాణాలు), జి. వరలక్ష్మి (తమిళ చిత్రం 'సంపూర్ణ రామాయణం' లో కైకేయి), మాలతి (అన్న-తమ్ముడు).

బాలనటి డెయిసీ ఇరానీ.

ఉత్తమ కథారచయిత: శ్రీయుతులు పింగళి నాగేంద్రరావు (పెళ్ళినాటి ప్రమాణాలు), ఎ. కె. వేలన్ (తై పిరందాల్ వళి పిరకుం).

ఛాయాగ్రహణం: జి. కె. రాము (నాడోడి మన్నన్).

వివిధ రంగాలకు చెందిన 24 గురు సభ్యులు నాలుగు భాషా సంఘాలుగా వ్యవహరించి, మొత్తం 33 చిత్రాలు చూసి, ఈ నిర్ణయాలు చేసినట్లు కార్యదర్శిని శ్రీమతి ఎల్. ఆశీర్వాదం చెప్పారు. బహుమతి నిర్ణాయక సంఘానికి మద్రాసు ప్రభుత్వ న్యాయశాఖ కార్యదర్శి ఎ. అలగిరిస్వామి అధ్యక్షత వహించారు. ఈ యేడు కొత్తగా ఏర్పరచిన బహుమతులు రెండింటినీ—ఛాయాగ్రహణానికీ, కథారచనకూ—శివాజీ గణేశన్, ఎస్. వి. రంగారావు విరాళం ఇచ్చారు. ★

## అంతర్జాతీయ బహుమతులు పొందిన భారతీయ చిత్రాలు

భారతదేశంలో తయారైన నాలుగు ఫీచర్ ఫిల్ములకు మూడు డాక్యుమెంటరీలకి 1958-59 లో అంతర్జాతీయ బహుమతులు లభించాయి. సమాచార రేడియో వ్యవహారాలమంత్రి డా॥ కేస్కర్ యీవిషయం తెలియజేశారు. వాటి వివరాలు:

### కథా చిత్రాలు

పథేర్ పాంచాలీ (బెంగాలీ) చిత్రానికి కెనడాలోని వాంకూవర్ లో జరిగిన అంతర్జాతీయ ఫిల్ము ఉత్సవంలో మొదటి బహుమతి. స్ట్రాట్‌ఫర్డ్ ఫిల్ము ఉత్సవంలో ఈ సంవత్సరపు అత్యుత్తమ ఫీచర్ ఫిల్ముగా ఫిలిం విమర్శకుల బహుమతి. జోసెఫ్ బెర్‌స్టిన్ ఆరవ వార్షికోత్సవం—న్యూయార్క్ లో 1958 లో అత్యుత్తమమైన మూడో విదేశఫిల్ముగా పేర్కొన్నారు.

దో ఆంఖే, బారాహాత్ (హిందీ)కి బెర్లిన్‌లో 8 వ అంతర్జాతీయ ఉత్సవం ఒక సాంఘిక సమస్యను చక్కగా చిత్రీకరించినందుకు ప్రత్యేక బహుమతి ఏసు దేశాలున్న అంతర్జాతీయ కేథలిక్ సినిమా బ్యూరో వారి ప్రత్యేక బహుమతి, హాలీవుడ్ ఫారిన్ ప్రెస్ అసోషియేషన్‌వారి మొదటి 'శ్యామూల్ గోల్డ్‌విన్' అంతర్జాతీయఫిల్ము ఎవార్డు 1958 ఉత్తమ విదేశ చిత్రం.

మదర్ ఇండియా (హిందీ) కి కార్లవీవారీలో 8 వ అంతర్జాతీయ ఫిల్ము ఉత్సవంలో నాయికపాత్రకు శ్రీ నర్గీస్‌కు ఉత్తమనటిగా బహుమతి

అపరాజిత (బెంగాలీ) కి అంతర్జాతీయ ఫిల్ము ఉత్సవం శాన్‌ఫ్రాన్సిస్కో లో అత్యుత్తమమైన దర్శకత్వానికిగాను శ్రీ సత్యజిత్ రాయ్‌కి వెండిపళ్ళెము, సర్టిఫికేటు.

### డాక్యుమెంటరీలు

1. స్టార్స్ మాన్ హౌస్ మేడ్ (ఇంగ్లీషు)కు అణుకేంద్రం సభ్యుల అంతర్జాతీయ గోష్ఠి—రోమ్‌లో సాంకేతిక కళావిశేషాలకు ఒక కప్పు బహుమతి.

# కాలాటోపీ, లాల్ రుమాల్

జెమినీ చిత్ర వారి సంగీత హాస్యరసప్రధాన చిత్రం 'కాలాటోపీ, లాల్ రుమాల్' గతవారం ఇంపీరియల్ సినిమాలో విడుదల అయింది. దిగులుగా జిడ్డుగా బెంగగా ఉందని ఇదరయే జనం తక్షణం ఈ చిత్రానికి వెళ్ళవచ్చు. ఉత్తరక్షణంలో అవన్నీ మరిచిపోయి హాయిగా కాసేపు కాలక్షేపం చేయవచ్చు. కడుపుబ్బ నవ్వించే సన్నివేశాలూ, హాస్యం కోసం కాస్త మితిమీరినా, అందరినీ నవ్వించగలిగే సంభాషణలూ (దేవీశర్మ) ఉన్న ఈ చిత్రంలో కాస్త అద్భుతరసం కూడా ఉంది—అది రెండోరకం నటులు అని అంతా అనే చంద్రశేఖర్, షకీలాలూ గొప్పగా నటించి ఆనందం కలిగించడం. బాక్సాఫీసు స్టార్ వాల్యూతో ప్రజ్ఞని కొలచే పోర—బాట మనుషులకే ఇది అద్భుతంగా కనిపిస్తుంది.

చంద్రశేఖర్ సాంఘిక ప్రేమాయణాలలో సాదారణంగా కనిపించడు. అందువల్ల ఇందులో అటే అనుభవం లేకపోయినా, నల్లటోపీ ఓటి పెట్టుకుని మాతాగ్గన్ వాయిస్తూ కులాసాగా బేఖాతరీగా తిరిగే చిన్నవాడి వేషాన్ని మనం ఆశించేటంత అందంగా హాయిగా నిర్వహించాడు. షకీలా ఇందులో మనోహరంగా ఉంది. ఆమె అందాన్ని ఛాయాగ్రహణ దర్శకుడు ప్రశంసనీయంగా స్తుతించి, వర్ణించాడు. నృత్యాలు కూడా చూడ ముచ్చటగా ఉన్నాయి. ఇతర నటులలో కె. ఎన్. సింగ్, కమల్ మెహ్రా, ఇటీవల కొన్నేళ్ళుగా వచ్చిన చిత్రాలలో స్థాయినిమించి నటించారు. అలాగే హాస్య నటుడు ఆగా, చాలాకాలానికి తొలిసారిగా మళ్ళీ స్వచ్ఛమైన, కొత్త తరహా హాస్యం సృష్టించి అలరించాడు.

సంగీత దర్శకుడు చిత్రగుప్త చేసిన పాటలు ఏడూ బాగున్నాయి. అవన్నీ హిట్ లు అవుతున్నాయి. ఇంతటి హుషారైన సంగీతం, చక్కని కథ, అమరిన ఈ చిత్రంలో కనక బాక్సాఫీసు నటులు ఉండి ఉంటే ఇది రజతోత్సవాలు చేసుకోగలదని పిస్తుంది.

వీటన్నిటినీ ఇంత చక్కగా కలిపి ఈ చిత్రాన్ని తయారుచేసిన దర్శకుడు తారా హరీష్. (లోగడ ఈయన 'డాకూ కీ లడ్కీ' అనే చిత్రం తీశాడు.) ఈ కథ చిత్రణలో, సన్నివేశాల కల్పనలో హరీష్ ప్రతిభ ప్రశంసనీయమైనది.

* * *

వరసగా మూడు చిత్రాలకు రజతోత్సవాలు జరుపుకోగలిగిన దర్శక నిర్మాత అనిపించుకునే అదృష్టం సినిమాలు అరుదు. చాలామంది ఇది అసాధ్యం అంటారు. కాని ఈ అసాధ్యాన్ని మొన్న సాధించిన అసాధ్యుడు బి. ఆర్. చోప్రా. ఈ ఘనతను సాధించిపెట్టిన చిత్రం 'సాధనా.' బొంబాయిలోని ఎయిర్ కండిషన్డ్ 'మరాఠా మందిర్'లో ఇది వరసగా 25 వారాలు నడచింది.

చోప్రా తీసిన వాటిలో హిట్ లు అయిన మిగతా రెండూ ఏక్ హీ రస్తా; నయా దౌర్.

ఈ చిత్రాలవల్ల చోప్రాకు కేవలం 'హిట్ మేకర్' అని బిరుదువచ్చి ఊరుకోలేదు; ఒక సాంఘిక ప్రయోజనంగల

## చిత్రలేఖ

ఆర్యా,

చలనచిత్ర కథలు పురాణ, జానపద, సాంఘిక పరిస్థితులకు చెందిన వైనప్పటికీ, భూత భవిష్యద్వర్తమానకాలాలకు చెందిన వైనప్పటికీ, వాటిల్లో ఏ పాత్ర చేతిలోనూ మధు పాత్ర కనిపించకుండాచేసి, యథార్థంగా కాకపోయినా కథార్థంగా అయినా మద్యనిషేధాన్ని అమోఘంగా అమలు జరిపిస్తున్నామన్న సంతోషంతో తృప్తులై సుప్తులై ఉన్న కేంద్ర ప్రభుత్వం వారిని ఇందుమూలంగా అభినందిస్తున్నాను.

—"టీటోటాలిటేరియన్" ★

2. బిజీహాండ్స్ (ఇంగ్లీషు)కు మిలాన్‌లో జరిగిన 8 వ అంతర్జాతీయ ఫిల్ము వ్యవహార ఉత్సవం మిలాన్ వారి డాక్యుమెంటరీ ఫిల్ము సెక్షను సత్కారం.

8. ఖజురాహో (ఇంగ్లీషు)కు అంతర్జాతీయ పంచమ ద్వైవార్షిక డాక్యుమెంటరీ చలనచిత్రోత్సవం (యార్క్‌టంగ్, కెనడాలో) సృజనాత్మక కళాఖండముగా గౌరవము.



ప్రసాద్ పిక్చర్స్ వారి "ఇల్లరికం"లో నాగేశ్వరరావు, గుమ్మడి, రమణారెడ్డి.

## కాలాటోపీ, లాల్‌రుమాల్

చిత్రాలు తీస్తాడనీ, కథలకు తలా తోకా ఉంటాయనీ, కథనం దర్శకుడిలాగే దర్జాగా ఠీవిగా శక్తివంతంగా ఉంటుందనీ అంతా గౌరవిస్తారు. చోప్రా పూర్వాశ్రమంలో జర్నలిస్టు. అపుడూ అతని కలంలో ధాటి ఉండేదని మిత్రులు అనేవారు. (ఇపుడు కాదు. అప్పట్లోనే.)

చోప్రా ఇపుడు రెండు చిత్రాలు తీస్తున్నాడు. వాటిలో ఒకదానికి (కానూన్) ఆయనే దర్శకత్వం వహిస్తున్నాడు.

* * *

చంద్రా మువీస్ వారు నందలాల్ జస్వంతలాల్ దర్శకత్వాన 'బహుప్రియ' అనే చిత్రం తీస్తున్నారు. రాజ్‌కపూర్, వైజయంతిమాల జానీవాకర్, ఆగా, మినూ ముంతాజ్, అమన్ మొదలగువారు ఇందులో నటిస్తున్నారు. సంగీత దర్శకులు శంకర్ జైకిషన్‌లు ఇప్పటికి మూడుపాటలు రికార్డు చేశారు. రెండు నృత్యాలూ ఒక యుగళగీతం చిత్రించడం కూడా పూర్తి అయింది. వీటిలో వైజయంతిమాల గోపీకృష్ణ కలసి చేసిన నృత్యం ఒకటి.

* * *

రణ్‌జిత్ మూవీటోన్ వారు చిరకాలానికి తిరిగి చిత్రనిర్మాణం తలపెట్టారు. నందలాల్ జస్వంతలాల్ దర్శకత్వాన వీరు తీసే చిత్రం పేరు 'అకేలీ మత్ జయో.' ఇందులో మీనాకుమారి, రాజేంద్రకుమార్ నాయికా నాయకులు. ఆగా, మినూముంతాజ్ సహనటులు. సంగీత దర్శకుడు మదన్‌మోహన్.

—టచ్‌స్టోన్.

## రాఘవ నాటకోత్సవాలు

నాట్యకళా ప్రపూర్ణుడు బళ్లారి రాఘవాచార్య సంస్మరణకై ఏర్పాటైన నాటకోత్సవాలు, విజయనగరం హౌస్‌బల్ హాలులో ఏప్రిల్ 16 నుండి 20 వరకూ జరుగుతున్నాయి. ఈ సత్సంప్రదాయం ఇక్కడ ఆరంభమై పదేళ్లయింది.

ఈ సంవత్సరం మహాసభకు విశ్వామిత్ర పట్టాభి రామారావుగారు అధ్యక్షత వహిస్తారు. ప్రసిద్ధ నటుడు నాగయ్యగారు ఉత్సవాలను ప్రారంభిస్తారు. నాటికల, నాటకాల ఏకపాత్రాభినయాల పోటీలు, నృత్య ప్రదర్శనాలూ ప్రతి రోజూ సాయంత్రం ఆరునుండి పన్నెండు వరకూ జరుగుతాయి.

నాటక, సినిమా రంగాలకు చెందిన కళాకారులనూ, సంగీత విద్వాంసులను సన్మానాలు చేస్తారు.



# పది అమెరికన్ చిత్రాలు

ప్రతి ఏడాది ఉత్తమ చలన చిత్రాలుగా పదింటిని ఎన్నుకోవడం హాలీవుడ్‌లో పరిపాటి. ఇది అంత తేలికైన పని కాదు. అనేక ఇబ్బందులు ఇందులో ఉన్నవి. విమర్శకుడు తనకు నచ్చినదానికే ఉత్తమమైనదని ముద్రవేస్తాడు.

ఈ నిర్ణయం అందరికీ నచ్చకపోవచ్చును దానిలో కొన్ని ఇబ్బందులు రేకెత్తటం, కొందరి మనస్సులు బాధపడటం తథ్యం. ఈ యేడాది చిత్రాలు.

### 'ది డిఫయంట్ వన్స్'

అన్నిటిలోకి ఉత్తమమైనది; "ది డిఫయంట్ వన్స్" చిత్రం అనకతప్పదు. అది సౌభ్రాతృత్వ సందేశం ఇచ్చే చిత్రమే గాకుండా మంచి చిత్రానికి ఉండవలసిన లక్షణాలన్నీ దానికి ఉన్నవి. తప్పించుకపోతున్న ఇద్దరు నేరస్థులు ఒకరు శ్వేతజాతీయుడు మరొకరు నీగ్రో—గాథను, 'పూర్వగాలపు పద్ధతి'గా పరిగణింపబడుతున్న నలుపు - తెలుపు ఫోటోగ్రఫీలో చూపించటం దీనికి విశేషారాన్ని చేకూరుస్తున్నది. దర్శక నిర్మాత స్టాన్లీ క్రామర్ దర్శకత్వం క్రింద టోనీ కర్టిస్, సిడ్నీ పాయిటర్ ప్రధాన భూమికలు నిర్వహించారు. "డిఫయంట్ వన్స్" చిత్రం హాలీవుడ్ చలనచిత్ర కళా రంగంలో ఒక మైలు రాయిగా చిరస్థాయిగా నిలిచి ఉంటుందనటానికి ఏ మాత్రం సందేహం లేదు.

### దిగాడెస్

పాడీ చాయెఫ్‌స్కీ సృష్టించిన "ది గాడెస్" చిత్రం కూడా చాల శక్తిమంతమైనదని చెప్పాలి, దానిలో మానవత్వం తొణికిసలాడుతుంది.

"మార్టీ" చిత్రంతో బహుళ ప్రశంసలు అందుకొన్న ఆ రచయిత మరొక అపూర్వ పాత్రను ఇందులో సృష్టించాడు. పెంపకం సరిగ్గా లేక స్వేచ్ఛాప్రవృత్తికి అలవాటు పడిన ఒక సినిమానటి జీవితాన్ని ఇందులో చక్కగా చూపించాడు. చలనచిత్ర రంగపు అపూర్వ అవకాశాలను బాగా ఉపయోగించుకొంటూ ముఖ్యపాత్ర హృదయాన్ని ఆవిష్కరించుతూ ఈ చిత్రాన్ని కడు నైపుణ్యంతో కళపేరిట ఆర్భాటాలు చేయకుండా సాఫీగా రూపొందించారు. బ్రాడ్వేలో పేరు ప్రతిష్ఠలు ఆర్జించిన కిమ్‌స్టాన్లి దీనిలో ప్రధాన భూమిక వహించి ఈ చిత్రానికి వన్నె చేకూర్చింది. ఆమెకు గయ్యాళితల్లిగా బెట్టి లౌహుండ్ కూడా అద్భుతంగా నటించింది.

### ఓల్డ్‌మాన్ అండ్‌ది సీ

మానవ ప్రవృత్తిని మహో ఉదాత్తంగా చూపుతూ ఎర్నెస్ట్ హెమింగ్వే చేసిన రచనను అనుసరించి నిర్మించిన "ది ఓల్డ్‌మాన్ అండ్ దిసీ" చిత్రాన్ని మూలంగా ఉదాత్తంగా తయారుచేశారు. ఈ చిత్రాన్ని గురించి భిన్నాభిప్రాయాలు విపరీతంగా వచ్చినప్పటికి ఒకే పాత్రపైన ఆధారపడిన ఈ కథను చలనచిత్రంగా నిర్మించటం, సాహసోపేతమైన కార్యమనటంలో సందేహం లేదు. మాతృకకు న్యాయం చేకూరుస్తూ నిర్మించిన ఈ చిత్రంలో వృద్ధుడుగా స్పెన్సర్ ట్రేసీ అద్వితీయంగా నటించాడు. కథకపాత్రకికూడా ఓజస్వంతమైన వ్యాఖ్యానం దీనికి విశిష్టత చేకూర్చాడు.

### కాట్ ఆన్ ఎ హాట్‌టిన్ రూఫ్

విభిన్న శక్తులను సమన్వయపరుస్తూ టెనెస్సీ విలియమ్స్ రచించిన "కాట్ ఆన్ ఏ హాట్‌టిన్ రూఫ్" నాటకం ఆధారంగా మూలానికి దూరంగాపోకుండా అదేపేరిట ఈ చలనచిత్రాన్ని నిర్మించారు. కర్కోటకుడివంటి ఒక వృద్ధుని మరణానికి ఎదురుచూస్తున్న దురాశాపీడిత కుటుంబపు నికృష్టకృత్యాలను చూపించే యీచిత్రం అందరి అభిరుచులకు సరిపోకపోవచ్చును. తండ్రిగా బరల్ ఐవ్స్, పరిపక్వతను చూడనిరాకరించే కుమారుడుగా పాల్ న్యూమన్, అతనిచే తిరస్కరింపబడిన భార్యగా ఎలిజబెత్ టేలర్ ప్రతిభావంతంగా నటించారు.

### సెపరేట్ టేబుల్స్

వాతావరణ సృష్టికీ, గొప్ప నటనకు పేరు పొందిన చిత్రం "సెపరేట్ టేబుల్స్" సముద్రతీరానవున్న ఒక బ్రిటిషు బోర్డింగ్ హౌస్‌లో జరిగినట్లుగా బ్రిటిషు నాటకకర్త టెరెన్సు రాటిగన్ రచించిన రెండు నాటికలను ఇందు చిత్రీకరించారు. ఆవేశాలతో బాధపడే వ్యక్తులు అవిశ్రాంతి భవనంలో పడే అగచాట్లను దానిలో చూపించారు. దానిలో ముఖ్యంగా తల్లి గయ్యాళితనానికి బాధపడుతూ, సిగ్గుతో ఏమీ చెప్పలేనియువతిగా డెబొరా కెర్, దురాశాపరురాలైన తల్లిగా గ్లాడిస్ కూపర్, పడుచువాడిగాతిరగబోయిన ముసలివాడుగా డేవిడ్ నివెన్

(64-వ పేజీ చూడండి)

## అర్ధణాకోసం

ఆ మనిషి, రోడ్డుమీద బోర్లా పడుకొని మెలికలు తిరిగి పోతూఉన్నాడు. చుట్టూ చాలా మంది చేరి చూస్తున్నారు. ఒకామె అందర్నీ తోసుకొని ముందుకు వెళ్ళింది. చూచి కోపం పట్టలేకపోయింది.

"పాపం ఆ మనిషి ఎవరో అలా బాధపడిపోతూ ఉంటే సహాయంచేయడానికి మీలో ఎవరికీ చేతులురాలేదా" అని బిగ్గరగా గర్జించింది.

ప్రేక్షకులలో ఒక్కరుకూడా నోరుమెదిపి సమాధానం చెప్పిన పాపాన పోలేదు.

ఆమె సహించలేకపోయింది. ఒక్క అంగలో మెలికలు తిరుగు తున్న మనిషిని సమీపించింది. అప్పుడప్పుడే ప్రథమ చికిత్సలో తరిఫీదుపొందిన సంగతి అందరికీ తెలిసేలా చెప్పుకొంది. ఒక్క ఎగురు ఎగిరి ఆ మనిషి వీపు మీద కూర్చుంది. ఆ నిర్భాగ్యుడికి శ్వాసవచ్చేటట్లు చేయడానికి పూనుకొంది.

దానితో ఆతడు మెలికలు తిరగడం మానివేశాడు. తలపైకి ఎత్తి వీపుమీద తిష్ఠవేసుకొన్న ఆమెతో ఇలా అన్నాడు: "ఏమమ్మోయ్, ఏమిటీకథ ? ఈ గోయిలో పడిపోయిన అర్థణా కోసం నేను వెతుకుతూ ఉంటే—నా మీద స్వారీ మొదలు పెట్టావా?"

 తెర వెల్గా 

(16-వ పేజీ తరువాయి)

చూస్తాడు? వెంటనే పదిగంటలబండికి బయలుదేరి వచ్చేశాడు. ఆ వెళ్ళిపోవటం అందరికీ ఆశ్చర్యాన్ని, ఇద్దరికి బాధనీ కల్గించింది.

* * *

"ప్రాయశ్చిత్తం"కథ అచ్చుపడింది.మాలతి ఆకథ చదవాలి. ప్రతికథలోని పాత్రల గురించి చర్చించినట్లు ఈ కథకూడా చర్చనీయాంశం కావాలి. మాటల్లో తను నిజం ఒప్పుకోవాలి. అందులో తనుచేసిన అన్యాయాన్ని కడిగేసుకోవాలి.

రెండురోజులైంది. మూడురోజులైంది. మాలతి దాన్ని గురించే ప్రస్తావించదు. అచ్చయిన ప్రతికథని తూర్పారబట్టే మాలతి ఈకథ చూడనట్టే తిరుగుతోంది. మధ్యాహ్నం టీ తాగేప్పుడు కన్పించేటట్లుగా బల్లమీద పెట్టాడు. మాటలు మారుస్తూ పత్రిక పక్కకి తోసేసి వేరే కబుర్లలోకి దింపింది. ఎంత ప్రయత్నించినా రచనల్ని గురించి ప్రసక్తి రానివ్వటంలేదు. మధ్యలో తుంపి దేనికో అతుకు పెడ్తుంది.

రాత్రి వేపచెట్టుగాలి చల్లగా వీస్తుంటే పాలు తీసుకొచ్చింది మాలతి.

"పాలు తాగండి

"పాలు తాగటానికి పరుగెత్తక్కర్లేదు గాని అట్లా కూర్చో"

"తలుపులు వేసివస్తా తప్పించుకో బోయింది.

"దాచుకునేందు కేమీ లేవులే చెయ్యిపట్టి కూర్చోపెట్టాడు.

'మొన్న పడ్డ కథ చదివారా?'

'ప్రాయశ్చిత్తం కదూ. చదివాను'

'ఎట్లావుంది?'

'బావుంది'

'ఇంతేనా?'

'అంతకంటె చెప్పటానికి నాకు కవిత్వం రాదు.'

'అందులోని నాయకుడు పిరికివాడు, తుమ్మెద, కాముకుడు.

'కాదు, సుఖదుఃఖాల్ని, ధర్మాధర్మాలని సమన్వయించి, ఉద్రేకాల పరిధిలో,మానవత హద్దులు దాటకుండా బ్రతుకుతున్న మనిషి. మనీషి.

'మరి నాయిక?'

'ఈర్ష్యా స్వభావురాలు.'

'కాదు.. నాకు మాటలేవు...దేవత.'

రాజు దేహాన్ని మాలతి తీవలా గాఢంగా పెనవైచింది. 

## అమెరికన్ చిత్రాలు

(62-వ పేజీ తరువాయి)

అద్భుతంగా నటించి ఆచిత్రం గొప్పతనానికి ఎంతో దోహదం చేశారు.

### మి అండ్ ది కర్నల్

కవ్వించి నవ్వించే సంఘటనలు స్వల్పంగా వున్నప్పటికీ, యీ ఏడాది నిర్మింపబడిన హాస్యరస ప్రధాన చిత్రాలలో "మి అండ్ ది కలనల్" దే అగ్రతా అగ్రతాంబూలం. దీనిలో డేనీకేం కొత్తరకం పాత్ర నిర్వహించాడు. నగరవాసియైన యూదుగా ఆయన నటన అద్భుతంగా వున్నది ఈ అపూర్వ "నాగరిక" చిత్రంలో వ్యంగ్యం, ఛలోక్తి, నటనలో సహజత్వం సమృద్ధిగా వున్నాయి.

### టీచర్స్ పెట్

హాస్యప్రధాన చిత్రాలలో "టీచర్స్ పెట్" మేటిగా ఎన్నికయింది. మొరటు ప్రకృతిగల వార్తాపత్రిక సంపాదకుడొకడు (క్లార్క్ గేబుల్), సంఘం కట్టుబాట్లకు బద్ధురాలైన జర్నలిజమ్ టీడర్ (డోలిస్)- ఈ రెండు ముఖ్యపాత్రలతో సామాజిక వ్యవస్థను వ్యాఖ్యానిస్తూ సున్నితమైన హాస్యంలో రూపొందిన ఈ చిత్రంగా "ఇట్ హాపెన్డ్ ఒన్ నైట్" చిత్రాన్ని జ్ఞప్తికి తెస్తున్నది.

### షి షి

హాలీవుడ్‌లో ప్రతి ఏడాది సంగీత ప్రధాన చలన చిత్రాలుకూడా తయారవుతూంటవి. 1958 లో నిర్మింపబడిన వాటిలో "షిషి"ని చాలకాలంవరకూ మరచిపోలేం. పారిస్‌లో, చలాకీగా, ఎవరినీ లెక్క చేయకుండా తిరిగి ఒక అమాయకపు పిల్లలొకవృత్తం తెలుసుకొని తెలివైన పెళ్ళికూతురుగా తయారయిన వైనం దీనిలో బాగా చూపించారు. ఈ ఇతివృత్తాన్ని లెస్లీ కెరవస్, లూయీజోర్డన్, నిత్యోల్లాసకరుడైన మారిస్ షెవలియర్ చక్కగా నటనలో పాటలో చూపారు. ఈ చిత్రం చూచినతర్వాత ఈనిర్మాతలు ఇలాంటి చలనచిత్రాలు మరికొన్ని అందిస్తే బాగుండునన్న అభిలాష ప్రేక్షకులకు కలుగుతుంది.

### డాంయాంకీస్

"డాం యాంకీస్" అంత గొప్పచిత్రం కాదు కాని చెప్పకోతగింది. బ్రాడ్వేలో సంగీతనాటకంగా విజయం సాధించిన ఇతివృత్తానికిది చలనచిత్ర రూపం. బేస్ బాల్ ఆట నేర్చుకోటానికి తదితర సుఖాలన్నీ త్యజించే ఒక నడివయస్సు క్రీడాభిమాని కృత్యాత్యవ్యవస్థలు ఇందు బాగా కొనవచ్చవి. ఈ చిత్రానికి వాల్ స్టన్, నాట్యతార గ్వెన్ వెర్డన్‌ల నటనతో పాటు బహువర్ణ ఛాయాగ్రహణం ఎంతో శోభ చేకూర్చింది.

### బిగ్ కంట్రీ

ఈ ఏడాది నిర్మింపబడిన వెస్టర్న్ చిత్రాలలో మేటిగా "ది బిగ్ కంట్రీ"ని ఎన్నుకోనటం చాలసులభం. దీనిని మామూలు స్టంటు చిత్రంగా తయారుచేశాడు. అయితే కన్నులపండువగా ఉండే వర్ణఛాయాగ్రహణం, వీనుల విందు చేకూర్చే సంగీతం దీనికి నిండుతనం సమకూర్చాయి. గ్రెగరీపెక్, జీన్ సిమన్స్, చార్లటన్ హెస్టన్, బరల్ ఐవ్స్, కెరాల్ బేకర్ మొదలైన నటులు మూడుగంటలసేపు నడచే ఈ చిత్రానికి జీవంపోశారు.

—నార్మన్ స్మిత్

## నిజం కావలసిన కలలు

(13-వ పేజీతరువాయి)

కొన్ని పనులు చేయాలి, తప్పదు!' అని అనుకుంటూ స్నానం చెయ్యటానికి కింది కెళ్లాను! స్నానాల గదిలో కూనిరాగం తీస్తూ చాలా చాలా ఆలోచించాను!

స్నానంచేసి పైకి వచ్చేటప్పటికి తలుపు కిందగా బాదంరంగు కవరొకటి లోనికి ప్రవేశించి నా కోసం ఎదురుచూస్తోంది! తుండుగుడ్డా, సబ్బుపెట్టే చాపమీదకి విసిరేసి—అట్లాగే వాకిట్లో కూర్చొని కవరు చించాను. ఎందుకో ఉదయం వచ్చినకల గుర్తొచ్చింది! ఆశగా, ఆతురతగా కవరు తెరిచాను. రెండేరెండు పంక్తుల సమాధానం: 'నీ అప్లికేషను అందింది. ఆ ఉద్యోగం నీకివ్వటం సాధ్యపడదు!'

ఆ వుత్తరం చూసి నేను నిలువునా నీరుకారలేదు, నిరాశలో కుంగిపోలేదు! ఇలాంటి వెన్ని జరిగాయో! అయితే నాకు నవ్వొచ్చింది—అంతకు కొద్దిక్షణాల పూర్వం ఆ ఉత్తరాన్ని చూసి ఆశాభావాన్ని కల్పించుకొని వుదయం చూసిన స్వప్నాన్ని స్మృతికి తెచ్చుకొన్నందుకు!

వెంటనే చాపమీద పడుకొని వుదయం చూసిన కలలాంటిదాన్ని మళ్ళీ కనాలనిపించింది. కాని ఇప్పుడెలా? ఖైరతాబాదు వెళ్ళాలి! మూడింటికి ఇంటర్వ్యూ! ఏమో ఎవరుచూశారు? లక్ష్మి నన్ను ప్రేమించినట్టుగానే ఆవుద్యోగంకూడా నన్ను వరిస్తుందేమో!

నిజంగా నాకు వుద్యోగంవస్తే ఎంతమంది సంతోషిస్తారు!

ఆరోజున లక్ష్మి మొహంమీద వెన్నెల తాండవిస్తుంది!

హోటల్ ప్రొప్రయిటరు—'నేను చెప్పలేదు నాయనా!' అంటాడు.

నారాయణరావు దగ్గర పదిహేను నయాపైసలు అప్పు చేయాల్సిన అవసరముండదు!

అద్దె వసూలు చేసేగుమాస్తా కర్ర చంకన పెట్టుకొని మరీ మాట్లాడిస్తాడు!

ఆరోజు!

ఆరోజు ఎంత మంచిరోజు!

ఆ మంచిరోజు కోసం ప్రయత్నించేందుకు నేనుబయలుదేరివెళ్తున్నా! బై, బై! ★





Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1 Editor S. Sambhu Prasad



సిగసింగారం

చిత్రకారుడు: కొర్లపాటి వెంకటసత్యనారాయణమూర్తి—వాల్తేరు.